# పెరిగే పిల్లలకి కావాలి కాంప్లాన్

## కేవలం కాంప్లాన్ లోనే వాళ్ళకు ప్రతి రోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.

పిల్లల పెరుగుదల సామాన్యంగా, వాళ్ళకి 15, 16 ఏళ్ళొచ్చేసరికి రమారమి పూర్తవుతుంది.

ప్రోటీన్లు, పెరుగుదలకు నేరుగా తోడ్పడే పోషక పదార్థాలు. అందుకే, మీ పిల్లలకు అవసరం, కాంప్లాన్—యిప్పుడు. కాంప్లాన్‌లో అత్యుత్తమమైన ప్రోటీన్లు-పాల ప్రోటీన్లు (20%) ఉన్నాయి. దాంతోబాటే దాన్లో 22 యితర కీలక ఆహారపదార్థాలు ఉన్నాయి.

కాంప్లాన్ రుచికరమైన సువాసనల్లో దొరుకుతుంది.




23

కీలక ఆహార పదార్థాలు ఆరోగ్యబద్ధమైన పాళ్ళలో

| | |
|---|---|
| ప్రొటీన్ | రిబోఫ్లావిన్ |
| కొవ్వు పదార్థాలు | నికొటినమైడ్ |
| కార్బొహైడ్రేట్ | కాల్షియమ్ |
| కెల్షియమ్ | పాంటొథెనేట్ |
| ఫాస్ఫరస | కోలిన్ |
| సోడియం, క్లోరైడ్ | పైరిడాక్సిన్ (బి6) |
| (సిఎల్ రూపంలో) | విటమిన్ బి12 |
| పొటాషియమ్ | ఫోలిక్ ఏసిడ్ |
| ఐరన్ | విటమిన్ సి |
| అయోడిన్ | విటమిన్ డి |
| విటమిన్ ఎ | విటమిన్ ఇ |
| విటమిన్ బి1 | విటమిన్ కె |

పాలు కలపనవసరం లేదు.



**కాంప్లాన్®** – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం













# అమృతాంజన్‌కే తెలుసు ఒంటి నొప్పులు మరియు బెణుకుల బాధ

OBM 8777 TG

మృదువైన మూలపదార్థము వల్ల
ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల
మందు శక్తికి రక్షణ




# అమృతాంజన్

ఏ ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి





1984 ఒలింపిక్స్ క్రీడలలో
పాల్గొన్న భారత క్రీడాకారులకు
అధికారపూర్వకంగా పెయిన్ బామ్
సరఫరా చేసినవారు

\# # # # # # # # # # # # # #

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

\# # # # # # # # # # # # # #

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

**శివలెంక శంభుప్రసాద్**
సంపాదకుడు:
(1938 - 1972)

శుక్రవారం : 5-11 ఏప్రిల్, '85
శ్రీ క్రోధన నామ సం. చైత్ర శు. పూర్ణిమ

**సంపుటము 77 : సంచిక 31**

సంపాదకుడు :

**శివలెంక రాధాకృష్ణ**

**ఆరు మాసాల చందా రు. 55-90**
**పోస్టులో ఏడాది చందా రు. 111-80**

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక






## ముఖచిత్రం

ఈ వారం పత్రిక మీద మా అభిమాన తార నటి 'సుహాసిని' ముఖచిత్రం వేసినందుకు చాలా థాంక్స్.

శోభన్, ఇతరులు, ఖర్గపూర్.

## వ్యక్తిగతం

15-21 ఫిబ్రవరి ఎన్టీఆర్ ముఖచిత్రము కల మన పత్రికలో క్రికెట్ స్టార్ అజరుద్దీన్ వ్యక్తిగతం ప్రచురించినందులకు నా కృతజ్ఞతలు.

శివప్రసాద్, అపిలేపల్లి.

## ద్వేషం

22,28 ఫిబ్రవరి సంచిక వుత్తరాల శీర్షికలో విశాఖ నుంచి టి. యస్. రావు గారి లేఖలో ... జయదుబాషి నుంచి ఎన్టీఆర్ పైకి దుమికి దుమ్మెత్తి పోయడం చూస్తే ... రావు గారికి ఎన్టీఆర్‌పై కేవలం వ్యక్తిగత ద్వేషం మెండుగా వున్నట్లు తోస్తుంది. నల్ల డబ్బు - సినీ నిగనిగలు ... ఏనాడూ వుదారంగా ప్రజా సేవ చేయని వ్యక్తిగా ఎన్టీఆర్‌ను రావు గారు విమర్శించడంలో సరియైన 'రాజకీయ లౌక్యం' లేదని నా అభిప్రాయం ... 1) నల్ల డబ్బు మనదేశంలో బడా రాజకీయ నాయకులు ఎందరు లేరు నల్ల డబ్బుతో హర్మ్యాలు నిర్మించినవారు?... మన పెట్టుబడి వ్యవస్థ కొందరి చేతుల్లో వుందంటే దానికి కారణం ఏమి? ఏ రాజకీయ వ్యవస్థ దాన్ని పోషించింది! 2) సినీ నిగనిగలు : కాంగ్రెసు ప్రభుత్వాలు పుట్టినప్పటి నుంచి కాంగ్రెసు లుక లుకలు + ఎన్టీఆర్ నిగనిగలు ఆంధ్రులకు సుపరిచయాలుగదా! 3) ఏనాడు ప్రజా సేవ చేయని వ్యక్తి నాటి రాయలసీమ క్షామ బాధితులకు, 1965 పాకిస్తాన్ వార్ టైం-నందు, 1977లో తుఫాన్ బాధితులకు, విజయవాడ అగ్ని బాధితులకు అతి సహజంగా ఆదుకుని అటు ప్రభుత్వానికి ప్రజలకు సేవ చేయడం సర్వ విదితము కాదా!

మరి కాంగ్రెసు - ఆ రకం రాజకీయవాదులకు 40 శాతం మార్కులతో పాస్ చేసి, మా ఎన్టీఆర్‌కు మాత్రం 100 శాతం మార్కులు వస్తేగాని పాస్ చేయనంటే మాత్రం అది ఏ ధర్మశాస్త్ర తీర్మానమో నాకు అవగతం కాదు.

పి. ఆర్. మూర్తి, కడప.

## చిరునామా

సుహాసిని ముఖచిత్రంతో వెలువడిన మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1-7, మార్చి, '85 సంచికలో "హైదరాబాదు నోట్ బుక్"లో శ్రీ తిరుమల రామచంద్ర గారు మా గ్రామ వాసులైన సిద్ధాంతి గారి చిరునామా శ్రీ వేమూరి రామమూర్తి సిద్ధాంతి గారు, పురుషోత్త పిల్లి పోస్టు, వయా నిడుదవోలు, తూర్పు గోదావరి జిల్లా, (ఆం. ప్ర.) అని తెలియజేసారు. కాని, జిల్లా తూర్పు గోదావరి కాదు. సిద్ధాంతి గారి పూర్తి చిరునామా ఈ దిగువన తెలియజేస్తున్నాము.

శ్రీ వేమూరి రామమూర్తి సిద్ధాంతి గారు.
పురుషోత్తపల్లి పోస్టు,
వయా నిడదవోలు, కొవ్వూరు తాలూకా,
పశ్చిమ గోదావరి జిల్లా. పిన్ 534392.

మా సిద్ధాంతిగారిని పాఠకులకు పరిచయం చేసిన శ్రీ రామచంద్రగార్కి, ఆంధ్రపత్రికకు మా కృతజ్ఞతలు.

ముళ్లపూడి శ్రీదేవి, ఇతరులు, పురుషోత్తపల్లి.

## వ్యాసాలు

8-14 ఫిబ్రవరి 85 వారపత్రికలో 'కెప్టెన్ మౌ లాలి'గారి వ్యాసం చదివినతరువాత ఈ ఉత్తరం వ్రాయకుండా ఉండలేకపోయాను.

"యోగులను పరీక్షించే స్థాయికి మన విజ్ఞానం ఎదగలేదు"అనడం ఈ శతాబ్దాన్నే సవాలు చేసినట్లుంది. ఈనాటి విజ్ఞానాన్ని యాంత్రిక మైనదిగా పోల్చినపుడు ఆయన 'హిప్న టిజాన్ని' మరచినట్లున్నారు. లక్షల రూపాయల ఖరీదు చేసే 'బిల్డింగ్' లో కూర్చుని 'బాలయోగి'కి మహిమలున్నాయి నమ్మమనటం పచ్చి అవివేకం. పూర్వపు ఋషులంచరు బిల్డింగు లలోనే తపస్సులు చేసారా?

"సం.ని కొకసారైనా మా సేవకులకు దర్శనము నిండు" అని భక్తులు కోరగా "సరే" నన్నారని వ్రాసారు. 40 సం.లుగా కూడూ నీళ్ళూ లేకుండా తపస్సు చేస్తున్న బాలయోగిని మా ఎదుట ఒక్క నెల రోజులు మాత్రమే కూర్చోనమని" మేమూ కోరుతున్నాం. ఇది బాలయోగి మన్నించగలరా? వ్యాసకర్త అంచుకురికమంత్ చెయ్యగలరా? యోగి అయినా, భోగి అయినా ఒక మనిషి ఆహారం తీసుకుంటున్నాడా?లేదా?అనే విషయాన్ని నిర్ధారించలేని స్థితిలో సైన్సు లేదని తెలుసుకోవలసిన అవసరం ఉంది.

ఏ కనెక్షనూ లేని రాకెట్టుని క్రింద నుంచి, సెకనులో వెయ్యోవ వంతు సమయంకు కూడా కంట్రోలుచెయ్యగలుగుతున్నఈ రోజుల్లో దగ్గర లేకుండా గది తలుపులు తియ్యడం, వెయ్యడం ఒక లెక్కా?

**సిద్ధినేని** వెంకటేశ్వరరావు, గుడివాడ. □

న్యూఢిల్లీ లేఖ



డా. జయదుభాషి

# ఆధునికీకరణ ఫలితాలు అందరికీ అందాలి

రాజీవ్‌గాంధీ బొంబాయిలో పుట్టారని విన్నాను. ఆయన తల్లి అక్కడికి వెయ్యి మైళ్ల దూరంలో ఉన్న అలహాబాదులో జన్మించారు. అందువల్లే ఆయన తమ తల్లిగారికంటే భిన్నంగా వుంటారు. కానీ కొంతమంది అంత పెద్ద తేడా ఏమీ వారి మధ్యలేదనే వాళ్లు కూడా ఉన్నారు. నెహ్రూలందరూ ఒక మూసలోని వారే. వాళ్లు చెప్పేవి, చేసేవి మనం ముందుగానే ఊహించగలవిగానే ఉంటాయి. జవహర్‌లాల్ నెహ్రూ ఎప్పుడూ ఆధునికీకరణ గురించి మాట్లాడేవారు. అంటే స్వాతంత్ర్యానికి పూర్వం, ఆధునికీకరణ అంటే తెలియని రోజుల్లో సంగతి ఇది. నిరాడంబరమైన స్వావలంబన ఎంతైనా అవసరమని మహాత్మాగాంధీ వాదించేవారు. ఆధునిక శాస్త్ర సాంకేతిక విషయాలతో దానికి ఎలాంటి సంబంధం లేదు. నెహ్రూ మాత్రం ఆధునిక శాస్త్ర సాంకేతిక పద్ధతులు, ఉక్కు కర్మాగారాలు, విద్యుత్ కేంద్రాలు, పంచవర్ష ప్రణాళికలు, పారిశ్రామికీకరణ ద్వారా దారిద్ర్య నిర్మూలన గురించి అదేపనిగా చెబుతూ ఉండేవారు. ఆయన బొంబాయిలో ఉన్నప్పుడు చాలా ఆనందంగా గడిపి ఉంటారు. ఇప్పుడు ఉన్నట్లుగానే ఆ నగరం ఆ రోజులలో కూడా చాలా ఆధునికంగా ఉండేది. ఈ దేశం 21వ శతాబ్దంలో అడుగు పెట్టేసరికి చాలా పల్లెటూళ్ళతో సహా అన్ని నగరాలూ బొంబాయిలాగే ఉంటాయి.

బొంబాయిఅందంగాఉండవచ్చు. హడావిడిగా ఉండవచ్చు. కానీ అది అంత ఆహ్లాదకరమైన ప్రదేశం మాత్రం కాదు. ఏదో ఒక మాయచేసి బతికే వాళ్ళతో అది నిండి ఉంటుంది. సఫారీ దుస్తులు వేసుకున్న వ్యాపారస్తుడికీ, రోడ్డుమీద ఉన్న నేరస్తుడికీ ఒక మెట్టు తేడా మాత్రమే ఉంటుంది. రోడ్డుమీది వ్యాపారి చేసేది దొంగ రవాణా అయి ఉంటుంది. మారకద్రవ్యాలు దొంగ చాటుగా అమ్మేవారితో చేతులు కలిపే డాక్టర్లు, తమకన్నా పెద్దవారికి తార్పుడుగాళ్లలా పనిచేసే రాజకీయవాదులు అక్కడ ఉంటారు. వాళ్ళందరినీ ఒకరితో మరొకరిని కలిపేది డబ్బు. బొంబాయిలో ఉన్నంత డబ్బు మరేనగరంలో లేదు. అది చాలా ఆధునికమైన నగరం కాబట్టి అక్కడ చేతినిండా డబ్బే. దొంగ రవాణాదారులు చాలా వేగంగా వెళ్ళే కార్లని, మర పడవలని వాడుతారు. కొందరికి స్వంత విమానాలుకూడా ఉన్నాయి. అక్కడ ఉన్న ఎంతో గౌరవనీయమైన ప్రదేశాలలో హాజీమస్తాన్ మీకు కనిపిస్తారు. అంతూలే పేరు చెబితేచాలు తను చేతులను పైకెత్తి టోపీలకి తాకించే వ్యక్తులు ఆ పట్నంలో ఉన్నారు. ఖరీదైన కాంటినెంటల్ హోటళ్లలో భాభాలు, తాతాలకి సంబంధించిన కేర్‌కర్‌లతో కలిసి విందులు వినోదాలలో అంతూలే, హాజీమస్తాన్‌లు పాలు పంచుకున్నారు. వాళ్ళు అధికారంలో ఉన్నప్పుడు అలా సాగేది. అధికారపార్టీ కష్టాలలో పడినప్పుడు, నిధులకోసం తిరిగేటప్పుడు వీళ్ళే మళ్ళి విజృంభిస్తారు. మూడు నాలుగేళ్ల కిందటిలాగే భాభాలు, కేర్‌కర్‌లూ తిరిగి వాళ్ళవెంటపడతారు. ఆధునిక సమాజంలో డబ్బు, అధికారం ఒక దానితో మరొకటి మార్చుకో తగినటువంటివి. వాటిలో ఏది మీదగ్గర ఉన్నా రెండోది కూడా ఉన్నట్లే.

కానీ ఇది ఇలాగే ఉండాల్సిన అవసరంలేదు. ఆధునికీకరణ సాంకేతిక పరిజ్ఞానంతో ముడిపడి ఉంటుంది. సాంకేతికవిజ్ఞానం సంస్కృతికీ, హింసా సంస్కృతికీ దగ్గరి సంబంధం ఉంటుందనీ, అందువల్ల సమాజం ఆధునికం, ధనవంతం అయితే కావచ్చుకానీ హింసకి అవినీతికీఆలవాలమై, సమయం కోసం పొంచి ఉన్న నియంతలు దానిని కబళించేందుకు అనువుగా రూపొందుతుందని నమ్మే చాలామందిలో గాంధీ కూడా ఉన్నారు. గాంధీ దృష్టిలో ఆధునికీకరణకి అర్థం ఇదే. అంతేకాకుండా ఉన్నతమైన సాంకేతిక పరిజ్ఞానం, ఆధునికత అంత మంచివి కావని, వాటివల్ల ఎన్నో చిక్కులు సమాజంలో ఉత్పన్నమవుతాయని, దేశంలో దాదాపు సగం మంది ఉన్న పేదవారికి వాటివల్ల ప్రయోజనం కలగదనీ నమ్మేవాళ్లు ఎంతోమంది ఉన్నారు.

నా దృష్టిలో ఇది పరాజయవాదం. మనిషిలో ఉండే మానవత్వం, మానవత్వరహితమైన అంటే సాంకేతిక పరిజ్ఞానాన్ని మించి ఎదగటానికి ఇది తగినంత దోహదం కల్పించదు. సాంకేతిక విజ్ఞానం వినియోగం పెరిగితేనే అభివృద్ధి సాధ్యం అవుతుంది. ఇప్పుడు మనకి రెండు రకాల భారతదేశాలు ఉన్నాయి. ఒకటి పేదది, రెండోది ఇదివరికటికన్నా మెరుగైనది. ఒకటి ముందుకి చొచ్చుకుని పోతున్నటువంటిది, రెండవది వెనుకబడే ఉండిపోతున్నటువంటిది. అయినా పేదరికం అన్నది సంపన్నమైనటువంటి దాని సృష్టి కాదు. ఆధునిక సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించే పరిశ్రమలు ఎంతో మందికి ఉద్యోగాలని కల్పిస్తాయి మెరుగైన జీత భత్యాలని వారికి అందిస్తాయి. ఇంతకుముందు ఉన్న పేదరికంలోనించి వారిని బయటపడేలా చేస్తాయి. కనిపించిన ప్రతి వ్యక్తికీ ఉపాధిని కల్పించలేకపోవడం పరిశ్రమల, సాంకేతిక పరిజ్ఞానంలోపంకాదు. విజ్ఞానశాస్త్రం, సాంకేతిక పరిజ్ఞానం కలిసి ఉన్న వ్యవస్థకే రాజకీయ







## — న్యూఢిల్లీ లేఖ —

సామాజిక ప్రయోజనాలు ఉంటాయి. మీకు ఉన్న వ్యవస్థని బట్టి సమాజ రాజకీయ వ్యవస్థ కూడా ఆధారపడి వుంటుంది. ప్రజాస్వామ్య దేశంలోని ఒక నాయకుడి చేతిలో ఉన్న అత్యంత ప్రమాదకరమైన రసాయనిక ద్రవ్యానికీ హిట్లర్ స్టాలిన్ వంటివారి చేతిలో ఉన్నదానికీ ఎంతో తేడా ఉంది. సాంకేతిక విజ్ఞానం, ఉన్నత సాంకేతిక పరిజ్ఞానం ప్రజాస్వామ్య విరుద్ధమైన సమాజానికి దారి తీస్తాయన్నది పూర్తిగా భిన్నమైన, అంగీకారం కానటువంటి వాదన. బ్రిటన్, అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఉన్నతమైన సాంకేతిక పరిజ్ఞానం గల దేశాలైనా అవి ఇప్పటి వరకూ ప్రజాస్వామ్య సమాజాలకి ఉండే విలువలు కలిగి ఉన్నటువంటివే.

కాబట్టి నేను ఆధునికీకరణని వ్యతిరేకించను. ఇంకా చెప్పాలంటే దానిని నేను ఆహ్వానిస్తాను. సాంకేతిక విజ్ఞానానికి స్వాగతంచెప్తాను. మన సమాజంవంటి దానిలో సాంకేతిక విజ్ఞానం వియోగంతో సంబంధంకల అన్నిటినీ నేను ఆహ్వానిస్తాను. దేశంలోఉన్న పేదరికం ఆదిగాగల అస్వస్థతలన్నీ పోవడానికి ఆధునికీకరణ తప్ప మరోమార్గంలేదు. రాజీవ్ గాంధికికూడా దీనిలో నమ్మకం ఉన్నదంటే తేడా ఏమీ ఉండదు. నేను ఆయనతో, ఆయన తల్లిగారితో విభేదించే విషయం ఒకటే ఉంది. ఆధునికీ కరణవల్ల పూర్తి ప్రయోజనం కలగటానికి తగినటువంటి సామాజిక, రాజకీయ వ్యవస్థ అవసరం. అంతేకానీ ఉన్నతస్థాయిలో ఉన్న ఎవరో కొద్దిమందికోసం మాత్రం కాదు. అట్టడుగున ఉన్న ప్రజానీకానికికూడా దీని ప్రతిఫలం అందాలి. కొండమీద బంగళాలో ఉండే వ్యక్తికీ, ఫుట్‌పాత్‌మీద పడుకునే పేదవాడికీ ఆధునికీకరణ ఫలితం సమానంగా అందాలి. అలా సాధ్యంకానప్పుడు తగిన విధంగా సమాజం అందుకు దోహదం కల్పించాలి. ఆయన దానిని సాంకేతిక విజ్ఞానంద్వారా తప్ప మరో విధంగా సాధించలేరు. అందుకు ఆయనకి దాని గురించిన పూర్తి అవగాహన అవసరం. పేదరికం విషయంలో శ్రీమతిగాంధీకి స్వలాభాపేక్షతో కూడుకున్న ఆసక్తి ఉండేది. కానీ ఆమె కుమారుడు కూడా అలాగే ఉంటారా అన్న విషయంలో నేనేమీ చెప్పలేను. అలా ఉన్నా నాకేమీ ఆశ్చర్యం అనిపించదు. ఆయనకి కూడా అలాంటి అభిప్రాయాలే ఉన్నట్లయితే దాదాపు ఈయన తల్లిగారిని వ్యతిరేకించినట్లే ఆయనని కూడా నేను వ్యతిరేకిస్తాను. అయినా ఆధునికీకరణని మాత్రం వ్యతిరేకించను. అది భారత దేశానికి ఆత్మహత్యా సదృశమే అవుతుంది. దేశానికి ఆత్మహత్యా సదృశమైతే అది మనకి మరణమే అవుతుంది. □



# పడమటి సంధ్యారాగం

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

ఆరోజు శుక్రవారం ....

తలంటుకో కుంకుడుకాయలు కొట్టాను జడ విప్పుకని రా, నూనె పెడ తాను అన్నది అన్నపూర్ణమ్మ మెత్తని గొంతుతో

తలయెత్తి ఆమె కళ్ళలో చూసింది చాయ

ఆ కళ్ళలో లీలగా మెరుస్తున్న తడి!

చాయ కళ్ళు కూడా నీళ్ళతో నిండాయి

పెద్దదాన్ని, చాదస్తంగా ఏదో అంటూ ఉంటాను అవేం పట్టించుకోకు తండ్రి లేని పిల్లవు నేనా ఏది చేతకాని దాన్ని ఆస్తిపాస్తులసలే లేవు నీకు పెళ్ళి కాదేమో అనే బాధ అప్పుడప్పుడు నాచేత అలా మాట్లాడిస్తుంది అంతేగానీ నీమీద నాకు పగేమిటమ్మా' అంటూ ఆర్ద్రంగా చాయను దగ్గరకు తీసుకుంది అన్నపూర్ణమ్మ

అప్పటిదాకా బరువుగా దిగులుగా ఉన్న ఛాయ మనసు తేలికగా మారిపోయింది

★ ★ ★ ★ ★

బాటనీ లెక్చరర్ శ్రీనివాసరావు తన స్టూడెంట్స్‌తో కలిసి గార్డెన్‌లో కొస్తున్నాడు అప్పటికే రాజారావనే బి కాం స్టూడెంటు గార్డెన్లో కూర్చుని సిరెట్ కాలుస్తున్నాడు

బయట నుంచున్న ఇంకో స్టూడెంట్ ఒరే రాజా సిగరెట్ పారెయ్యరా, శ్రీనివాసరావు సారొస్తున్నాడు అన్నాడు

పోరా! అన్నాడు అతను నిర్లక్ష్యంగా

ఎవడ్రా వాడు?" అంటూ ముందుకొచ్చాడు శ్రీనివాసరావు

ఎవడ్రా వాడేమిటి? మాటలు జాగ్రత్తగా రానీ సారూ, ఇంటి దగ్గర మా నాన్నే ఏరా అనడు అన్నాడు రాజారావు

**జరిగిన కథ-2: : ఇందుకూరు కాలేజీలో ఛాయకు ఎకనామిక్స్ లెక్చరర్‌గా ఉద్యోగం వచ్చింది. తల్లి అన్నపూర్ణమ్మ, తమ్ముడు రాజీవ్‌తో ఇందుకూరు వచ్చేసింది ఛాయ సుధీర్ ఛాయ వాళ్ళ మేడమీద గదిలో ఉంటుంటాడు. విజయ కుటుంబానికి, ఛాయవాళ్ళ కుటుంబానికి సన్నిహితం ఏర్పడుతుంది. సుధీర్ ఛాయను ప్రేమిస్తున్నట్లు గ్రహిస్తుంది విజయ. కాలేజీలో విద్యార్థుల వైఖరిలో మార్పు తేవాలనుకుంటుంది ఛాయ. సుధీర్ ఛాయను ప్రేమిస్తున్నాడని, అమె అంగీకారమైతే వివాహం చేసుకుంటాడని విజయ చాయతో చెపుతుంది ఛాయ మేనమామ ఛాయను పెళ్ళి చేసుకుంటానని చాయ తల్లితో చెప్తాడు. ఛాయ అందుకు నిరాకరించిందని అతను కోపంగా వెళ్ళిపోతాడు**

మాటా మాటా పెరిగి కాలర్స్ పట్టుకోవటం దాకా వెళ్ళింది వ్యవహారం.

"పిచ్చి పిచ్చిగా వాగితే ... తోలు ఒలిపించెయ్యగలను, జాగ్రత్త". అన్నాట్ట రాజారావు చివరిగా.

మొహం కందగడ్డలా చేసుకుని ప్రిన్సిపాల్‌కు రిపోర్టిచ్చి యాక్షన్ తీసుకోమని పట్టుపట్టాడు శ్రీనివాసరావు

"ఇప్పటికిప్పుడు యాక్షన్ తీసుకుని తేల్చెయ్యాలంటే ఎలా? రిపోర్టిచ్చారుగా ఇహ వెళ్ళండి తరువాత చూస్తాను అతని వెనకాల చాలా బ్యాక్‌గ్రౌండుంది' అన్నాడు ప్రిన్సిపాల్

"ఇది మా ప్రిస్టేజ్‌కి సంబంధించిన విషయం ఒక స్టూడెంట్ లెక్చరర్ని కాలర్ పట్టుకుని బెదిరించటమా! ఇలా అయితే ఇక్కడ ఉద్యోగాలు మేమేం చెయ్యగలం? ఏమీ జరగనట్లు వాళ్ళకు పాఠాలు చెపుతూ కూర్చోటానికి మాకేం పౌరుషం లేదా? రేపొద్దున్న ప్రతి వెధవా ఇలాగే ప్రవర్తిస్తాడు"

'మీకా నోటి దురుసే ఒద్దు నేను చూస్తానన్నానుగా? మీరెళ్ళండిక' అన్నాడు ప్రిన్సిపాల్

'లెక్చరర్సంతా స్టూడెంట్స్ కింత చులకనా! పోరా నువ్వెంత అనే విద్యార్థితో మనమేం సర్దుకుపోతాం?

చర్య తీసుకోవాలంటే ప్రిన్సిపాల్‌కు భయం బ్యాక్‌గ్రౌండుంది సింగినాద ముందని నసుగుతాడు మనం వూరుకుంటే వాళ్ళింకా రెచ్చిపోతారు

మనమంతా ఐకమత్యంగా దీన్ని ఎదిరించాలి అవసరమైతే స్ట్రైక్ చెయ్యాలి ముందు రాజారావుకు టి సి ఇచ్చి పంపేదాకా మనం నిద్రపోగూడదు' అంటూ స్టాఫ్ రూంలో కొచ్చి ఉద్రేకంగా అన్నాడు శ్రీనివాసరావు కొందరతన్ని సపోర్టు చేశారు మరి కొందరు "అసలీయన ఆ స్టూడెంట్‌ను ఏరా అని ఎందుకు రెచ్చగొట్టాలి? అన్నారు

ఈ శ్రీనివాసరావు కన్నింగ్ ఫెలో నోటి దురుసు ఎక్కువ ఇతన్ని నమ్మటానికి లేదు" అన్నది విజయ

అయినా, మనం సంతకాలు పెట్టాం గదా?" అన్నది చాయ

"ఏం చేస్తాం? ఒకవేళ నిజంగా మనకేదయినా అన్యాయం జరిగితే వీళ్ళెవరూ సపోర్ట్ చెయ్యరు ఆ రోజు మాకు సపోర్ట్‌గా నువ్వు సంతకాలు చేశావా అంటారు అందుకని ఇష్టంలేకున్నా ఇలాంటివి తప్పవు అన్నది విజయ

రాజారావుకు టి సి ఇచ్చి పంపిస్తే స్ట్రైక్ చేస్తామని విద్యార్థులు ఆల్టిమేటం ఇచ్చారు

ఇవ్వకుంటే మేం స్ట్రైక్ చేస్తామని లెక్చరర్స్ నోటీసిచ్చారు

రాబోయే స్టూడెంట్స్ ఎలక్షన్‌లో ఈ గొడవల ప్రభావం ఎంత దారుణంగా ఉంటుందోనని ప్రిన్సిపాల్ ఆందోళన

ఇంకో రెండేళ్ళలో రిటైరవుతాడాయన ఇప్పుడే రిజైన్ చేసి పారిపోవా' లనిపిస్తోంది

ఆయన రూంలోకి వెళ్ళబోయిన చాయ లోపల్నుంచి ఆయన కంఠం పెద్దగా వినపడటంతో సంకోచంగా ఆగిపోయింది

ప్రతి చిన్న విషయానికి మీరు నా దగ్గరకొచ్చి రిపోర్టివ్వటమేమిటండి? ఎవళ్ళ క్లాస్ వాళ్ళు కంట్రోల్ చేసుకోలేరూ?

స్టూడెంట్స్ తిరగబడుతుంటే ఏంచెయ్యాలి? ప్రభుదాస్ అనే ఓ లెక్చరర్ కంఠం

ఎందుకు తిరగబడతారు? అది మీరిచ్చిన అలుసు కాదూ? శ్రావణకుమార్, మన్‌మోహన్ గార్లు ఆఖరికి లేడీ లెక్చరర్స్ చాయ విజయ సువర్చల గార్లు కూడా నా దగ్గరకొచ్చి ఇలా రిపోర్టు లివ్వరు వాళ్ళనంత గౌరవంగా చూసే స్టూడెంట్స్ మీలాంటి కొందరి మీదే ఎందుకు తిరగబడుతున్నారు?

మీ ప్రిన్సిపుల్స్ మీ స్టేజి మర్చిపోయి, వాళ్ళతో కలిసి బార్‌కెళ్ళి అక్కడ వాళ్ళ డబ్బుతో తాగి తందనాలాడుతుంటిరి మీ అవసరాలకి వాళ్ళను వాడుకుంటిరి మీమీద వాళ్ళకేం గౌరవముంటుంది? మీరంటే ఎందుకు భయముంటుంది? వాళ్ళ దగ్గర డబ్బు తీసుకుని పరీక్షల టైంలో వాళ్ళకు స్వయంగా కాపీలందించే పెద్ద మనుష్యులున్నారు మీలో ఇవన్నీ నాకు తెలియవనుకోకండి నేను బయట-

వాళ్ళిద్దరూ మాటా మాటా అనుకుంటుంటే చాలామంది లెక్చరర్లు అక్కడే వుండి వినోదం చూస్తున్నారు గాని ఒక్కళ్ళు కూడా ముందుకు వచ్చి సర్దుబాటు చెయ్యటానికి ప్రయత్నించలేదు పైపెచ్చు అటూ యిటూ పుల్లలు పెట్టి ఎగదోశారు

అదే మా స్టూడెంట్సయితే ఏ ఒక్కడికి అన్యాయం జరుగుతున్నా కలిసికట్టుగా పోరాడి దాన్ని అరికడతాం అన్నాడు రాజీవ్

గొప్ప మొనగాళ్ళలే చదువుకో నువ్వు గొడవల్లో తలదూర్చకు అన్నది చాయ

అదేం మాటక్కా రేపు నాకేదయినా జరిగినప్పుడు వాళ్ళూ ఇలాగే ఆలోచిస్తే? అప్పుడు నా గతి ఏమిటి? ఈ స్పృహ మాలో ప్రతి ఒక్కడికి ఉంది అందుకే ఎవరెంతగా ప్రయత్నించినా మమ్మల్ని పిరికివాళ్ళుగా మార్చలేరు

ఇంకేం మాట్లాడలేకపోయింది చాయ

లెక్చరర్స్ స్ట్రైక్ మొదలెట్టారు

కాలేజి లేదు

అస్తమానం ఇంట్లోనే కూర్చుని కూర్చుని బోర్ కొడుతోంది

సుధీర్ కూడా లేడు



పడితే బాగోదని ఊరుకుంటున్నాను మీలో కూడా మార్పు రావాలండీ అంతవరకూ ఈ పరిస్థితులింతే చర్య తీసుకోలేదని నన్ను బ్లేమ్ చేస్తే బాగోదు

అస్తమానం నేను యాక్షన్ తీసుకోటం వాళ్ళు స్ట్రైక్ చెయ్యటం పోర్షన్ కాకపోవటం ఏమిటిదంతా?

మీరు కూడా ఆలోచించండి తప్పెవరిదో ప్రిన్సిపాల్ కంఠంలో పదును చురుక్కుమనిపిస్తోంది

వెనుతిరిగి వచ్చేస్తున్న చాయను చూసి నవ్వుతూ మీరూ రిపోర్టివ్వటానికేనా? అన్నాడు శ్రావణకుమార్

చ! లేదండీ! కాస్త పనుండి వెళ్ళాను ఆయన మూడ్ బాగున్నట్లు లేదని వచ్చేశాను అన్నది చాయ

అసలే శ్రీనివాసరావు లేవదీసిన గొడవతోనే మతి పోగొట్టుకుంటున్నాడాయన మధ్య మధ్యలో మిగిలిన వాళ్ళ గొడవొకటి

ఈ కాలేజీలో మాత్రం స్టూడెంట్ల విపరీత ప్రవర్తనకు చాలావరకూ లెక్చరర్సే బాధ్యులు అన్నాడు శ్రావణకుమార్

ఇంటికొచ్చాక అక్కా! తప్పంతా శ్రీనివాసరావు సార్‌దే ఆయనే మొదట రాజారావుని అవమానించాడు అసలు మీ లెక్చరర్స్‌కి మీలో మీకే ఐకమత్యం లేదు

ఎక్కడికి దయచేశాడో మహానుభావుడు

వారం రోజులయింది అతను రాలేదు

కొంపతీసి ఖాళీ చేశాడా?

గబగబా మేడమీదికి వెళ్ళింది చాయ గది తాళం వేసి ఉంది కిటికీ తెరిచి ఉంటే లోపలికి తొంగి చూసింది

థాంగ్గాడ్! ఖాళీ చెయ్యలేదు అనుకుంటున్న చాయ దృష్టిని ఓ వస్తువు ఆకర్షించింది

మంచంమీద నీలం అట్ట వున్న ఓ పుస్తకం ఉంది అందులో పేజీలు గాలికి రెప రెప లాడుతూ కాస్త గాలి విసురు తగ్గగానే అలా తెరుచుకుని ఉండిపోయాయి అందులో చా

చెయ్యి చాపితే అందుతుంది

తీసి చూస్తే?

చూడొచ్చా?

పర్వాలేదు డైరీ కాదుగా అనుకుంటూ ఆ పుస్తకాన్ని అందుకుని ఒక్కో పేజీ తిరగేస్తున్న చాయ కళ్ళు పత్తికాయల్లా అయ్యాయి

రామకోటి రాసినట్లుగా తన పేరు అందమైన అక్షరాలతో ఆ బైండు బుక్కు నిండారా ఉంది!

మైగాడ్! ఈ సుధీర్‌కెంత పిచ్చి! నిజంగా తననంతగా ప్రేమిస్తున్నాడా?!

ఓసి వెర్రి మొహం ఆడపిల్లా అలా వందలసార్లు పేర్లు రాయటమే ప్రేమకు ఓ గొప్ప సింబల్ అయితే వందలసార్లు కాదు వేల సార్లు రాసి







# పడమట సంధ్యారాగం

ప్రేమిస్తున్నానని ఆడదాన్ని నమ్మించటం మగాడి కెంత ఈజీ!" అని గేలి చేసింది మనసు

"ఛీ! ఈ మనసు కెప్పుడూ నిరాశా వాదమే! అనుమానాలతో ఉత్సాహాన్ని ఊదేసినట్లుగా మాయం చెయ్యటం దీని కొక్క దానికే చేతనవును!" అనుకుంటూ ఆ బైండును మళ్లీ కిటికీలోనుంచి యథాస్థానంలో పెట్టి, కింది కొచ్చేసింది ఛాయ

ఇప్పుడామె ఊహలనిండా సుధీరే

★ ★ ★ ★ ★

మొత్తానికి ఎలాగో లెక్చరర్స్‌ను కన్విన్స్‌చేసి, వాళ్ళచేత స్ట్రైక్ విరమింప జెయ్యటంలో కృతకృత్యుడయ్యాడు ప్రిన్సిపాల్! కాలేజీ మళ్లీ మామూలుగా జరుగుతోంది

రొటీన్‌లో పడిపోయింది ఛాయ

రాజీవ్ ఫైనలియర్‌లో కొచ్చేశాడు

ఒకరోజు ఛాయ చేతికి శుభలేఖ ఇస్తూ "మా చెల్లెలి పెళ్లి మీ అమ్మగార్ని తీసుకుని నువ్వూ, రాజీవ్ రండి సుధీర్ కూడా వస్తున్నాడు మీకా ప్రాంతం కొత్తగదా? అతను తోడుగా ఉంటాడు రాకుండా టోకరా ఇచ్చావో నీ పెళ్లికి నేనూ రాను గుర్తుంచుకో " అంటూ మరీ మరీ చెప్పింది విజయ

వారంరోజులు ముందుగానే వెళ్లిపోయిందామె

ఆ రోజునాటికి ఛాయ, సుధీర్, రాజీవ్ బయలు దేగారు పెళ్లికి అన్నపూర్ణమ్మ రానన్నది

ఛాయ, సుధీర్‌ల మనసులు ఏదో తెలియని ఉద్వేగంతో స్పందిస్తున్నాయి

వీరాపురం అడ్డరోడ్డు దగ్గర బస్సు దిగారు అక్కడనుంచి అయిదు మైళ్ళు లోపలికి పోతేనేగానీ ఊరురాదు

"మీరేకదండీ ఛాయగారంటే?" అంటూ ఒక యువకుడు దగ్గరగా వచ్చాడు

"ఔనండీ మీరు " అన్నది ఛాయ

"నేను విజయ తమ్ముణ్ని, నా పేరు సారధి రండి ఈ బండిలో ఎక్కండి

"ఓహ్! సారధివా! నిన్ను చాలా చిన్నప్పుడు చూశాను " అన్నాడు సుధీర్

"మీరు సుధీర్‌గారు కదూ? మా వాళ్ళంతా అనుకోగా వినటమే నాకు ఊహ తెలిశాక మీరిటు వేపు రానేలేదు " అన్నాడు సారధి

"అయామ్ రాజీవ్ ఛాయ తమ్ముణ్ని" చెయ్యి ముందుకు చాపుతూ అన్నాడు రాజీవ్

"వీరన్నా వీళ్ళని జాగ్రత్తగా ఇంటికి తీసుకెళ్ళు " అన్నాడు సారధి

"అదేం? మీరు రారా?"

'తరువాత బస్సుల్లో ఇంకా పెళ్లి జనం వస్తారు వాళ్ళను రిసీవ్ చేసుకోవాలి మీ రెళ్లండి విజయక్క ఉన్నది గదా " అన్నాడు సారధి

రాజీవ్ ఎగిరి బండిలోకి గెంతి, ఛాయకు చెయ్యందించాడు

"బాబోయ్ ఎక్కలేనురా! భయమేస్తోంది " అన్నది చాయ

"నేను సాయం చెయ్యనా?" అన్నాడు సుధీర్

"ఎలా అన్నది ఛాయ "

"ఇలా " అంటూ రెండు చేతులతో ఆమె నడుము పట్టుకుని పైకెత్తాడు తను రాజీవ్ బండిలోకి లాగాడు తరువాత సుధీర్ ఎక్కి ఛాయ ఎదురుగా కూర్చున్నాడు వీరన్న పగ్గాలు పట్టుకు నడుస్తుంటే" నాకు బండి తోలటం సరదా," అంటూ తొట్లో కూర్చున్నాడు రాజీవ్

ఛాయ ముఖంలో ఇంకా ఎరుపు తగ్గలేదు ఆమె కళ్ళలో కదులుతున్న సిగ్గు తెరల్ని కుతూహలంగా గమనిస్తున్నాడు సుధీర్

"ఈ దూరం అయిదు మైళ్ళు కాకుండా, కనీసం యాభై మైళ్ళన్నా ఉంటే బావుండును " అన్నాడతను నెమ్మదిగా

"నయం చస్తాం ఒళ్ళు హూనమై" అన్నదామె

రాజీవ్ ఎడ్లు నదిలించేసరికి బండి గుంటలో దిగి ఒక్క జర్క్ ఇచ్చింది

ముందుకు తూలి, ఆపుకోటంకోసం అప్రయత్నంగా సుధీర్ ఒడిలో చేతులు వేసింది ఛాయ

ఆమె చుట్టూ అతని చేతులు బిగుసుకున్నా యొక్క క్షణం మంచులో తడిసిన విరజాజి పూలు దోసిళ్ళతో మీద కురిసినట్లుగా ఫీలయ్యాడతను

ఛాయకు అంత దగ్గరగా కూచోటం మధ్య మధ్య ఆమె శరీరం తనకు తగలటం అప్పుడామె కళ్ళలో మెరిసే మనోహరమైనభావం

ఇవన్నీ సుధీర్ హృదయంలో తియ్యని అలజడిని రేపుతున్నాయి

వికసించిన ముఖంతో ఎదురొచ్చింది విజయ అమ్మయ్య! వచ్చేశారుగదా!" అంటూ

"మా నాన్నగారు రాజారావుగారు అమ్మ శమంతకమణి ఇది పెళ్లి కూతురు రేణు ' అంటూ తనవాళ్ళను పరిచయం చేసింది విజయ

వాళ్ళ ప్రవర్తనవల్ల చాయ కూడా వాళ్ళతో చాలా సహజంగా కలిసి పోయింది

మగపెళ్లివారు విడిదిలో దిగారు వాళ్లకేం కావాలో అందించటం మొదలు-కొని వడ్డన కార్యక్రమం వరకూ చాయ, సుధీర్ చురుగ్గాపాల్గొన్నారు

ఈ పెళ్లి ప్రయాణం వాళ్లిద్దరి మధ్యా సన్నిహితత్వాన్ని ఏర్పరచింది

ఇద్దరిలోనూ ఉత్సాహం ఉరకలు వేస్తోంది

వసంత ఋతువులో మామిడి గుబురుల్లో కోయిల కూతలు వింటూ మల్లెల పరిమళాలు మోసుకొస్తున్న చిరుగాలితో ఊసులాడుతూ జగమంతా తామిద్దరే అయి నర్తిస్తున్నట్లుంది వాళ్ళకి




# పడమట సంధ్యారాగం

తిరుగు ప్రయాణంలో బస్సులో ఛాయ వెనక సీట్లో కూర్చున్నాడు సుధీర్

పక్కన కూచునే అదృష్టం ఇప్పట్లో ఎలానూ లేదు కనీసం వెనక సీటయినా దక్కింది అదే పదివేలు వెనకనుంచి చూసి తృప్తి పడొచ్చు" చాయ వేపు ఒంగి చిన్నగా అన్నాడు సుదీర్

"ఇప్పటి దాకా చూసింది చాల్లేదా?" నవ్వుతూ అడిగింది ఛాయ

ఏం చూశాను?"

ఏం చూడాలనుకుంటున్నారు?' తీరా అలా అనేశాక సిగ్గు పడిందామె అతను ఎలాంటి సమాధానం చెపుతాడో అనే బెరుకు కూడా ఉందందులో

ఇది గమనించి చిన్నగా నవ్వి ఊరుకున్నాడతను మనసులోనే అభినందించుకుందామె

ఎండలోనుంచి రివ్వున దూసుకొస్తున్న గాలికి జుట్టంతా రేగిపోతుంటే సర్దుకోలేక అవస్థపడుతున్న ఛాయను చూసి "అద్దం దించెయ్యనా?" అంటూ గ్లాస్ దించాడు సుధీర్

వినుకొండలో "కాఫీ తాగే వాళ్ళుంటే దిగండి " అంటూ బస్సు దిగాడు కండక్టరు

రాజీవ్‌తో సహా చాలా మంది దిగారు

కాఫీ తీసుకురానా?" అన్నాడు సుధీర్

"ఒద్దండీ " అన్నది ఛాయ

అతను వెళ్లకపోవటం చూసి "మీరు తాగిరండీ," అన్నదామె

"ఒద్దండీ!" అన్నాడతను ఛాయ ననుకరిస్తూ

"చాల్లెండి గొప్ప! మళ్లీ తల నొప్పి వచ్చేను పదండి వెడదాం " అంటూ లేచిందామె

బస్సెక్కబోతున్న కండక్టర్‌ను చుట్టుకున్నారు పాసింజర్స్" "స్టాండింగ్‌లో వస్తాం దయచేసి ఎక్కించుకోండి " అంటూ బ్రతిమాల సాగారు

"ఒద్దండీ, నా మాట వినండి పట్టుకోటానికి పైన రాడ్స్ లేవు లగేజ్ పెట్టుకునే అర ఊగులాడుతోంది దాన్ని పట్టుకున్న మరుక్షణం ఇలా నెత్తిన పడేలా ఉంది " అంటున్న కండక్టర్ మాటల కడ్డొస్తూ "పైకి రాయకపోయారా?" అన్నాడొకతను

"ఆ, పై రాశాం ఇంకా కిందికి దిగిరాలా వెటకారంగా అంటూ లోపలి కెక్కాడు కండక్టరు

"నేను మాత్రం తప్పనిసరిగా ఇందులో వెళ్ళి తీరాలండీ, స్టాండింగో సిటింగో నా కనవసరం " అంటూ జబర్దస్తీగా ఎక్కాడొక పాసింజరు

కిందున్న వాళ్ళకు మండింది తాము కండక్టర్ని బ్రతిమాల్లేక చస్తుంటే వీడింత తేలిగ్గా బస్సులో జాగా సంపాయించెయ్యటమా!

తమకులేనిది ఎదుటి వాడికి కూడా ఉండగూడదు అంతే, అంతే

'అతన్నయితే ఎక్కనిస్తారా?' అంటూ విరుచుకుపడ్డారు

మేం ఎక్కమన్నామా? దిగవయ్యా నీదో గోల" అంటూ అతన్ని డోర్‌లో నుంచి కిందికి నెట్టిన కండక్టర్ని రౌద్రంగా చూశాడా యువకుడు చెయ్యి డోర్ మీద వేసి నిలబడి ఇక్కడి దాకా స్టాండింగ్‌లో రాలా పాసింజర్లు? అన్నీ రూల్స్ ప్రకారమే చేస్తున్నారా మీరు? అన్నాడు

"ఏంటండీ మీ దబాయింపు? మేం ఓవర్ లోడ్ చెయ్యం అంతే, ఏం చేసుకుంటారో చేసుకోండి అన్నాడు కండక్టరు కోపంగా

"నాకు అర్జెంట్ పనుంది నేను ఈ బస్సులో వెళ్ళితీరాలి కావాలంటే డబ్బు పారేస్తాను డబ్బుకు గడ్డి తినటం మీకలవాటేగా "

'మాటలు మర్యాదగా రానీండి ఎక్కడా మీరు పని చేసేది? పదండి "నే నొస్తాను మీ నీలుగేమిటో కనుక్కుంటాను పెద్ద కలక్టర్‌లా పోజులు కొడుతున్నాడు "

"నేను కలక్టర్నయితే బోడి ఈ బస్సు దగ్గర ఫోజులు కొట్టే ఖర్మ నాకేమిటయ్యా? దర్జాగా కారులో నే వెళ్ళేవాడిని

"నువ్వెక్కెహె! వాళ్ళనలా కొట్టుకు చావనియ్యి ' అంటూ స్టార్ట్ చేశాడు డ్రైవరు

బస్సు ముందుకు కదిలింది పైరయిపోతున్నాడు కండక్టరు

"అరెరో చూడండమ్మా, నేను వాడిని మీరు" అని మన్నిస్తుంటే వాడు గడ్డీ, బోడీ అంటాడు! థూ! బొత్తిగా సంస్కారంలేదు ' అంటున్న డ్రైవర్ అభినయం, యాస చూసి ఫక్కున నవ్వింది చాయ

ఆ నవ్విచ్చిన కిక్కుతో త్రిపురాంతకం దాకా దాన్నే సాగదీశాడతను

అక్కడ ఎస్కార్టు లెక్కటంతో సంభాషణ మరో వేపు మళ్ళింది

తుపాకులు సవరించుకుని తమ సీట్లలో కూర్చుని బస్సు దోపిడీల గురించి చెప్పసాగారు వాళ్ళు

చెవులు రిక్కించుకుని వింటూ బయంతో కూడిన థ్రిల్ అనుభవిస్తూ తమలో నే ఎవరన్నా ప్రయాణీకుల్లా నటిస్తున్న దొంగలున్నారేమోనని బస్సంతా అనుమానంగా చూస్తున్నారు ప్రయాణీకులు

అది గమనించి, రెట్టించిన ఉత్సాహంతో వర్ణనలను జోడిస్తూ దోపిడీ కథలు చిలవలు పలవలుగా చెప్పేస్తున్నారు వాళ్ళు

మధ్య మధ్యలో ప్రయాణీకులు కూడా తాము పేపర్లలో చదివిన వాటికీ, విన్న వాటికీ ఇంకా కొంత మసాలా చేర్చి, వాళ్ల కథలకు ఉపకథలుగా కలుపుతున్నారు. మొత్తానికి ఎస్కార్ట్ రాకతో బస్సులో అందరి సంభాషణలు సంఘీభావం కుదిరినట్లుగా ఒకేదారిలో నడవసాగాయి

"ఏ కథా చెప్పంది మనమే " అన్నది ఛాయ

"ఇన్ని కథలు వింటున్న ఈ అనుభవంతో ఈ సారి ప్రయాణంలో మనం ఇంతకన్నా ఉత్కంఠతను కలిగించే బ్రహ్మాండమైన సస్పెన్స్ కథను చెప్పవచ్చు " అన్నాడు సుధీర్

ఎవరూ వినకుండా అనే నెపంతో ఛాయ దగ్గరగా ఒంగి మాట్లాడటం తియ్యగా బాధ పెడుతోందతన్ని ఆమె జడలో నుంచి వస్తున్న మల్లెపూల వాసన, మెడ మీద నుంచి వస్తున్న పౌడర్ పరిమళంతో కలిసి సరికొత్త స్మెల్‌గా అతన్ని అలరిస్తోంది .

ఎప్పటికీ గమ్యం రాకుండా ఉంటే బాగుండుననిపిస్తోంది

(ఇంకా ఉంది)

# 3D చిత్రాల వారం


3D పౌరాణిక చిత్రం మరీ ఇంత ఎఫెక్టివ్‌గా వుంటుందనుకోలేదే?!


అబ్బే! సైట్ కాదు రాబాబూ! వూళ్లో అన్నీ 3D చిత్రాలే ఆడుతున్నాయ్‌గా!!
-శేఖర్.


ఈ చిత్రం సెన్సారుకు పంపినప్పుడు వాళ్లకి 'కళ్లజోడు' సప్లై చైలేదు...అంచేత అసలు 'కట్స్' ఏమాత్రం పడ్లేదు...!
3D సెక్స్ చిత్రం
ఆమె వేడి చూపులు
(కలర్)
మళయాళం


మాస్టారూ... అది నిజం పాము... పరిగెత్తండి...!
ఎమ్వీఆర్...


ఉత్తమ 3-D చిత్రానిక్కూడా అవార్డు పెట్టాలని వారంతా కోరుతున్నారు సార్......
నంది అవార్డుల కమిటీ
ARUN


3-D కళ్లజోడులతో బాటు నామామూలు కళ్లజోడు కూడా ఇచ్చేశాను పొరపాటున.....!
ఇప్పిస్తారా..........?!
మేనేజర్
రంభ
థియేటర్.....

# సిఫార్సు

## బెహరా వెంకట సుబ్బారావు

ఉదయం పదిగంటలయింది. వసారాలో కూరలు కొనుక్కొని యిల్లు చేరుకొన్నారు శ్రీపతిగారు. భర్త వచ్చిన అలికిడి విని వీధి గదిలోకి వచ్చింది అతని అర్ధాంగి అనూరాధ.

"తమ్ముడొచ్చాడు!" చెప్పింది. హేంగరుకి షర్టు తగిలిస్తూ వెనక్కి తిరిగి అడిగారు శ్రీపతిగారు.

"సుందరం వచ్చాడా? ఏడీ?"

"ఆఁ. పెద్దబ్బాయి భాస్కరాన్ని కూడా తీసుకొచ్చాడు!" అంది కూరల సంచి చూస్తూ.

"ఏరీ? కనబడరేం? వాడికేమైనా వుద్యోగం దొరికిందా?" వాలుకుర్చీలో కూర్చుంటూ ఆత్రుతగా అడిగారు.

"ఇక్కడ కాలేజీలో ఎటెండరు పోస్టుకి ఇంటర్వ్యూ వుందట రేపు! ప్రిన్సిపాల్‌గార్ని కలవడానికి కొడుకుని తీసుకొని వెళ్లాడు. అరగంటలో వస్తానన్నాడు! ఇప్పుడే వెళ్లాడు!"

"ఇంటర్ పాసైన భాస్కరానికి ఎటెండర్ ఉద్యోగమా?" ఆశ్చర్యంగా అడిగారు.

"అదైనా దొరకాలికదా! వాళ్ల దౌర్భాగ్యం అలా వుంది! వుండండి కాఫీ తెస్తా!" అంటూ కూరల సంచితో వంట గదిలోకి వెళ్లింది అనూరాధ.

* * * * *

స్టేట్‌బాంక్‌లో ఆఫీసరుగా పనిచేసి సంవత్సరం క్రితం రిటైరయ్యారు శ్రీపతిగారు. ఇద్దరు మగపిల్లలూ యిద్దరాడ పిల్లలూ సంతానం. పెద్దబ్బాయి రాజమండ్రిలో కాలేజి లెక్చరర్. రెండోవాడు గుడివాడలో అసిస్టెంట్ యింజనీర్. ఇద్దరాడ పిల్లలకీ మంచి సంబంధాలే చేసారు. ఒకల్లుడు ఇంజనీర్. రెండో అల్లుడు డాక్టర్. శ్రీపతిగారికి ఏ బాదరబందీలేదు. సార్థక నామధేయుడు. రిటైర్ అయ్యాక వచ్చిన డబ్బుతో ఆ గ్రామంలో ఒక చిన్న మేడ కొనుక్కొని పాలికవెలుపెట్టి రీమోడల్ చేయించుకొన్నారు. అది చిన్న గ్రామంకాదు. తాలూకాకేంద్రం! హాయిగా జీవిస్తున్నారు.

శ్రీపతి అత్తవారు పెద్ద ఆస్తిపరులుకారు. మామగారు పోయాక కొద్దిపాటి ఆస్తినీ ముగ్గురు బావమరదులూ పంచుకొన్నారు. ఒకొక్కరికి రెండేసి ఎకరాల భూమి వచ్చింది. పెద్ద బావమరదులిద్దరూ పక్క జిల్లాల్లో ఉద్యోగాలు చేసుకుంటున్నారు. ఆఖరి బావమరిది సుందరం. అతను పెద్దగా చదువుకోలేదు. అందువల్ల తండ్రిచేసే గ్రామకరణం ఉద్యోగాన్ని చేపట్టాడు. ఉన్న భూమి అమ్మేసి ముగ్గురాడ పిల్లలకి పెళ్లిళ్లు చేసాడు సుందరం. అతనికి ఒకేఒక కొడుకు భాస్కరం. ఇంటర్‌వరకూ చదివి మానేశాడు. ఆ మధ్య సెన్సస్ డిపార్టు-మెంట్‌లో రెండు సంవత్సరాలపాటు పనిచేసాడు. తర్వాత రిట్రెంచ్ చేయబడ్డాడు. నిరుద్యోగి అయ్యాడు. గ్రామాధికారుల వ్యవస్థ రద్దు కావడంతో సుందరం కూడా నిరుద్యోగయ్యాడు. ఆ కుటుంబ భారాన్ని భాస్కరమే మోయాలి. అతనికి ఉద్యోగం కావాలి.

ఎంత యిబ్బందిగా వున్నా బావగార్ని ఏనాడూ సహాయాన్ని అర్థించలేదు సుందరం. సుందరానికి ఉద్యోగం పోయాక శ్రీపతిగారు అర్ధాంగితో వెళ్లారు పరామర్శించడానికి. ఏమైనా (ఆర్థిక) సహాయంచేసి ఆదుకోవాలనుకొన్నారు. కానీ అతను అడుగనూలేదు శ్రీపతిగారు అందించనూలేదు. ఆనాటినుంచీ భాస్కరానికి ఏదైనా ఉద్యోగం వేయించాలన్న తలంపులోనే వున్నారు శ్రీపతిగారు.

* * * * *

పదకొండు గంటలు దాటాక సుందరం కొడుకుతో తిరిగి వచ్చాడు. బావమరదులిద్దరూ పలకరించు-కొన్నారు. అనూరాధ కూడ వాళ్ల దగ్గర కుర్చీ వేసుకుని కూర్చుంది విషయం తెల్సుకోవాలన్న ఆత్రుతతో. అసలు విషయంలోకి వచ్చాడు సుందరం.

"ఇక్కడ కాలేజీలో ఎటెండరు పోస్టు ఖాళీ వుంది! భాస్కరంకోసం ప్రయత్నం చేస్తున్నా!"

"ప్రిన్సిపాల్‌గార్ని కల్సావా?" అడిగారు శ్రీపతిగారు.

"ఇంటికి వెళ్లాం! ఆదివారం కదా! ఇంటివద్దనే వున్నారు! ఆయన్ని కలవడానికి గంటసేపు బయట నిలబడాల్సి వచ్చింది! ఆయనతో మాట్లాడింది అయిదు నిమిషాలే!" చెప్పాడు సుందరం.

"అంత బిజీగా వున్నారా?" ప్రశ్నించింది అనూరాధ.

"రేపే యింటర్వ్యూ! నాతోటి వాళ్లు ఆయన్ని కలవడానికి ఆరుగురు క్యూలో కూర్చున్నారు బల్లమీద. నా తర్వాత మరి ముగ్గురు వచ్చారనుకో!"

"ఏమన్నారు?" ఆలస్యాన్ని భరించలేకపోయింది అనూరాధ.

"మా ఎమ్మెల్యే గారిచ్చిన లెటరు చూపించా చదువుకొని జేబులో పెట్టుకొన్నారు."

"ఏమీ అనలేదా?" అనూరాధలో ఆత్రుత ఎక్కువైంది.

"భాస్కరాన్ని క్వాలిఫికేషన్సూ అవీ అడిగి తెల్సుకున్నారు. చూస్తానులెండి! అన్నారు."

"ఎమ్మెల్యేగారి లెటరు కదా! చదువుకొన్నాక ఆయన మొహం ఎలా వుంది? ఏమైనా గ్రహించావా?" ప్రశ్నించారు శ్రీపతిగారు.

చిన్నగా నిట్టూర్చి చెప్పసాగాడు సుందరం.

"ఎమ్మెల్యే పెద్ద లెక్కలోని వాడుకాదు బావగారూ! అన్నీ వివరంగా తెల్సుకొన్నా. కాలేజ కమిటీ ప్రెసిడెంటు ఒక కాండిడేట్‌ని తీసుకొచ్చాడుట! మరొక ఎమ్మెల్యే ఒకబ్బాయిని వెంటపెట్టుకొచ్చాడు. ఎంపీగారి దగ్గరనుంచి ఒక అభ్యర్థి లెటరు తీసు-కొచ్చాడుట. ఈ రోజు ఉదయమే ఒక మినిష్టరు ఫోనులో మాట్లాడారుట! ఇంకా వాళ్లపై అధికారులు ఎంతమంది అభ్యర్థుల్ని సిఫార్సు చేసారో తెలీదు మన వాడికి ఉద్యోగం లభిస్తుందన్న ఆశలేదు బావగారూ!" నిరాశగా ముగించాడు సుందరం. అవాక్కైంది అనూరాధ.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా దొర్లాయి.

"ప్రిన్సిపాల్‌గారి పేరు తెల్సా?" అడిగారు శ్రీపతిగారు నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ.

"కె. సూర్యప్రకాశరావు" చెప్పాడు భాస్కరం.

"అంటే కొద్దిగా పొట్టిగా వుంటారు! కర్లింగ్ హెయిర్! ఆయనేనా?" ఆత్రుతగా అడిగారు శ్రీపతిగారు.

"ఆఁ ఆయనే! నుదుట బొట్టు కూడా పెట్టు-కొంటారు! గదినిండా దేవుని పటాలే! దైవ భక్తి ఎక్కువనుకొంటా!" వివరంగా చెప్పాడు సుందరం.

భర్త మొహంలో మార్పు రావడం గమనించి "ఆయన మీకు తెల్సా?" ఠక్కున అడిగింది అనూరాధ.

తెల్సునన్నట్టు తలూపారు శ్రీపతిగారు ఆలోచిస్తూ. అందరిలోనూ ఆశాలత చిగురించింది.

"బంట్రోతుద్యోగంకోసం ఎంపీలూ మినిష్టర్లూ రంగంలోకి దిగితే మామూలు మనుషులం మనమో లెక్కా! నిరుత్సాహపడింది అనూరాధ.

ఆ అక్కా తమ్ముళ్ల సంభాషణ వినిపించడంలేదు శ్రీపతిగారికి. ఆయన వేరే లోకంలో వున్నారు.

"అది కాదక్కా ఆ ప్రిన్సిపాల్‌గారు బావగారి స్నేహితుడే అయితే పని జరగడానికి అవకాశం వుంది! మా పరిస్థితిని వివరిస్తే జాలిపడి భాస్కరానికి ఉపాధి చూపించొచ్చు!" ఆశ వదలుకోలేదు సుందరం.!

"లాభం లేదురా! బంట్రోతుద్యోగం ఏమిటి పోనిస్తూ! అంతకన్నా ఏకూలి పనైనా చేసుకొని స్వతంత్రంగా జీవించొచ్చు! మీ బావగారు ఆఫీసరుగారుగా వున్నప్పుడు ఏ వంది మందికో ఉద్యోగాలిచ్చి వుంటారు. తీరా మనవాళ్ళు పెరిగే సమయానికి రూల్సు మారిపోయాయ్!" ఉస్సురు మంది అనూరాధ.

"ఆయన బావగారి స్నేహితుడే అయివుండాలి!

బావగారు పూనుకుంటే భాస్కరానికి ఉద్యోగం రావటం ఖాయం!" అంటూ బావగారి వైపు ఆశగా చూసాడు సుందరం. ఆయనలో ఏ భావమూ వ్యక్తం కాలేదు.

"ఎంపీలూ, మినిస్టర్లూ ఒకవైపు ఒత్తిడి యిస్తూంటే స్నేహితుల మాటలు వింటారురా! నన్నడిగితే డబ్బు ముందు ఎంత పెద్ద రికమెండేషన్ అయినా తెల్లమొహం వేస్తుంది. ఆయన డబ్బుకి కక్కుర్తి పడతారేమో ఆరాతీయ్!" ఉపాయం చెప్పింది.

"డబ్బు మన దగ్గర లేదుకదా?" డీలాపడ్డాడు సుందరం.

ఆ అక్కా తమ్ముళ్ల మాటలు విన్పించలేదు శ్రీపతిగారికి. ఆయన పదిహేను సంవత్సరాల వెనక్కి వెళ్లారు.

* * * * *

అప్పుడు శ్రీపతిగారు కాకినాడలో ఒక బ్రాంచికి ఏజంటుగా వుండేవారు. ఒకానొక ఉదయాన ప్రకాశం (అంటే యిప్పటి ప్రిన్సిపాల్‌గారు) ఒక పాతిక సంవత్సరాల యువకుణ్ని వెంటతీసుకొని శ్రీపతి గారింటికి వచ్చారు. అప్పుడాయన రాజమండ్రిలో కాలేజీ లెక్చరర్. ప్రకాశం శ్రీపతిగారూ బాల్య స్నేహితులు. ఒకేవూరికి చెందినవారు.

ఎలిమెంటరీ స్కూలునుంచి కాలేజీవరకూ కలసి చదివారు. బాల్య స్నేహితుడు చాలా కాలానికి కల్సినందుకు సంతసించారు శ్రీపతిగారు.

"వీడు నా మేనల్లుడు! అల్లుడు కూడా! రెండో కూతురు సుజాత నిచ్చాను. బి. కాం. పాసయ్యాడు!" తన కూడా తెచ్చిన యువకుణ్ని పరిచయం చేసారు ప్రకాశంగారు. లేచి నిలబడి నమ్రతగా నమస్కరించాడా యువకుడు.

"ఏం చేస్తున్నాడు?" మామూలుగా అడిగారు శ్రీపతిగారు.

"మొన్నటివరకూ వైజాగ్‌లో విక్రం షిప్పింగ్ కంపెనీలో పనిచేసేవాడు. ఏవో గొడవలు వచ్చి ఆ కంపెనీ తన బ్రాంచిని వైజాగ్‌లో ఎత్తేసింది. నిరుద్యోగయ్యాడు." చెప్పారు ప్రకాశంగారు.

ప్రకాశం ఎందుకొచ్చాడో అర్థమైంది శ్రీపతిగారికి. ఆ అబ్బాయిని పరిశీలనగా చూసారు. ప్రకాశంగారి కంఠంలో మార్పు వచ్చింది నిరాశా నిస్పృహలు ధ్వనిస్తున్నాయి.

"అమ్మాయికి యిద్దరు పిల్లలు! ఇప్పుడేం చేయాలో తోచడంలేదు! వీడికి ఏదైనా పని యిప్పిస్తావేమోనన్న ఆశతో వచ్చా!" అర్థించారు.

"క్లర్కు పోస్టులు ఖాళీలు లేవు! అయినా యిదివరకులా డైరక్టుగా అపాయింట్ చేయకూడదు. రిక్రూట్‌మెంటు జరగాలి!" తన అశక్తత్వాన్ని తెలియజేశారు శ్రీపతిగారు.

"గుమాస్తా ఉద్యోగం కోసమే రాలేదోయ్! మెసంజరుగా వేసుకున్నా చాలు!" సిగ్గ విడిచారు ప్రకాశంగారు.

"మెసంజర్ని కూడా డైరక్టుగా ఎపాయింట్ చేయకూడదోయ్! అలా పాతరోజుల్లో కుదిరేది! టెంపరరీగా డెయిలీ వేజెస్ మీద కొన్నాళ్ళు చేయాలి! ఆ తర్వాత ఖాళీ వచ్చినప్పుడు రెగ్యులర్ ఎపాయింట్‌మెంట్ యిస్తారు! అయినా బి. కాం. పాసయిన వాడికి



## "సిఫార్సు"

మెజెంజరుద్యోగమా?" తన అయిష్టతను వ్యక్తం చేసారు శ్రీపతిగారు.

"దానికైనా సిద్ధమేనోయ్! అదైనా యిచ్చి పుణ్యం కట్టుకో! గ్రాడ్యుయేట్ కాబట్టి ముందు ముందు పైకి వస్తాడని నా నమ్మకం!"

శ్రీపతిగారు యింకా సుముఖతను వ్యక్తం చేయకపోవడం ప్రాధేయపడ్డారు ప్రకాశంగారు.

"అవకాశం వస్తే నీ ఋణం తీర్చుకొంటా! నీకెలాంటి అవసరం రాకపోవచ్చు! ఆడపిల్ల తండ్రిగా బ్రతిమాలుకుంటున్నా! ప్లీజ్! కాదనకు!"

"సరే!" అనక తప్పలేదు శ్రీపతిగారికి.

తనకున్న అధికారం మేరకు టెంపరరీగా మెసంజరు వుద్యోగం యిచ్చారు. ఆ తర్వాత పెర్మనెంట్ చేయబడ్డాడు. కొన్నాళ్లకి శ్రీపతిగారికి ఆ బ్రాంచినుంచి ట్రాన్స్‌ఫర్ అయింది. అతని విషయాలు తెలియవ్. ప్రకాశం విషయం కూడా తెలీదు. పదిహేను సంవత్సరాలు గడిచాయ్.

* * * * *

అనూరాధ తమ్ముణ్ణి పక్కగదిలోకి పిలిచి చెప్పింది.

'డబ్బు అవసరం అయితే నేను సర్దుబాటు చేస్తా మీ బావగారికి తెలీయకుండా! తక్కిన ఏర్పాట్లు చూడు! తర్వాత నెమ్మదిగా నేనే మీ బావగారికి చెబుతా! డబ్బు పుచ్చుకొంటాడో లేదో, పుచ్చుకొంటే ఏపాటి యివ్వాలో అన్నీ వివరంగా తెల్సుకో!"

అక్క చెప్పిన ఆలోచన బాగానే వున్నట్టు తోచింది సుందరానికి.

అక్కా తమ్ముడూ తిరిగి గదిలోకి వచ్చేసరికి యింకా పరధ్యాన్నంలోనే వున్నారు శ్రీపతిగారు.

"ఏవిటాలోచిస్తున్నారు?" భర్తని పలకరించింది అనూరాధ.

"మనం కాకినాడలో వుంటున్నప్పుడు మనింటికి నా స్నేహితుడు ప్రకాశం వచ్చాడు జ్ఞాపకం వుందా?" అడిగారు అర్ధాంగిని.

"మనింటికి మీ స్నేహితులు చాలామంది వచ్చేవారు! ప్రకాశంగారెవరో నాకేం తెలుస్తుంది!"

"నీకు జ్ఞాపకం ఉండే వుండాలి! కాలేజీ లెక్చరర్ ప్రకాశం అని చెప్పా! మనింట్లో భోజనం కూడా చేసాడు! వాళ్ల అల్లుడికి మెసంజరు ఉద్యోగమైనా వేయించమని ప్రాధేయపడ్డాడు! మెసంజర్‌గా అప్పాయింట్ చేసా..." ఇంకా ఆమె గుర్తుకు తెచ్చుకోకపోవడంతో -

"మన సుధకి మండపేట సంబంధం చెప్పాడు జ్ఞాపకం వుందా?"

'ఓహో ఆయనా? జ్ఞాపక మొచ్చింది. అయినా ఆయనెందుకూ! ఆయన ద్వారా రికమెండ్ చేయిస్తారా? టైం చాలదు! రేపే ఇంటర్వ్యూ!'

"ఆ ప్రకాశమే ఈ ప్రిన్సిపాల్ సూర్యప్రకాశరావు! మనం ఈవూరొచ్చి ఆర్నెల్లేగా అయింది. ఒకరి నొకరం కల్సుకొనే అవకాశం రాలేదు! వాడే ప్రిన్సిపాలని నాకింతవరకూ తెలీదు!"

అక్కా తమ్ముళ్లిద్దరూ ఆయన్ని ఆశగా చూశారు.

"అయితే బావగారూ! ఆయన్ని అర్జంటుగా కలవాలి! ఇంటర్వ్యూలు అయాక కలిస్తే ప్రయోజనం వుండదు!" తొందరచేసాడు సుందరం.

"ఇంతమంది పెద్దలు జోక్యం చేసుకొంటున్నారు కదా! మీ మాట వింటారంటారా?"

అనుమానం వ్యక్తం చేసింది అనూరాధ.

భార్య మాటలు విని బావగారు ఎక్కడ సంశయిస్తారోనన్న భయం పట్టుకొంది సుందరానికి.

"ప్రయత్న లోపం వుండకూడదక్కా! ఆ తర్వాత మా అదృష్టం! అల్లుడికి వుద్యోగం యిచ్చినందుకైనా ప్రత్యుపకారంగా బావగారి అభ్యర్థనని మన్నిస్తారు! నాకా నమ్మకం వుంది! తప్పకుండా కృతజ్ఞత చూపిస్తారు! పదండి బావగారూ వెళ్దాం!" లేచి నిలబడ్డాడు సుందరం.

"అవకాశం వస్తే నీ ఋణం తీర్చుకొంటా.నోయ్!" అని ఆనాడు ప్రకాశం అన్నమాటలు గుర్తుకొచ్చాయ్ శ్రీపతిగారికి.

సుందరాన్ని కూడా తీసుకొని రిక్షాలో బయలుదేరారు. బాగా ఎండగా వుంది. ప్రిన్సిపాల్‌గారి వీధి తలుపులు వేసివున్నాయ్.

"ప్రకాశం!" తలుపు తట్టుతూ పిల్చారు. తలుపుతీసి చూసారు ప్రకాశంగారు.

ఒకరి నొకరు పోల్చుకొన్నారు. చాలా కాలానికి కల్సుకున్న ఆ యిరువురి స్నేహితుల మొహాలూ మతాబుల్లా వెలిగాయ్. ఒకరి నొకరు కావలించుకొన్నారు. ఆప్యాయంగా ఆహ్వానించారు ప్రకాశంగారు. ముగ్గురూ ఎదురెదురుగా కుర్చీలో కూర్చున్నారు.

"ఈ వూళ్లో నన్ను పేరుపెట్టి పిలుస్తుంటే ఎవరైనా బంధువులైనా అయివుండాలి స్నేహితుడైనా అయివుండాలి అనుకొన్నా! అందుకే చటాల్న లేచి తలుపుతీసా! అది సరే! మనం కల్సుకొని చాలా సంవత్సరాలైంది!. ఎక్కడుంటున్నావ్? ఈ వూరెప్పుడొచ్చావ్? ఎవరింటి కొచ్చావ్? మీ అమ్మాయి సుధ పెళ్లికి రాలేకపోయా! ఆ సమయంలో పరీక్షలవుతున్నాయ్!" అభిమానాన్ని కుమ్మరిస్తూ కుశల ప్రశ్నల వర్షం కురిపించారు ప్రకాశంగారు.

అతని ప్రశ్నలన్నింటికీ వరసగా సమాధానం చెప్పారు. శ్రీపతిగారు. ఆరునెలలనుంచీ ఒకే గ్రామంలో వుంటున్నా కల్సుకోలేక పోయినందుకు ఆశ్చర్యం ప్రకటించుకొన్నారిరువురూ.

"తూర్పు చివర మా యిల్లుంది! రెండో చివర మీ యిల్లూ కాలేజీ వున్నాయ్. అందుకే మనం కల్సుకోలేకపోయాం! అది సరే! పిల్లలంతా బావున్నారా?" తిరిగి కుశల ప్రశ్న వేసారు శ్రీపతిగారు.

వారంత ఆప్యాయంగా మాట్లాడుకొంటూ వుంటే వారి స్నేహ శీలతకి సుందరం ఒడలు పులకరించాయ్. ధీమా కలిగింది. మనసు తేలిక పడింది. స్నేహాన్ని తప్పేకాదు ఈ ప్రపంచంలో ఏ పదార్థమూ విడదీయలేదు. స్నేహబంధం అంత మహత్తరమైంది. బావగారం అదృష్టవంతుడు! అనుకొన్నాడు సుందరం.

"ఏవిటీ! ఇంత ఎండలో వచ్చావ్? కబురు పంపితే సాయంత్రం నేనే వచ్చేవాణ్ణి కదా!"

జవాబుగా మందహాసం చేసారు శ్రీపతిగారు.

అంతలో పదహారేళ్లమ్మాయి కాఫీలు తెచ్చి అందించింది ముగ్గురికీ.

"మా మనవరాలు! అదేనోయ్ మా రెండో అమ్మాయి కూతురు! మా రెండో అల్లుడు కిశోర్‌కి కాకినాడలో వుద్యోగం వేయించావ్ జ్ఞాపకం వుందా? వాడి కూతురు!" వివరంగా చెప్పారు ప్రకాశంగారు.

"అలాగా? చాలా సంతోషం!" సంతోషాన్ని వ్యక్తం చేసారు శ్రీపతిగారు ఆ అమ్మాయిని చూస్తూ.

కిశోర్ ఈ వూరి బ్రాంచికే ట్రాన్స్‌ఫర్ చేయించుకొన్నాడు! నాలుగైదు రోజుల్లో జాయిన్ అవుతాడు!"

అల్లునికి తానే వుద్యోగం వేయించిన సంగతి గుర్తుకు తెచ్చినందుకూ ఆ సమయంలో ఆ ప్రస్తావన అతనే తెచ్చినందుకూ సంతృప్తి చెందారు శ్రీపతిగారు. తన అభ్యర్థనని త్రోసి పుచ్చడనే ధైర్యం వచ్చింది.

"ఒక్క నిమిషంలో వస్తా!" అంటూ లోనికి వెళ్లారు ప్రకాశంగారు. శ్రీపతి సుందరం ఒకరి మొహాలొకరు చూసుకొన్నారు. మాట దక్కవచ్చుననే ఆశాభావాన్ని వ్యక్తం చేసుకొన్నారు. అంతలో వచ్చాడొక అపరిచిత వ్యక్తి. వస్తూనే స్వతంత్రంగా సోఫాలో చతికిలపడ్డాడు. ప్రకాశంగారు తిరిగి వస్తూ సోఫాలో కూర్చున్న వ్యక్తిని చూసి ప్రశ్నించారు శ్రీపతిగారిని చూపిస్తూ

"ఏమోయ్! ఈయనెవరో జ్ఞాపకం వుందా?"

అతను కనుబొమలు ఆడిస్తూ చూస్తూ వుంటే -

"మీ బ్రాంచి మేనేజరు శ్రీపతిగారు! మర్చిపోయావా?" అడిగారు.

చటాల్న లేచి నిలబడి నమస్కరించాడు కిశోర్.

"క్షమించండ్సార్! ఎండలో వచ్చాను. పోల్చుకోలేకపోయాను! మీ దయ వల్ల హెడ్ కాషియర్నయ్యా! ఈ బ్రాంచికే ట్రాన్స్‌ఫరయ్యా! రెండు రోజుల్లో జాయిన్ అవుతా!" క్షమాపణ అర్థించాడు కిశోర్.

అతణ్ణి వాత్సల్యంగా చూసారు శ్రీపతిగారు.

"చాలా సంతోషం! కృషి చేసావ్ వృద్ధిలోకి వచ్చావ్! ఇందులో నా దయ ఏముంది!" అన్నారు మామూలుగా.

"ఆ రోజు మా వాడికి ఆ మెసంజరుద్యోగమైనా యిచ్చావ్ కాబట్టి యింత వాడయ్యాడు. లేకపోతే

# మీ పళ్ల మీద చిగుళ్ల పట్టు సడలనివ్వకండి!

## కేవలం ఫోర్‌హేన్స్ మాత్రమే చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గివున్నది. చిగళ్లు గట్టిగా వుంటే పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి.




అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్.జె. ఫోర్‌హెన్ తాను తయారుచేసిన టూత్‌పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చాడు.

1. ఇది నేరుగా చిగుళ్ల మీద పనిచేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము.
2. చిగుళ్లను బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టునిస్తుంది.
3. ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం, దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.







## ఫోర్‌హేన్స్ — ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్ పేస్టు.

339F 234

# భద్రతకో గీతం

బజార్లో విలువలేని
ప్రాణాలు మనవి
బస్సులో బయటకు వస్తే
తిరిగి ఇంటికి చేరగలమా
అని ఎవరైనా ప్రశ్నిస్తే
ఏం చెప్తాం విలువలేని
ప్రాణులం
ఎదురుగా యమధర్మరాజు
హెవీ హెవీ వెహికల్ లారీ
వెనుక నుంచి మా ఊరి
సిటీ బస్సు దయలేని
డ్రైవరు అతనికి 60 ప్రాణాలు
లెక్కలేదు థర్డుపార్టీ
భీమా చేశాడుట యజమాని
మా ఊళ్ళోనే కాదు బాబూ
మీ ఊళ్ళో కూడా
దిక్కులు చూస్తూ నడిస్తే
ఎవరు నీ ప్రాణానికి దిక్కు?
మా ఊరి సిటీ బస్సు
మీ ఊళ్ళో ఆర్ టి సి బస్సు
అయి ఓ సి టాంకర్
అన్నీ వేగపు వాహనాలే
రహదార్లను క్రాసు చేయకు
నిర్లక్ష్యంగా నీ ప్రాణహాని
చెపుతున్నాడు ధర్మగ్లాని
గ్రామాల్లో పెద్దరైతు ట్రాక్టరు
దానినిండా జనం
కాంట్రాక్టరుగారి లారీ
వందమంది అందులో
ప్రయాణం
మధ్యలో ఫియట్లు
మారుతి కార్లు –
అంబాసిడర్లు
అన్నీ జనాభా సమస్య
పరిష్కారానికి కృషి చేస్తున్నాయి
మా సిటి బస్సు
ఆగదు ఎంత పిటీ
ఆగితే కదలదు
ఇది కాల్వలో –
నదిలో లోయలలో
ఈదుతుంది
ప్రతిరోజూ
పత్రికలకు ఎంచక్కా
ప్రమాదాల వార్తలందిస్తుంది

–ఎం. ఎస్. ఎం.

## "సిఫార్సు"

ఎత జీవితం ఎలా వుండేదో! కృతజ్ఞత వ్యక్తం చేసారు ప్రకాశంగారు అంతలో భోజనానికి పిలుపు రావడంతో లోనికి వెళ్ళాడు కిశోర్

ఏమిటి విశేషాలు? కుతూహలంగా అడగారు ప్రకాశంగారు

తా నొచ్చిన పని ప్రస్తావనకు తేడానికి అనుకూలమైన సమయమూ సందర్భమూ దొరికనందుకు సంతసించారు శ్రీపతిగారు

ఇతను నా ఆఖరి బావమరిది! మొన్నటివరకూ గ్రామ కరణంగా పని చేసాడు! ఇప్పుడు నిరుద్యోగయ్యాడు ముగ్గురాడపిల్లలకి పెళ్ళిళ్ళు చేసి చితికిపొయాడు పెళ్ళబ్బాయి యింటర్ పాసయ్యాడు రేపు ఎటెండర్ పోస్టుకి యింటర్వ్యూ వుందిట! నీ సహాయానికి అర్థించడానికి వచ్చా' చెప్పవల్సింది చెప్పారు శ్రీపతిగారు

అంతవరకూ సుందరాన్ని పరీక్షగా చూడలేదు ప్రకాశంగారు అతను ఎమ్మెల్యేగారి నుంచి లెటరు తెచ్చినట్టు గుర్తొచ్చింది

ప్రకాశంగారి మొహంలో మార్పు వచ్చినట్లు గమనించారు శ్రీపతిగారు అయినా నిరుత్సాహపడలేదు ఆ పరిస్థితిలో వున్న వ్యక్తికి అది సహజం అనుకొన్నారు కొంతసేపటికి నార్మల్ అయారు ప్రకాశంగారు శ్రీపతిగారు మళ్ళీ చెప్పడం మొదలు పెట్టారు

ఇంతవరకూ ఆకలి శోకంతో సంసారాన్ని నెట్టుకొచ్చాడు ఒకే ఒక కొడుకు వాడిమీదనే కుటుంబం ఆధారపడివుంది ఈ ఉపకారం చేయక తప్పదు!

ఒకే ఒక పోస్టు! ఎంప్లాయిమెంటు ఎక్ఛేంజి వాళ్ళు యిరవై మందిపేర్లు పంపారు! దీనికోసం పెద్ద పెద్దవారినుండి రికమెండేషన్లు! ఎవరికివ్వడమో తెలీక తికమక పడుతున్నా! రెండు రోజులనుంచి ప్రెషర్ మరీ ఎక్కువైంది అయినా వాటిని పట్టించుకోదల్చుకో లేదు!డిజర్వింగ్ కాండేటుకే యివ్వాలని నిశ్చయించుకొన్నా! వివరించారు ప్రకాశంగారు

ఎంప్లాయి మెంట్ ఎక్ఛేంజివారు స్పాన్సర్ చేసిన లిస్టులో మావాడి పేరు కూడావుంది ఇంటర్వ్యూ కాల్‌కూడా పంపారు! చెప్పారు శ్రీపతిగారు

అయితే యిందులో మరో యిబ్బంది వుంది! ఇబ్బందిగా చూసారు ప్రకాశంగారు తెల్సుకోడానికి ఆతృతపడ్డారు బావమరదు లిద్దరూ

సెన్సస్ డిపార్టుమెంట్‌నుంచి రిట్రెంచయిన అభ్యర్థులకే ప్రిఫరెన్సు యివ్వమని ఆదేశం!

మావాడికి ఆ క్వాలిఫికేషన్ కూడా వుందోయ్ సెన్సస్‌లో పనిచేసి రిట్రెంచయ్యాడు! రక్కున చెప్పారు శ్రీపతిగారు

అయితే పరవా లేదు! సాధ్యమైనంతవరకూ మీ వాడికే యివ్వడానికి ప్రయత్నిస్తా! ఎమ్మెల్యేగారు సిఫార్సు లెటరుకూడా పంపారు! ఆయన నాకు బాగా సన్నిహితుడు! అంతకన్నా నువ్వే స్వయంగా వచ్చేయ్! డోన్ట్ వర్రీ!

హామియిచ్చారు ప్రకాశంగారు

ప్రామిస్ తీసుకోవడం సభ్యత కాదనిపించింది శ్రీపతిగారికి తేలిక పడిన మనసుతో లేచారిద్దరూ వీధి చివర వరకూ సాగనంపారు ప్రకాశంగారు మర్నాడు యింటర్వ్యూ అయింది ఫలితం మర్నాడు ప్రకటిస్తామన్నారు

తన కుటుంబానికి ఆదరవూ ఆధారమూ దొరకబోతున్నందుకు సంతోషించాడు సుందరం తన ప్రయత్నం వృధా కానందుకు పుష్పాంగారు శ్రీపతిగారు ఆ శుభవార్త విని ఆనందసాగరంలో మునిగింది అనూరాధ

ఏమండీ శంకరాభరణం సినిమా మరోసారి చూడాలని వుందండి! తమ్ముడు యింత వరకూ చూడనే లేదట! తన కోరికను వ్యక్తం చేసింది అనూరాధ

ఇదివరలో చూసినా మరోసారి చూడాలనిపించింది శ్రీపతిగారికి కూడా పైగా బావమరది కూడా చూస్తానంటున్నాడు సరే అన్నారు రెండో ఆట సినిమాకి అందరూ బయలుదేరారు

సినీమా అవుతోంది వెనుక వరసలో వున్న వారి మాటలు స్పష్టంగా విన్పిస్తున్నాయి శ్రీపతిగారికి

నే విన్నది నిజమే అంటావా? అడిగాడొకడు

ఏది? కాలేజీ అటెండరు పోస్టింగు గురిచేనా? తిరిగి అడిగాడు రెండో వ్యక్తి

ఎవరికో యిచ్చేసారట! నిరాశగా అన్నాడు మొదటి వ్యక్తి వారి మధ్య మూడో వ్యక్తి కలుగజేసుకొన్నాడు

ఎవరికో కాదు! మావూరి ప్రెశిడెంట్ గారబ్బాయినే సెలక్టు చేసారు ఆర్డర్సు కూడా యిచ్చారు నాకు చూపించాడు చూసాను వాళ్ళ నాన్న మూడు వేలు యిచ్చాడుట నాతో చెప్పాడు తనకే వస్తుందని మొదటి నుంచి ధైర్యంగా చెప్పేవాడు మేమే పొరపాటు చేసాం! మా నాన్నగారు కూడా నాలుగు వేలు పారేద్దాం అన్నారు మంత్రిగారి సిఫార్సుంది కదా తప్పకుండా వస్తుందని ధీమా పడ్డాడు మామయ్య డబ్బు యివ్వనవసరం లేదన్నాడు! వాపోయాడా వ్యక్తి అతను కూడా ఒక అభ్యర్థేనని అర్థమైంది శ్రీపతిగారికి

ఇలా జరుగుతుందని నాకేం తెల్సురా! మంత్రిగారి రికమెండేషన్ చేసాక తప్పకుండా యిస్తాడనుకొన్నా! డబ్బుకి కక్కుర్తి పడ్తాడని అనుకోలేదు!

పశ్చాత్తాపాన్ని ప్రకటించాడు అతని మామయ్య

డబ్బు ముందు ఎలాంటి సిఫార్సులూ పని చేయవయ్యా! అది తెల్సికూడా డబ్బు లేక మేం వూరుకొన్నాం అందరిలాగా మావాడు కూడా శెల్ఫి వచ్చాడు అదృష్టాన్ని పరీక్షించుకోడానికి' ఉసూరుమన్నాడు మొదటి వ్యక్తి ఆ తర్వాత వారి సంభాషణలు ఆగిపోయాయ్

శ్రీపతిగారికి సినీమా చూడాలనిపించలేదు వెంటనే యింటికి పోవాలనిపించింది కుటుంబంతో వున్నారు కాబట్టి మాట్లాడకుండా కూర్చున్నారు □

# వారఫలం

## 5-4-1985 శుక్రవారంమొదలు 11-4-1985 గురువారం వరకు.

★ **మేషం :** దూరప్రాంతాల నుండి అనుకూల వర్తమానం అందుతుంది డబ్బు కూడ అందు తుంది ఇటీవలి ఒడిదుడుకులు తీరిపోతాయి నూతన ప్రక్రియలు నిదానంగా ఫలించగలవు స్త్రీలకు ఆశించినట్లు ఉద్యోగమందు 'ప్రమోషన్' లభ్యం ఆరోగ్య విషయంగా జాగ్రత్త!

★ **వృషభం :** ఎంత యోచిస్తే అంత మంచిది ఎంతగా కృషి చేస్తే అంత లాభదాయకం. ఉద్యోగ వృత్తులందు చెప్పుకోదగిన పెంపు కనిపించుట నిశ్చయం మీ సామర్థ్యం నలుగురచే ప్రశంసింపబడుతుంది స్త్రీలకు ధనలబ్ధి, ప్రయత్నానుకూలం, శుభవార్తా శ్రవణం యిత్యాది అనుకూలతలు చేకూరుతాయి

★ **మిధునం :** నూతనాంశాలు గ్రహించుట, నూతనోద్యోగ యత్నాలు చేయుటకు, నూతన మిత్ర సాంగత్యమునకు అనుకూల సమయం వ్యాపారం బాహాటంగా సాగించవచ్చు కొనుగోలు రీత్యా ప్రయాణాలు. కూడ సాగిరాగలవు స్త్రీలకు కుటుంబానందం, వృత్తియందు కించిత్తు పెంపు సాధ్యం

★ **కర్కాటకం :** అనుకోకుండా అనానుకూల వార్త వింటారు బాగా శ్రమకు గురి కావలసిన సమయం ప్రయాణాలందు కూడ తికమక పడు తారు వస్తువు లేమైనా పోగొట్టుకొనే అవకాశం కూడ ఉన్నది స్త్రీలకు తమ చాకచక్యంతో వివిధాంశాలందు శ్రమించి మేలు పొందుతారు

★ **సింహం:** ఉద్యోగరీత్యా బాగా శ్రమించాలి మీకు గల అనుభవం సహకారి కాగలదు అప్రయత్నంగా ధనాదాయం గలవారం సులభంగా ఒకానొక విషయమందు మీకే మేలు సమకూడుతుంది స్త్రీలకు విద్యావైజ్ఞానిక రంగాలలో ప్రతిభ రాణించుటం, నూతన మిత్ర సహకారం లభించటం గమనింపదగిన అంశాలు

★ **కన్య :** సత్కార్యాచరణమునకు, సాధుసజ్జన సద్గోష్ఠియందు కాలక్షేపమునకు అవకాశం గలవారం ఎన్నడో ఆశ వదలుకొన్న ధనం మరలా అందటం వార విశేషమేగా! అంటే గ్రహానుకూల్యత గల సమయమని అర్థం స్త్రీలకు చేసిన యత్నాలు సఫలం కాగలవు సంతానాభివృద్ధిని గూర్చి చేసిన మీ యత్నాలు సత్ఫలదాయకాలే

★ **తుల :** గమనించండి, ఒడిదుడుకులతో మిత్రానురాగంతో. చేసిన పొరపాట్లు సరి దిద్దుకొనుటలో రుణగ్రస్తుల బారి నుండి తప్పించుకొనుటలో వారం గడుస్తుంది స్వల్పంగా ఆదాయం లేకపోలేదు స్త్రీలకు కళాసాహితీ రంగాన రాణింపు చెప్పదగిన అంశం

★ **వృశ్చికం :** మీ మాటకు తిరుగులేని విధంగా బలం ఏర్పడనున్నది వృత్తి యందు మీకు పెంపు కనిపిస్తుంది రాజకీయ వ్యక్తుల వలన మేలు చేకూరుతుంది నూతన వ్యాపారమేదైనా ప్రారంభించాలనే ఉబలాట చెప్పదగిన అంశం స్త్రీలకు ఉద్యోగమందలి గావించిన ప్రయత్నాలు ఫలవంతం కాగలవు

★ **ధనుస్సు :** వారమంతా హడావుడిగా ఉంటారు విచిత్ర వ్యక్తుల పరిచయం ఏర్పడుతుంది ప్రజాభిమానం చూరగొనే అవకాశం లభ్యం కాగలదు కుటుంబ పరిస్థితులందు యిటీవల ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి స్త్రీలకు రచనా వ్యాసంగం ఫలించటం, ఉద్యోగమందు వికాసం కనిపించటం చెప్పదగిన అంశాలు

★ **మకరం :** వివాహ విషయంగా కొందరు దూరప్రాంతాలకు ప్రయాణించగలరు ఇంట శుభకార్యం జరుగుటకు కొందర కవకాశమున్నది శని దశగాని, భుక్తులు గాని జరిగే లగ్న పరిస్థితులైతే అనుకూలమే గనులు, కార్ఖానాలు, ముద్రణా వ్యవస్థలందున్న వారికి శుభయోగమే స్త్రీలకు నూతన వస్తు, వస్త్ర సేకరణకు అనుకూలం

★ **కుంభం :** ఆదాయానికిగాని, కార్యాను కూల్యతకు గాని, ముఖ్యులను కలిసి కొనుటకు గాని, అధికారం చెలాయించుటకు గాని ఎలాంటి అడ్డంకులు రావని గ్రహించాలి ప్రగతి పథాన సంచరించగలరు గ్రహానుకూలత గలవారం స్త్రీలకు వస్తువాహన ధనధాన్య సంపత్తి ప్రాప్తికి అనుకూల వారం

★ **మీనం :** మీ అభీష్టం రాజకీయపరంగా నెరవేరిందిగా అన్నింటా అనుకూల పరిస్థితులు యింకా మీకు లభ్యం కాగలవు రాజ్యాధినాధుడు వారాంతంలో ఏదో మేలు చేయనున్నాడు 'శుక్ర వారం' ధనలబ్ధి, సుఖసంతోషాదులు స్త్రీలకు ధనాదాయకానికి, శుభవార్తా శ్రవణమునకు అనుకూలం సాహితీప్రియులకు ఉత్తమోత్తమ వారం, గమనించండి

—విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి

# వ్యక్తిగతం



మతంలో సాధించిన అభివృద్ధికి ప్రతి ఏటా ఇచ్చే టెమ్ప్లెటాన్ ఫౌండేషన్ అవార్డు ఈసారి ప్రసిద్ధ జీవ శాస్త్రవేత్త (మరయిన్ బయాలజిస్ట్) అయిన సర్ అలిస్టర్ హార్డీకి (89) రావటం విశేషంగా చెప్పుకోవాలి ఇంతవరకు ఆత్మ, పరమాత్మ తత్త్వ విచారణ చేసిన వాళ్లకే ఈ అవార్డు వచ్చింది

అతీతమైన మతపరమైన అనుభవాలని గురించి చర్చించడమంటే హార్డీకి ఎంతో ఇష్టం 1920 నించీ ఈ హవ్యాసమున్న ఈయన, ఆ అను భవాలకి శాస్త్రపరమైన వివరణల కోసం వెదికేవారు 1969 లో ఆక్స్‌ఫర్డ్‌కి చెందిన మాంచెస్టర్ కాలేజీలోని మతపరమైన అనుభవాల పరిశోధనా కేంద్రానికి డయిరక్టర్ అయ్యారు

బ్రిటన్‌కి చెందిన ఐదువేల మంది వ్యక్తుల మతపరమైన అనుభవాలని రాత పూర్వకంగా సేకరించి వాటికి శాస్త్రీయమైన కారణాలకోసం హార్డీ అన్వేషణ మొదలు పెట్టారు స్నేహితుని నొసట మూడవ కన్ను చూచానని ఒకరు రాస్తే, ఒక అతీతమైన శక్తి తన్ను నడుపుతోందని ఇంకొకరు రాసారు ప్రేమ, మార్గ దర్శకత్వం వహించే అశరీరవాణి, కాలంతో సంబంధం లేకుండా అనుభవించే హాయి – ఇలాంటివన్నీ మత పరమైన అనుభవాల క్రిందికే వస్తాయి ఈ అనుభవాలని హార్డీ 92 రకాలుగా వర్గీకరించారు ఈ దివ్యశక్తే భగవంతుడా? – అని అడిగితే కావచ్చునని చదువుకున్నవారే 56 శాతం మంది చెప్పారట!

హార్డీ 185 వేల అమెరికన్ డాలర్ల విలువ చేసే ఈ అవార్డుని స్వీకరిస్తూ "నా హృదయం ఇంగ్లాండులో ఉన్న చర్చిలో ఉంది నా మనస్సు మాత్రం మానవాత్మ తత్త్వవిచారణ పైనే ఉంటుంది" అని చెప్పారు ఫిలిప్ టాయిన్ బీ అనే చరిత్రకారుడు హార్డీ ప్రయత్నంపై వ్యాఖ్యా నిస్తూ సీతాకోక చిలుకలని పట్టే వలతో దేవతలని పట్టడానికి చేస్తున్న ప్రయత్నమని అన్నారు!

హార్డీ వాదాలు క్రైస్తవుల వరకే పరిమితమా? అని ప్రశ్నిస్తే అలాంటిదేమీ లేదని హిందువులు, మహమ్మదీయులు, శిక్కులు ఎవరైనా తత్త్వ విచారణ దృష్ట్యా ఒకటేనని అన్నారు అన్ని మతాలు దేవునికి సంబంధించినవే కదా అని ఆయన అభిప్రాయపడ్డారు □

సీరియల్

# రాగసంధ్య

కాశీనాధుని సువర్చలా దేవి

(గత సంచిక తరువాయి)

దేదీవ్యమానంగా వెలుగుతున్న లైట్ల మధ్య షామియానా కింద కొన్ని వందలమంది భోజనాలు చేస్తున్నారు. తెల్లని డ్రెస్‌లో ఉన్న ఎంతో మంది చాలా వినయంగా హడావుడిగా వడ్డన చేస్తున్నారు. ప్రారంభంలోనే పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు సోఫాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఫోటోగ్రాఫర్లు రకరకాలుగా ఫోటోలు తీస్తున్నారు. పక్కనే బల్ల మీద రంగు కాగితాలతో చుట్టబడిన ప్రజంటేషన్లు గుట్టలుగా వున్నాయి. శ్రీకాంత్ సంధ్యతో అక్కడకు వచ్చేసరికి పెళ్ళికొడుకు అమాంతంగా వచ్చి శ్రీకాంత్‌ని వాటేసుకున్నాడు.

"పెళ్ళికి రాలేదు కదూ! నీ పెళ్ళికి రాలేదని నా పెళ్ళికి నువ్వు రాలేదు– అవునా!" నిష్టూరంగా అన్నాడు పెళ్ళికొడుకు.

"లేదు ప్రకాష్ – కాస్త వ్యక్తిగతమైన అర్జంటు పని తగిలింది – అందుకని –" అంటూ సంధ్య వైపు చూశాడు శ్రీకాంత్.

ప్రకాష్ అర్థమైనట్లుగా నవ్వుతూ "ఓ అదా సంగతి – మొత్తం మీద మా వదినగార్ని హడలగొట్టేస్తున్నావన్న మాట!"

అప్పుడుగాని శ్రీకాంత్‌కి తన మాటలలో అర్థం అతనెలా అర్థం చేసుకున్నదీ గ్రహింపుకు రాలేదు. ఆ క్షణంలో సంధ్య ముఖం చూసే ధైర్యం లేకపోయిందతనికి. పరిచయాలయినయి.

పెళ్ళికూతురు ఉషాదేవి. డాక్టరు. హౌస్ సర్జను పూర్తి చేసింది. సంధ్యతో చనువుగా మాట్లాడింది ఉషాదేవి. భోజనాలు చేసిన వాళ్ళందరూ ముగించి చేతులు కడుక్కుంటున్నారు. ఉషాదేవి లోపలికెళ్తూ సంధ్యను కూడా రమ్మంది. సంధ్య రాననటంతో ఆమె లోపలికెళ్ళింది. భోజనాలు ముగించిన వాళ్ళందరూ ప్రకాష్‌తో చెప్పి బయల్దేరుతున్నారు. అరగంట తర్వాత దాదాపు అందరూ వెళ్ళిపోయారు. ఇంకో అరగంటకు కాని శ్రీకాంత్, సంధ్య భోజనాలకి కూర్చోలేదు. అప్పుడు చూసింది సంధ్య చుట్టూరా. ఎక్కడా ఇళ్ళు లేవు. ఏవో హోటల్సున్నాయి. ప్రకాష్, ఉషాదేవి శ్రీకాంత్, సంధ్య నలుగురే భోజనానికి కూర్చున్నారు. ఆడవాళ్ళందరూ లోపల ఎక్కడో వున్నట్టున్నారు. వడ్డించే ఇద్దరు ముగ్గురు తప్ప ఇంకెవ్వరూ లేరక్కడ. వారం రోజుల తర్వాత అన్నం ముందు కూర్చున్నదేమో సంధ్యకి ఒక్కసారిగా ఆ అన్నమంతా మింగెయ్యాలని పించింది. శ్రీకాంత్, ప్రకాష్ చాలా విషయాలు సరదాగా మాట్లాడుకున్నారు. ఉషాదేవి మాటలకు సమాధానాలు చెప్తూనే వున్నా సంధ్య దృష్టంతా భోజనం మీదనే వున్నది. నిస్సంకోచంగా, నిర్మొహమాటంగా కడుపు నిండా – బాగా ఎక్కువగానే తిన్నది. సంధ్యను గమనిస్తూనే వున్నాడు శ్రీకాంత్. పెళ్ళయిన తర్వాత ఈ రకంగా సంధ్య ఎన్నడూ భోజనం చెయ్యలేదు. భోజనాలు ముగించి నలుగురూ తాంబూలాలు వేసుకున్నారు. సంధ్య గులాబీ బుగ్గలు, ఎఱ్ఱబడ్డ పెదవులు చూస్తూ అనుకుంది ఉషాదేవి – సృష్టిలో సౌందర్యం ఈవిడలో మూర్తీ-కట్టిందేమోనని! ప్రకాష్ దగ్గర శెలవు తీసుకుని బయలు దేరేసరికి దాదాపు పదకొండు కావచ్చింది. వచ్చే ముందు ప్రకాష్ నెమ్మదిగా శ్రీకాంత్‌తో అన్నాడు.

"శ్రీకాంత్ – తొందరపడి బిజినెస్ వ్యవహారాలన్నీ తెగతెంపులు చేసుకోవద్దు. కష్టపడి పెంచుకున్నావు! ఇంత కష్టపడి ఇంత వృద్ధిలోకి తెచ్చిన ఈ సంస్థలన్నీ నీ భాగస్వాముల పరం చేస్తే నీ కష్టమంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. అదీ కాకుండా నువ్వు వదులుకున్న మరుక్షణం ఇవన్నీ దివాలా తీసేవే. నీ అంత దక్షతగా చేసేవాళ్ళెవరున్నారు. అందులో నువ్వు నిర్ణయించుకోబోయే ముందు బాగా ఒకటికి వందసార్లు – కాదు వెయ్యిసార్లు ఆలోచించుకో–"

"ప్రకాష్ నాకు విరక్తిగా వుంది. ఎవరికోసం ఈ శ్రమంతా పడాలి! నేను రోజు రోజుకీ అలిసిపోతున్నాను! సరే, వస్తాను – తర్వాత మాట్లాడుకుందాంలే!"

ఉషాదేవితో మాట్లాడుతున్నా సంధ్యకీ సంభాషణంతా వినపడుతూనే ఉంది. శ్రీకాంత్ తన వ్యాపార సంస్థలన్నింటితోనూ తెగతెంపులు చేసుకుంటున్నాడా! సంధ్యకు ఆశ్చర్యంగా బాధగా అనిపించింది. కారు స్టార్టు చెయ్యబోతుండగా ప్రకాష్ మళ్ళీ హెచ్చరించాడు. కారులోంచి బయటకు చూచిన సంధ్యకు కొద్దిగా భయం వేసింది. కమ్ముకున్న చీకటి. చుట్టూ పొలాలు. హైదరాబాదుకి చాలా దూరం వచ్చాడన్నమాట. అక్కడొకటి చిన్న చిన్న ఇళ్ళు తప్ప అన్నీ ద్రాక్ష తోటలు. వచ్చే ముందు తనంత పరిశీలనగా గమనించలేదు. బాగా ఎండిన పొట్టలో నిండా అన్నం పడేసరికి సంధ్యకు నిద్ర ముంచుకు వచ్చింది. ఆ క్షణంలో ఆమె ప్రపంచాన్నే మరిచిపోయింది. చల్లని గాలి, వస్తున్న నిద్రకు మరింతగా జోల పాట పాడటం మొదలుపెట్టింది. ఉన్నట్టుండి కీచుమని కారు ఆగటంతో సంధ్యకు మెలకువ వచ్చింది. తను శ్రీకాంత్ భుజం మీద తలపెట్టుకుని పడుకుని వుంది. కారాగిపోయింది. శ్రీకాంత్ కిందకు దిగి చాలా సేపు రిపేరు చెయ్యటానికి ప్రయత్నం చేశాడు. లాభం లేకపోయింది. సంధ్య కారులోనే పడుకుని నిద్రపోయింది.

"సంధ్యా! లాభంలేదు. కారు బాగుకాదు. రేపు చూసుకోవాల్సిందే!" తట్టి లేపుతూ అన్నాడు శ్రీకాంత్.

"మరిప్పుడెట్లా?" భయంగా అంది సంధ్య.

"అక్కడ దూరంగా దీపాలు కనపడుతున్నయి. అక్కడ రిక్షాలేమైనా దొరుకుతయ్యేమో చూద్దాం పద –"

కారు లాక్‌చేసి ఇద్దరూ బయలుదేరారు. నిద్ర మత్తులో సంధ్య నడవలేకపోయింది. కాళ్ళు విపరీతంగా లాగటం మొదలుపెట్టినయి. శ్రీకాంత్ చకచకా నడుస్తున్నాడు. అతనితో నడవటం కూడా కష్టంగానే వుంది. సంధ్యకోసం అతను ఆగవలసి వస్తున్నది.

"త్వరగా నడవాలి! ఇక్కడ మనకంత సేఫ్ కాదు – నడు –"

"నేను నడవలేను – నా ప్రాణం పోతున్నది –" నీరసంగా అంది సంధ్య. అంత చల్లని గాలిలో కూడా ఆమె ముఖం మీద స్వేద బిందువులు చూచి శ్రీకాంత్ మాట్లాడలేకపోయాడు. వీళ్ళ అదృష్ట ఫలమా అన్నట్టు దూరంగా ఒక రిక్షా వీళ్ళ

**జరిగిన కథ-11 :** సంధ్య, మధులు ప్రేమించుకున్నారు. మధు ఫ్రెండు శ్రీకాంత్ అంటే సంధ్యకు తగని చిరాకు, అసహ్యం. సంధ్య పిన్ని కూతురు గీతకు మూర్తి అంటే ఇష్టం. మధుకు నాగపూర్‌లో ఉద్యోగం వచ్చింది. మూర్తి తన భార్య పిచ్చిదని గీతతో చెప్తాడు. మధు చెల్లెలు భవిష్యత్తు బాధకై మాధవిని వివాహం చేసుకోబోతున్నట్లు శ్రీకాంత్ సంధ్య వాళ్ళతో చెపుతాడు. ఇష్టం లేకపోయినా గీత కోసం శ్రీకాంత్‌ను వివాహం చేసుకోను ఒప్పుకుంటుంది సంధ్య. గీత, మూర్తి, సంధ్య, శ్రీకాంత్‌ల పెళ్ళి జరిగిపోయింది. మూర్తి తన భార్యను ఆసుపత్రిలో చేర్పిస్తాడు. మూర్తి, గీత, శ్రీకాంత్ వాళ్ళింటికి వచ్చారు. ఎంత సర్దుకున్నా సంధ్య మనసు శ్రీకాంత్‌ను భర్తగా అంగీకరించదు. ఆమె మధుకి రాసిన ఉత్తరం శ్రీకాంత్ చదువుతాడు. సంధ్య మెడలో మాంగల్యం తెంపెయ్యబోతే వారిస్తాడు శ్రీకాంత్. మూర్తి, గీత వెళ్ళిపోతారు. సంధ్య మళ్ళీ ఉద్యోగంలో జాయిన్ అయ్యింది. కానీ ఆఫీసులో వారి అవాంఛనీయ సంభాషణలు విమల చెప్పగా విని ఉన్నపళంగా ఆఫీసునుంచి ఇంటికి వచ్చేసింది. సంధ్య మనసు శ్రీకాంత్ పట్ల మృదువుగా మారుతుంది. అతనివెంట పార్టీకి వెళుతుంది.

వైపే రావటం కనిపించింది. శ్రీకాంత్‌కి భగవంతుడు కనిపించినట్లయింది. రిక్షాలో సంధ్యకు ప్రపంచంలో ఈ సమయంలో ఈ రిక్షాలో కూర్చున్న సుఖం కంటే వేరే సుఖం వుండటానికి వీలులేదనిపించింది. సంధ్య కూర్చున్న తరువాత రిక్షా ముందుకు సాగిపోయింది. శ్రీకాంత్ రిక్షా వెనకాలే గబగబా నడుస్తున్నాడు. ఎంత నెమ్మదిగా తొక్కినా రిక్షా ముందే వుంటున్నది. ఎంత త్వరగా నడిచినా శ్రీకాంత్ రిక్షాను అందుకోలేకుండా వున్నాడు. అతని షర్టంతా తడిసి ముద్దయిపోయింది.

"ఎంత దూరం నడుస్తారు బాబుగారూ! ఎక్కండి – మీరు నడవలేరు!" తెగించి అన్నాడు రిక్షావాడు.

"వద్దులే! ఇంత ఎత్తు ఇద్దర్ని కూర్చోబెట్టుకుని తొక్కలేవు!" శ్రీకాంత్ నడుస్తూ అన్నాడు.

"జరగండమ్మ గారూ! అయ్యగారు సెమట్లు కక్కుతున్నారు!"

రిక్షావాడి గోలకి సంధ్యకు చిరాకు వేసినా శ్రీకాంత్‌ను చూచిన సంధ్య జరిగి అతనికి చోటివ్వకుండా ఉండలేకపోయింది.

సంధ్య పక్కన కూర్చున్న శ్రీకాంత్ చిత్రంగా అనుభూతి పొందసాగాడు. శ్రీకాంత్ పక్కన కూర్చున్న తర్వాత సంధ్యకి ధైర్యం వచ్చింది. ధైర్యంతో పాటు మర్చిపోయిన నిద్ర మళ్ళీ ముంచుకువచ్చింది. ఎప్పుడు నిద్ర పోయిందో ఆమెకే తెలియదు. శ్రీకాంత్ ఒడిలో అతని రెండు చేతుల మధ్యా సురక్షితంగా హాయిగా పసిపాపలా నిద్రపోయింది సంధ్య. ఆమె నిద్రమత్తులోనే శ్రీకాంత్‌తో టాక్సీ ఎక్కింది. ఆ మత్తుతోనే ఇంటికొచ్చింది. శ్రీకాంత్ సంధ్యను దాదాపు నడిపించుకొని ఆమెను మంచం దగ్గరకు తీసుకొచ్చాడు. ఆమెను పడుకోబెట్టి అదే టాక్సీలో వెళ్ళిపోయాడు. టాక్సీలో వెళ్లి కారును మెకానిక్‌కి అప్పజెప్పి ఇంటి కొచ్చేసరికి తెల్లవారు జామున నాలుగు గంటలయింది. సంధ్య ఆ నగలతో ఆ పట్టు చీరతో అట్లాగే పడుకుని వుంది. సంధ్యతో ఆ గదిలో అట్లా దూరంగా వుండటంతో తనెంతవరకు కట్టుబడి వుండగలనా అని మొదటిసారిగా అతనికి అనుమానం కలిగింది.

★ ★ ★ ★ ★ ★

తూరుపు రేఖలు యింకా పొడసూపలేదు. విశాలమైన కిటికీల్లోంచి చల్లని గాలి హాయిని కలిగిస్తున్నది. బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్న సంధ్యను పట్టుచీర గరగరా గుచ్చుకుంటుంటే పూర్తిగా మెలకువ వచ్చింది. తలతిప్పి చూసేసరికి అప్పుడే తెల్లవారవస్తున్నది. అప్పుడుగాని రాత్రి జరిగిన సంఘటనలన్నీ ఒకదాని తరువాత గుర్తుకురాలేదు. తన కెందుకంత మొద్దు నిద్ర వచ్చిందో! లీలగా తను శ్రీకాంత్ ఒడిలో నిద్రపోవటం గుర్తువచ్చింది. సంధ్య నిస్సహాయంగా నిట్టూర్చింది. శ్రీకాంత్ మంచంమీద బోర్లా అడ్డదిడ్డంగా పడుకుని వున్నాడు. దూరంగా బూట్లు తలోవైపూ పడివున్నాయి. సాక్సుకూడా విప్పలేదు. అతని ముఖం అంత నిద్దరలోనూ అలసటగా వుంది. సంధ్య నెమ్మదిగా లేచి నగలన్నీ తీసింది. పట్టుచీర – సరికొత్తది– తను వేసుకున్న గులాబీరంగు బ్లౌజు చూసి అప్పటికప్పుడు బజారునుంచి కొనితెచ్చిన శ్రీకాంత్ వెర్రి తనానికి సంధ్యకు నవ్వువచ్చింది. నవ్వుతో పాటు జాలికూడా వేసింది. అతను ఎన్నో చీరలు తెస్తాడు. బీరువానిండా హాంగర్సుకి ఎన్నో పట్టుచీరలు వెళ్లాడుతూ వుంటాయి. అతను తెచ్చి, తను ఏ పుస్తకమో చదువుకుంటున్నప్పుడో లేక తను తీరుబడిగా సోఫాలో కూర్చుని వున్నప్పుడో తను తెచ్చిన చీరలు చూపిస్తాడు. తను చూస్తుంది. అవి హాంగర్సుకి మంగి బీర్వాలో సర్దుతుంది. ఇక్కడికి కట్టుకున్న చీరతో వచ్చింది. తను. తరువాత నాలుగైదు వాయిల్ చీరలు తనే వెళ్లి కొనుక్కొచ్చుకుంది. ఈరోజువరకూ అవే కట్టుకుంటున్నది. మొదటిసారి సత్యనారా యణవ్రతంనాడు అతను కట్టుకోమన్న చీరకట్టుకుంది. అది కూడా ఒక గంటా రెండుగంటలు తర్వాత మళ్లీ అదేమైందో కూడా తను చూడలేదు. అసలు పట్టించుకోలేదు. మళ్లీ నిన్న అతను తెచ్చిన చీర కట్టుకున్నది. సంధ్య స్నానంచేసి వచ్చిన తరువాత కూడా శ్రీకాంత్ నిద్రపోతూనే వున్నాడు. సంధ్య వంట ఇంటివైపు నడిచింది. రంగయ్య కాఫీ తయారు చేశాడు.

"రంగయ్యా! రాత్రి అయ్యగారు ఎప్పుడొచ్చారు!"

మిమ్మల్ని దించి ఎళ్లారండి! నాలుగింటికో అయిదింటికో వచ్చారు!" రంగయ్య అందించిన కాఫీ తాగుతూ వంటింట్లో అక్కడే పీట వాల్చుకుని కూర్చున్నది.

"అమ్మగారూ! ఎంత సూసినా వంటకు మడిసి దొరకటం లేదండీ!" రంగయ్య అన్నాడు.

"వటంకు మనిషెందుకు? వద్దు. ఇవ్వాళనుంచీ పనంతా నేనే చేస్తాను!" కాఫీ కప్పు కిందపెడుతూ అంది సంధ్య.

"మీరా! మీరు ఈ పనంతా సెయ్యగలరా!" ఆశ్చర్యంగా అన్నాడు రంగయ్య.

నేనేమైనా లక్షాధికారుల ఇంట్లో పుట్టానా! నాకీ పనంతా అలవాటే!" పనిమనిషి కడిగిపెట్టిన గిన్నెలన్నీ వంటింట్లో సర్దింది సంధ్య. కూరలు ముందేసుకుని తరిగింది. కుక్కరుపెట్టి కూరపోపులో వేస్తుంటగా శ్రీకాంత్ వచ్చాడు. సంధ్య వంట చెయ్యటం చూచి క్షణకాలం కొయ్యబారిపోయాడు. అంతలోనే రంగయ్య వైపు తిరిగి "వంట మనిషి దొరకలేదా! రంగయ్యా" అంటూ సంధ్య వైపు తిరిగి "సంధ్యా! నువ్వు వంట చెయ్యనక్కరలేదు. వంటమనిషి వచ్చేవరకు హోటల్‌నుంచి కారియర్ తెప్పిస్తాను!" విసురుగా అన్నాడు శ్రీకాంత్. రంగయ్య అక్కడనుంచి తప్పుకున్నాడు. సంధ్య ప్రశాంతంగా కాఫీ కప్పులో పోసి శ్రీకాంత్‌కి అందించింది. "నేను వంటచేస్తే మీరు తినరా–" కాలి బొటనవేలు నేలమీద రాస్తూ తలవొంచుకుని అడిగింది సంధ్య.



సంధ్య ఆ నిల్చున్న తీరు– అడుగుతున్న ధోరణి చూస్తుంటే శ్రీకాంత్‌కి నిజంగానే నవ్వువచ్చింది.

# రాగసంధ్య

"అదికాదు సంధ్యా! నాకోసం నువ్వు కష్టపడకూడదని నా అభిప్రాయం' నవ్వుతూనే అన్నాడు శ్రీకాంత్

చాలా రోజుల తర్వాత అతను నవ్వటం చూసింది సంధ్య పదిదాటుతూండగా శ్రీకాంత్ కొత్త అలవాటు ప్రకారం వెళ్ళబోతూండగా సంధ్య వెనకనుంచి రంగయ్య ద్వారా భోజనానికి రమ్మని కబురుచేసింది శ్రీకాంత్ పెదవులమీద మళ్ళీ నవ్వు విరిసింది నవ్వితే సంధ్యకు మళ్ళీ ఏం కోపం వస్తుందోనని చాలా సీరియస్‌గా ముఖం పెట్టుకుని డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాడు అప్పటికే అన్నం తప్ప అన్నీ వడ్డించబడి వున్నయి శ్రీకాంత్ కూర్చున్న వెంటనే అన్నం వడ్డించింది సంధ్య వద్దంటున్నా మరీ మరీ ఎక్కువ వెయ్యటంవల్ల శ్రీకాంత్ పారెయ్యటం ఇష్టంలేక తినవలసి వచ్చింది వంట కూడా చాలా రుచిగా వుండటం రెండో కారణం భోజనం మధ్యలో అన్నాడు శ్రీకాంత్

సంధ్యా, నువ్వు కూడా కూర్చో!"

సంధ్య మాట్లాడ లేదు

"నువ్విట్లా మాటా పలుకూ లేకుండా వండినవన్నీ నా కంచంలో వడ్డిస్తే నాకు చాలా కష్టం ఇవన్నీ నేను తినలేను–నాది పొట్టా– చెఱువా!"

సంధ్య మరి కొంత కూర వడ్డించింది

"ఇదింకొక రకమైన శిక్షా నాకు!" శ్రీకాంత్‌కి సంతోషంగానూ వుంది

నువ్వు ఆపుకుంటూ భోజనం పూర్తి చేశాడు

"రంగయ్యా! వంటమనిషికోసం గట్టి ప్రయత్నం చెయ్యి! వంట మనిషి దొరికితే ఇంత రుచికరమైన వంట మనం మిస్ అవుతామనుకో! కాని, ఏం చేస్తాం!"

రంగయ్య అక్కడలేడని తెలిసే అన్నాడు శ్రీకాంత్ సంధ్య నుద్దేశించి

సంధ్య విసురుగా బయటకు వచ్చింది

"అయాచితంగా ఎవరు పెట్టే తిండీ నేను ఆశించను మీ ఇంట్లో తిన్న దానికి ఋణపడకుండా ఈ పనంతా చేస్తున్నాను ఎవరిచేత ఎటువంటి పరాచికాలూ నేను పడను–సహించను–హద్దులు దాటకుండా వుండటం ఇద్దరికీ మంచిది–" వచ్చినంత విసురుగానే లోపలి కెళ్ళిపోయింది సంధ్య సంధ్య రంగయ్యకు పెట్టి తాను తిని అన్నీ శుభ్రంచేసి వచ్చేసరికి దాదాపు ఒంటిగంట కావస్తున్నది లంకంత ఆ ఇంట్లో ఒంటరి తన బ్రతుకును గురించి ఆలోచిస్తూ కాసేపు నిద్రపోయింది

నాలుగు గంటలకు కిందకు వచ్చి నానబోసిన పెసరపప్పు రుబ్బి పెసరట్లు వేసింది కాఫీ పెట్టింది కాఫీ కలుపుతుండగానే శ్రీకాంత్ వచ్చాడు అతను సాయంత్రం కాఫీ మేడమీద తన గదిలోనే తీసుకుంటాడు అందుకని టిఫెను, కాఫీ పైకి తీసుకెళ్ళింది సంధ్య అతను ముఖం కడుక్కొని టిఫిన్ తిని కాఫీ తాగేవరకూ అక్కడే బయట వరండాలో నిలబడి తిన్న తరువాత ప్లేట్లు, కాఫీ కప్పు తీసుకుని వెళ్ళిపోయింది ఆ వెళ్ళటం సరాసరి తోటలోకి వెళ్ళి పైపు పెట్టి తోటంతా నీరు పెట్టింది తన గది ముందు వరండాలోంచి శ్రీకాంత్ అంతా చూస్తూనే వున్నాడు తోటమాలి రాలేదో మాన్పించిందో అతనికి అంతుపట్టలేదు ఈ రకమైన కక్షతో జీవితం ఏ రకంగా ముగుస్తుందో కూడా అతనికి ఊహాతీతంగానే వుంది మధుకి తనెన్ని విధాల నచ్చ చెప్పాడు రమణి పెళ్ళికి తను సహాయం చేస్తానన్నాడు అప్పుగానైనా తీసుకోమన్నాడు

రమణి పెళ్ళి అంత విడదీయరాని చిక్కుముడి కాదని ఎన్నో విధాల నచ్చచెప్పటానికి తను తన శక్తంతా ధారపోశాడు రమణి పెళ్ళికి తను చేసే ఏ రకమైన సహాయమైనా స్వీకరిస్తానని అన్నాడు కాని, మాధవిని మాత్రం వివాహం చేసుకుని తీరాలన్నాడు సంధ్య జీవితం అడవి కాచిన వెన్నెలౌతుందని ఎన్ని విధాల బ్రతిమిలాడినా మధు వినలేదు చివరకు ఏమన్నాడు? మొదటి నుంచి మధుకి తెలుసుట– సంధ్య అంటే తనకెంత అభిమానమో!" నేనేమీ సంధ్యను వివాహానికి అయోగ్యురాల్ని చెయ్యలేదు నువ్వు నిరభ్యంతరంగా సంధ్యను భార్యగా స్వీకరించవచ్చు – ఆమె అనాఘ్రాత పుష్పం అన్నాడు తను నిరుత్తరుడైపోయాడు ఇది చాలా అన్యాయమని మోసమని వాదించాడు కొన్ని కారణాల వల్ల ఇదే న్యాయమని తిరిగి ప్రతిపాదన చేసాడతను తను చివరకు మధుని ఒప్పించలేకపోయాడు కాని సంధ్యను తన భార్యగా చేసుకోవటానికి మధు తన దగ్గర ఒప్పందం తీసుకున్నాడు నిజంగా కేవలం మధు బలవంతం మీదే తను ఒప్పుకున్నాడా! కాదు, తనలో సంధ్య పట్ల వున్న అనురాగం – తన బలహీనత తనని ఒప్పుకునేట్టుగా చేసినయి లేకపోతే సంధ్య తనని కాకుండా వేరొక వ్యక్తిని ప్రేమిస్తున్నదన్న భావన కూడా తనకు రానంత తీవ్రంగా ఉంది ఆమె పట్ల తన ప్రేమ ఈ ప్రేమకి అవధి లేకుండా వున్నది ఇప్పటికైనా ఆమెను మధు దగ్గరకు పంపితే ఛ తన ఆలోచన తనకే అసహ్యమనిపించింది మధు సంధ్యను తన పరిదాపులకి కూడా రానివ్వడు పైగా బుద్ధి చెప్పి తన దగ్గరకే పంపుతాడు ఈ ప్రశ్నకు సమాధానం లేదేమో! ఈ జీవితం ఇట్లా గడిచి పోవాల్సిందేనేమో! ఆలోచనలు ఆలోచనలుగానే వున్నయి చీకటి పడిపోయింది అట్లా ఆ కుర్చీలో ఎంతసేపు కూర్చున్నాడో తనకే తెలియదు ఎనిమిది గంటలకు రంగయ్య వచ్చి భోజనానికి పిలిచాడు ఒంటరిగా ఆ డైనింగ్ టేబిల్ ముందు కూర్చుని ఆ దిగులుతో భోజనం చేసేకంటే ఆకలితో చచ్చిపోవటం చాలా ఉత్తమమనిపించిందతనికి ఈ మధ్య అన్ని విషయాలలోనూ ఉత్సాహం చచ్చిపోయింది మతిమరుపు ఎక్కువైపోయింది మొన్న జరిగిన మీటింగ్‌లో లాభాలు సగానికి సగం తగ్గిపోయినయి అందరి ముందూ తను తల వొంచుకోవలసి వచ్చింది ఇదే విధంగా సాగితే తనను నమ్ముకున్న వాళ్ళందర్నీ తను నట్టేట్లో ముంచవలసిన స్థితి ఏర్పడుతుంది ఇంతలో ఫోన్ మ్రోగటంతో భోజనం ముగించకుండానే లేచి వెళ్ళాడు శ్రీకాంత్ దాదాపుగా అరచినట్లుగా పెద్దగా మాట్లాడుతున్న అతని ధోరణికి వంట గది లోంచి సంధ్య, ముందు వరండాలోంచి రంగయ్య ఇద్దరూ పరుగెత్తుకుంటూ వచ్చారు

"రంగయ్యా, త్వరగా నీళ్ళు తీసుకురా –" అంటూ రంగయ్య తెచ్చిన నీళ్ళతో చెయ్యి కడుక్కొని బయటకు పరుగుపెట్టాడు శ్రీకాంత్

'ఏం జరిగింది రంగయ్యా!" ఆదుర్దాగా అంది సంధ్య

"ఏమోనమ్మా నాకూ తెలవటంలేదు–"

రంగయ్యతో పాటు సంధ్య కూడా హాల్లోనే కూర్చుండిపోయింది. దాదాపు రెండు గంటల తర్వాత బయట కారు హారను వినపడింది రంగయ్య ఒక్క పరుగులో వాకిట్లోకి పరుగెత్తాడు సంధ్య అక్కడే కూర్చున్నది కాని లేవలేదు ఇంతలో రంగయ్య సహాయంతో శ్రీకాంత్ ఒక స్త్రీ శరీరాన్ని మోసుకొచ్చి లోపల పడుకోబెట్టాడు రంగయ్య గబగబా లోపలికెళ్ళి చాప పరిచి ఆ శరీరాన్ని శ్రీకాంత్ సహాయంతో చాప మీద పడుకోబెట్టాడు దీపం వెలిగించి ఆమె తల దిక్కున పెట్టాడు మెడ వరకు కప్పి వున్న గుడ్డను పైకి లాగి పర్చాడు

'బాబుగారూ –' బయట వరండాలో స్తంభాని కానుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్న శ్రీకాంత్‌ని అనుమానంగా అడిగాడు రంగయ్య ఎవరన్నట్టు! అంతవరకు సోఫాలో కొయ్యలా బిగుసుకుని పత్తికాయల్లా కళ్ళు పెద్దవి చేసి జరుగుతున్న కార్యక్రమంతా చూస్తున్న సంధ్యకు ఆ గదిలో ఆ శవంతో తాను ఒంటరిగా వున్నానన్న భావం గుండెల్ని పిండి ముద్ద చేసింది కెవ్వున కేక పెట్టి ఒక్క పరుగులో శ్రీకాంత్ దగ్గరకు వచ్చి అతని భుజం గట్టిగా పట్టుకుంది ఆమె గజగజా వణకటం చూచిన శ్రీకాంత్ ఆమె వీపు మీద చెయ్యి వేసి దగ్గరకు తీసుకున్నాడు ఆ క్షణంలో ఒక మనిషి అండ ఎంతైనా అవసరంగా కనిపించింది సంధ్యకు మరుక్షణంలో అతనికి గాఢంగా అల్లుకుపోయింది సంధ్యలో చైతన్యం వుందో లేదో కాని శ్రీకాంత్ ఆమెకు ధైర్యం చెప్తూ రంగయ్యను శవానికి కాపలాగా పంపాడు చాలాసేపటికి కోలుకుంది సంధ్య లోపలకు రావటానికే ఆమెకు భయంగా వుంది శ్రీకాంత్ బలవంతంగా లోపలికి తీసుకువచ్చాడు సంధ్య అతన్ని వదలలేదు శ్రీకాంత్ దాదాపుగా ఆమెను పొదివి పట్టుకున్నాడు

సంధ్యా! ఈమె రాధ – మూర్తి మొదటి భార్య – నువ్వు చూడలేదు కదూ!'

# భారతి

## ఏప్రిల్, 1985 సంచికలో....

### వ్యాసాలు:



### కవిత్వం:



### కథలు:



ముఖ చిత్రం: ప్రముఖ నాట్యాచార్యులు శ్రీ వెంపటి చినసత్యం







# రాగసంధ్య

"ఈవిడ ...ఈవిడ ఎందుకు పోయింది –" ఆ ఒక్క మాటకే సంధ్య విశ్వప్రయత్నం చెయ్యవలసి వచ్చింది.

"తెలియదు – డాక్టర్లకే ఆశ్చర్యంగా వుంది. ఒక సంవత్సరం బాగా ట్రీట్‌మెంట్ ఇప్పిస్తే కొంతవరకు కోలుకుంటుందన్న డాక్టర్ల సలహా మీదే హాస్పటలులో చేర్పించాం. రాత్రి బాగానే వుందిట. పొద్దున కొంచెం నలతగా వుందట. పొద్దుటి నుంచీ పడుకునే ఉంటే నిద్ర పోతున్నదనుకున్నారుట. కాని, ఆ నిద్రలో నే పోయింది. హార్టు ఎటాక్ అని డాక్టర్లు నిర్ణయించారు–"

"అయితే మాత్రం – అంత నిర్లక్ష్యమా! నిద్రపోతుందో, మరణించిందో కూడా తెలుసుకోలేదా వాళ్ళు –"

"వాళ్ళు చేసిన పరీక్షలలో ఆవిడకు ఇదివరకే ఈ హార్టు ఎటాక్ రెండు సార్లు వచ్చిందట. మూడవసారి వస్తే బతకదని అనుకుంటూనే వున్నారుట. కాని, ఆ లక్షణాలేవీ పొద్దున వరకూ వాళ్ళకు తెలియలేదట. అంతా క్షణాల మీద జరిగిపోయిందన్నారు–"

"ఇది చాలా అన్యాయం!"

"ఆవిడ చనిపోయిన మాట మాత్రం నిజం! ఇప్పుడీ శవాన్ని ఏం చెయ్యాలి? మూర్తి ఎక్కడున్నాడో కూడా తెలియదు. ఈవిడ తలిదండ్రుల గురించి కూడా నాకు తెలయదు–" శ్రీకాంత్ బాధగా నుదురు కొట్టుకున్నాడు.

"అమ్మాయిగారూ! కాస్త కాఫీ అయినా తీసుకోండి –" రంగయ్య నెమ్మదిగా అంటున్నాడు. సంధ్యకా మాటలేవీ వినిపించటం లేదు. ఆ సోఫాలో అక్కడే కూర్చుండి పోయింది. నిజంగా రాధ చచ్చిపోలేదేమో! ఒక్కసారిగా లేచి పిచ్చి కేకలు పెట్టి మీద పడి జుట్టు పట్టుకుంటుందేమో! భయంగా శ్రీకాంత్ ముఖంలోకి చూచింది. అతను కళ్ళ మీద మోచేయి ఆనించుకుని సోఫాలో వెనక్కు వాలి వున్నాడు. శవానికి కొద్ది దూరంలో రంగయ్య కునికిపాట్లు పడుతున్నాడు. కన్ను ఆర్పితే ఎప్పుడొచ్చి రాధ మీద పడుతుందో అన్నట్టు కనురెప్ప వెయ్యకుండా తెల్లవారే వరకూ సంధ్య రాధ శవాన్ని చూస్తూ గడిపింది. తెల్లవారిన తరువాత ఒక్కరొక్కరే రాసాగారు. సంధ్యకు జరుగుతున్నది నిజమో, స్వప్నమో తెలియటం లేదు. అందర్నీ ఆశ్చర్యంలోనూ అద్భుతంలోనూ ముంచిన విషయం గీత, మూర్తి రావటం. దాదాపు పది గంటల ప్రాంతంలో శవానికి సంస్కారం ప్రారంభించబోయే సమయంలో ఇద్దరూ వచ్చారు. మూర్తిని వాస్తవంలోకి తేవటానికి చాలా సేపు పట్టింది. గీత అనారోగ్య కారణంగా ప్రయాణం కాన్సిల్ చేసుకుని మధ్యలో నే వచ్చేశారుట. శ్రీకాంత్‌కాని, డాక్టర్లు కాని రాధ మరణానికి వ్యాఖ్యానం చెప్పలేక పోయారు కాని మూర్తి సరిగానే వ్యాఖ్యానించుకున్నాడు. గీతను పెళ్ళి చేసుకున్నందుకే రెచ్చిపోయింది రాధ. గీతను భార్యగా స్వీకరించటమే రాధ మరణానికి కారణం! రాధ తండ్రి చెప్పినట్టు రాధ సంసారానికి అయోగ్యురాలు కాదేమో! రాధకు తను అన్యాయం చేశాడు. రాధతో సరిపెట్టుకుని సంసారం చేసినట్టయితే ఆ పిచ్చి ధోరణి కొంత వరకు తగ్గేదేమో! గీతతో తను విహారాలూ, వినోదాలూ చేస్తూ రాధ మరణానికి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడా కారణమయ్యాడు. ఎవరెన్ని చెప్పినా మూర్తి దుఃఖానికి అవధులు లేకుండా పోయింది. గీత స్థాణువులా కూర్చుండి పోయింది. ఆమెకు మూర్తి దగ్గరకెళ్ళేందుకే ధైర్యం లేకుండా వుంది. రాధను పెళ్ళికూతురిలా అలంకరించి సాగనంపారు. మూర్తి దహన సంస్కారం అయిన తరువాత కూడా ఇంటికి రావటానికి ఒప్పుకోలేదు. రాధ పిచ్చిది కాదు. రాధకెన్నో ఆలోచనలున్నాయి. రాధకు తనెవరో తెలుసు. తన స్థానమేమిటో తెలుసు. ఆ స్థానానికి భద్రత పోయిందని ఆ స్థానాన్ని శూన్యం చేసి వెళ్ళిపోయింది. నాయీ పాపానికి నిష్కృతి లేదు! నాయీ స్వార్థానికి దండన లేదు! ఈ నేరానికి తీర్పు చెప్పగల న్యాయ నిర్ణేతలు లేరు – రాధ నన్ను శపించి పోయింది. శాపాన్ని అనుభవించటానికి సిద్ధంగా ఉన్నాను. ఇవన్నీ మాట్లాడిన మూర్తి రాధ పోయిన పదమూడో రోజు తెల్లవారి ఎవరికీ చెప్పకుండా ఎటో వెళ్ళిపోయాడు. గీత తన జీవితం ఆ రకంగా ముగుస్తుందని ఊహించుకో లేదు. తీర్థయాత్రల నుంచి వచ్చిన సుందరమ్మకి రాధ మరణం ఎంతో ఆనందాన్నిచ్చింది. ఇకనైనా తన కూతురు కాపురం సుఖంగా వుంటుందని ఆశించింది. రాధ కర్మకాండలన్నీ నెత్తిన వేసుకుని వంచిన నడుము ఎత్తకుండా చాకిరీ చేసింది. ఆవిడ సంతోషం ఎంతో సేపు నిలవలేదు. మూర్తి ఎక్కడకు పోయాడో ఎవ్వరికీ తెలియదు! గీత గుండె చెరువయింది!

(ఇంకా వుంది)

# ఆటలో గెల్చారు దాహంతో వచ్చారు.




## ఇదిగో, ఇక్కడ తయారు క్రొత్త రెక్స్ ట్రింకా వారిపై రుచిదే గెలుపు!

మళ్లీ వీరే గెల్చారు!
గుంపులు గుంపులుగా వచ్చారు.
గోల-గోలగా ఇంట్లోకి దూరారు.
సంతోషంతో కేకలు వేశారు. చల్లటి
పానీయం కావాలని అడిగారు. లేత-లేత
ముఖాలు ఎండలో ఆడి-ఆడి కందిపోయాయి.

మరి నేను కూడా వారిని గెలవడానికి సిద్ధంగా
వున్నాగా! క్రొత్త రెక్స్ ట్రింకాతో. ఎందుకంటే
నాకు తెలుసు దాని మధుర రుచి అందరికీ ఇట్టే
నచ్చుతుందని.

అంతేకాదు, రెక్స్ (నా విశ్వాసాన్ని చూరగొన్న
వారు) ఇప్పుడు నాకు కావలసింది ఎంచుకొనే
అనుకూలం కూడా అందించారు.

పౌడర్ ప్యాకెట్—6 పెద్ద గ్లాసుల
పానీయం తయారు చేసుకోడానికై.
క్రొత్త లిక్విడ్ కాంసెంట్రేట్—నిల్వ
చేసుకోడానికి వీలుగా 3 సీసాల సిరప్
తయారు చేయగల్గింది ఇదొక్కటే. 50 పెద్ద
గ్లాసుల పానీయం తయారు చేయడానికై. వీటి
సహాయంతో ఇట్టే చిటికెలో ఒక ట్రే నిండుగా
రుచికరమైన, ఉత్తేజకరమైన, సేదతీర్చే
చల్లటి పానీయం తయారు చేశా. త్రాగినంతనే
పిల్లలు సంతోషం పట్టలేక గెంతులు వేశారు.
'ఇంకా-ఇంకా కావాల'ంటూ కేకలు వేశారు.
ట్రింకా ఇచ్చి నేను సులభంగా గెల్చిపోయా!




లిక్విడ్ కాంసెంట్రేట్—
50 గ్లాసుల
పానీయం తయారు
చేస్తుంది.

పౌడర్ ప్యాక్
విటమిన్ 'సి' తో
సమృద్ధం చేయబడినది.
6 గ్లాసుల
పానీయం తయారు
చేస్తుంది.







REX
# ట్రింకా
రుచిలో అన్నిటికన్నా మిన్న!

CLARION/B/CP/2/244 TEL

# నిజం ఎక్కడో...నీలి నీడలలో!

పేరులో ఏముంది? అని అనుకొంటాము కాని, ఇదంతా పేరులోనే ఉంటుందేమోనని– పశ్చిమ బెంగాల్ నుంచి పార్లమెంటుకి ఎన్నికైన మార్క్సిస్టు పార్టీ సభ్యుడు అనిల్ బోస్– రాజకీయ ప్రహసనాన్ని ఎవ్వరికైనా అనిపిస్తుంది. ఈ ఎం. పి. గారు సృష్టించిన సంచలనం అంతా ఇంతా కాదు! ఈయన వల్ల మార్క్సిస్టు పార్టీ ప్రతిష్ఠ దెబ్బతినేలా ఉంది కూడా! అయినా భారత రాజకీయాలలో ఇలాంటివి మామూలే కదా! అవినీతి అన్ని పార్టీలలోనూ అలుముకొంటోందని స్పష్టంగా చెప్పవలసిన అవసరంలేదు. అదేమంత ఎటంబిర రహస్యంకూడా కాదు!

హుగ్లీ జిల్లాకి చెందిన ఆరమ్ బాగ్ లోకసభ నియోజకవర్గం నుంచి ఎన్నికైన అనిల్‌బోస్, మాణిక్‌రాయ్ అని పిలువబడే ఒక హంతకుడని కాంగ్రెస్ (ఐ) కి చెందిన డాక్టర్ గోపాల్‌దాస్ నాగ్ లోకసభలో వెల్లడించడంతో అసలు కథ తెరమీదికి వచ్చింది. గోపాల్‌దాస్ అల్లాటప్పా మనిషి కాదు. పశ్చిమ బెంగాల్ ప్రదేశ్ కాంగ్రెస్ (ఐ)కి ఆయన జనరల్ సెక్రటరీ! పైగా ఎంతో అనుభవమున్న రాజకీయ వేత్త. తగిన సాక్ష్యాధారాలతో అనిల్‌బోస్ సందేహం లేకుండా మాణిక్‌రాయ్ అని ఆయన చెబుతున్నారు.

ఓటర్ల జాబితాలో అనిల్‌బోస్ అని ఒకచోట, బిజయానందరాయ్ (ఈయనే మాణిక్‌రాయ్!) అని ఇంకొక చోటా ఉంది. అనిల్‌బోస్ అని ఉన్నచోట వయస్సు 39 సంవత్సరాలు, తండ్రి పేరు సుధీర్ అని ఉందట! అదే బిజయానందరాయ్ అని ఉన్నచోట వయస్సు 40 సంవత్సరాలు, తండ్రిపేరు సుధీరానంద అని నమోదు చేయబడి ఉందట! పేర్లు మారడమే కాదు, తండ్రులు కూడా మారడం పెద్ద తతంగమని గోపాల్‌దాస్ నాగ్ అంటారు. ఓటర్ల లిస్టులో రెండుసార్లు రెండు రకాల పేర్లని నమోదు చేయించడం ఒక నేరమైతే, తండ్రుల పేర్లు మార్చడం మరో నేరమని ఆయన అంటారు. అంతే కాదు, కులాలు మార్చడం మరీ పెద్దనేరం అని ఆయన చెబుతూనే, హత్య వంటి అతి పెద్దనేరం చేసి చట్టం కన్నుకప్పి తప్పించుకొన్నవాళ్లకి ఇలాంటివి అమితాయా? అని ఎద్దేవా కూడా చేసినట్లు వార్తలు అందుతున్నాయి. ఇంతకీ అనిల్‌బోస్ హంతకుడా? కాదా? అని ఎవరికైనా అనుమానం వస్తుంది.

ది టీక్ ఆంగ్లపత్రిక వివరాల ప్రకారం స్పెషల్ రిపోర్ట్ 24/71 ని అనుసరించి 5-2-71 వ తేదీన మాణిక్‌రాయ్ అనే ఆయన (ఈయనే అనిల్‌బోస్ కూడా!) టీమాల్ చక్రవర్తి (20) అని పిలువబడే నక్సలైట్‌ని కత్తితో పొడిచి చంపినట్లు ఆధారాలు ఉన్నాయి. ఇండియన్ పీనల్ కోడ్ ననుసరించి 147, 148 సెక్షన్ల క్రింద కేసు కూడా రిజిష్టర్ చేయబడి ఉంది. హతుని తండ్రి శరత్‌చంద్ర చక్రవర్తి (67) మాణిక్‌రాయ్‌ని గుర్తుపట్టగల స్థితిలో ఉన్నాడని గోపాల్‌దాస్ అంటున్నారు. టీమాల్ చక్రవర్తి 7-2-71 న చనిపోయాక 302 వ సెక్షన్‌ని పరిగణనలోకి తీసుకొని, కేసును విచారణకి కూడా స్వీకరించడం జరిగిందని చెప్పడానికి దాఖలాలు ఉన్నాయి. ప్రాణభయంతో తల్లి దగ్గరికి పరిగెత్తిన టీమాల్‌ని విడువకుండా మాణిక్‌రాయ్ పొడిచినట్లు ప్రత్యక్షంగా చూసినవాళ్ళు చెబుతున్నారు కూడా! మాణిక్‌రాయ్ వెంట 12 నుంచి 15 మంది వ్యక్తులు ఉండటం వల్ల ఎవరూ టీమాల్‌ని రక్షించలేక పోయారు. పట్టపగలు పదిమంది చూస్తూ ఉండగానే దారుణమైన హత్యకి మాణిక్‌రాయ్ ఒడిగట్టినట్లు సాక్ష్యాలు స్పష్టంగా ఉన్నాయి. అటువంటివి ఆ హంతకునికి శిక్ష విధించ వలసింది పోయి, పార్లమెంటుకి సభ్యునిగా ఎన్నుకోవడమేమిటి? ఇదంతా పేరు మార్చుకోవడం వల్ల వచ్చిన చిక్కే కదా!

పేరు ఎందుకు మార్చుకోవలసి వచ్చిందని అనిల్‌బోస్‌ని అడిగితే సమాధానం నిర్దిష్టంగా చెప్పడం లేదు. మాణిక్‌రాయ్ అని పేరు మార్చుకొన్నట్లు అనిల్‌బోస్ చెప్పటం లేదు. అయితే అనిల్‌బోస్‌కి సోదరులుగా చెప్పబడుతున్న సమరానందరాయ్ (ఈయన రైల్వేలో పని చేస్తున్నారు), అచలానందరాయ్ (ఈయన డిఫెన్స్ డిపార్టుమెంటులో పని చేస్తున్నారు!) లు ఈ విషయంలో మౌనంగా ఉంటున్నారు. సోదరులిద్దరూ రాయ్ లు అయినప్పుడు అనిల్ మాత్రం బోస్ ఎలా అవుతారు? ఆయన తప్పకుండా మాణిక్‌రాయ్ అయి ఉంటారని చాలా మంది అనుకొంటున్నారు. అదీకాక బ్రాహ్మణుడైన రాయ్, కాయస్థుడైన బోస్‌గా ఎలా మారగలడని ఎందరో అనుమానపడుతున్నారు. ఇంత జరుగుతున్నప్పటికీ అనిల్‌బోస్ ఎటువంటి ప్రకటనా ఇవ్వటం లేదు. టీమాల్ హత్యకీ అనిల్‌బోస్‌కీ సంబంధం లేదని వాదించేవాళ్ళు కూడా చెప్పుకోదగ్గ సంఖ్యలోనే ఉన్నారు. అలాంటి వాళ్లలో భూ సంస్కరణల మంత్రి బినాయ్ చౌధురి ఒకరు.

బెంగాలీ దినపత్రిక జుగాంతర్‌లో బినాయ్ చౌధురి చేసిన ప్రకటన ఎంతో మందిని ఆరాటంలోనూ ఆశ్చర్యంలోనూ ముంచి వేసింది. ఈయన బాగా ప్రాముఖ్యం పొందిన మార్క్సిస్టు నాయకుడు కూడా కావడంవల్ల ఈయన ప్రకటనకి ఎంతో గుర్తింపు కూడా వచ్చింది. పైగా పశ్చిమ బెంగాల్‌లో మార్క్సిస్టు పక్షాన్ని బలపరిచే వాళ్ళే ఎక్కువ! ఈయన ప్రకటన ప్రకారం అనిల్‌బోస్‌కి మాణిక్‌రాయ్‌కి సంబంధం లేదు. మాణిక్‌రాయ్ చేసినట్లు నమ్మబడిన టీమాల్ చక్రవర్తి హత్యతో అనిల్ బోస్‌కి ఎటువంటి సంబంధమూ లేదు. ఇదంతా రాజకీయపు వ్యూహమని, మార్క్సిస్టు ప్రతిష్ఠని దిగజార్చటానికి ప్రతిపక్షాలు ఆడుతున్న నాటకమని బినాయ్ చౌధురి నొక్కి చెప్తున్నారు.

దీంతో ఏది నమ్మాలో ఏది నమ్మకూడదో అర్థం కాని అయోమయంలో అందరూ పడి పోయారు. వాస్తవాన్ని గుర్తించి ప్రజలకి తెలుప వలసి ఉంది. అయితే పద్మవ్యూహంలా ఉన్న ఈ సమస్యని ఛేదించి నిజాన్ని తెలుసుకోవటం అంత తేలికగా జరిగే పని కాదు. అయినప్పటికీ యదార్థ సంగ్రహాలలో ఎవరి తాహతులో వారు ప్రశ్నించక తప్పదు.

—"నేస్తం"

గోపాల్‌దాస్ నాగ్!





అనిల్‌బోస్? మాణిక్‌రాయ్?

# సుబ్బారావు – సుందరాంగి

సుబ్బారావుకి రాత్రంతా నిద్ర లేకపోవటంతో కళ్ళు మండిపోతున్నాయి ఒళ్ళు తూలిపోతున్నది భార్య మీద రాత్రి వచ్చిన కోపం ఇంకా తగ్గకపోవటంతో బుసలు కొడుతున్నాడు

ఆసలు ఈ సుబ్బారావు ఎవరు! ఆతనికి ఎందుకలా కోపం వచ్చింది" అనే విషయం తెలుసుకోవాలంటే మనం సరిగ్గా ఇరవైనాలుగు గంటలు వెనక్కు వెళ్ళాలి

* * * * * *




సుబ్బారావు యూనివర్సిటీ ఆర్ట్స్ కాలేజీలో లెక్చరర్ రెండేళ్ళ క్రితమే పద్మ మెడలో తాళికట్టి ఒక ఇంటివాడయ్యాడు సుబ్బారావు అంతగా అందగాడు కాకపోయినా మంచి మాటకారి అవటంతో యూనివర్సిటీ కాంపస్‌లో పాప్యులారిటీ సంపాదించుకున్నాడు

సదరు సుబ్బారావు అంతక ముందు రోజు స్టాఫ్‌రూంలో కూర్చుని పని చేసుకుంటుండగా ఫైనలియర్ విద్యార్థిని పంకజం వచ్చింది నమస్కారం మాష్టారు అంటూ

చేస్తున్న పనిని పక్కన పెట్టి ఏం కావాలని అడిగాడు సుబ్బారావు

"ఎస్సైన్‌మెంట్ ఎలా వ్రాయాలో తెలియటంలేదు మాష్టారు వచ్చే వారం సబ్మిట్ చెయ్యకపోతే పరీక్షలకు పోనివ్వనంటున్నారు ప్రొఫెసర్‌గారు అంచేత కొంచెం ఈ పుస్తకం చూసి సలహా ఇవ్వరా మాష్టారు అంటూ నానా మెలికలు తిరిగిపోయింది పంకజం

"సరే రేపురా" అని పంకజాన్ని పంపించేసి ఆ పుస్తకం తెరిస్తే అందులో చిన్న ఉత్తరం 'మాష్టారూ మీరు చాలా అందంగా వుంటారండీ' అంటూ ఉత్తరం చదివిన సుబ్బారావు ముందు కొంచెం కంగారు పడినా, తరువాత మనసారా నవ్వుకుని 'పంకజం నాకు పెళ్ళైంది' అంటు పుస్తకం మూసేశాడు

ఆ విషయం అంతటితో మరిచిపోయుంటే సుబ్బారావుకి సమస్య వుండేది కాదు

ఆ రాత్రి బెడ్‌రూంలో పంకజం వ్రాసిన ఉత్తరాన్ని భార్య పద్మకు చదివి వినిపించాడు

ఆ ఉత్తరాన్ని జోక్‌గా తీసుకుని పద్మ నవ్వుతుందనుకున్నాడు సుబ్బారావు కాని అందుకు భిన్నంగా మీరు ఏ ప్రోత్సాహం ఇవ్వందే ఒక అమ్మాయికి మీకు ఉత్తరం వ్రాసే ధైర్యం ఎలా వస్తుంది అని అడిగేసరికి గతుక్కుమన్నాడు

ఎంతైనా లాయర్‌గారి అమ్మాయివనిపించావు" అన్నాడు సుబ్బారావు అంతకన్నా ఏం అనాలో అర్థంకాక

అప్పటికి భార్య ముఖంలో రంగులు మారటం చూసిన సుబ్బారావు అదేంటోయ్ అంత సీరియస్ అయ్యావ్ అన్నాడు నవ్వుతూ

సీరియస్ అవక మీ రాసకార్యాలకు సంతోషించాలా

పద్మా మరీ అంత అనుమానం పనికి రాదు రాసక్రీడే జరిపేట్టయితే నీకీ ఉత్తరం చూపించటమెందుకు"

మీరేం చెప్పకండి చాటుమాటు వ్యవహారాలన్ని ముందు ఇలానే మొదలవుతాయి నాకు తెలుసు అంది గట్టిగా

పద్మా చదువుకున్న నీవుకూడా సుబ్బారావు మాట పూర్తి కాకుండానే చదువుకుంటే మొగుడు ఇంకో దాని వెంట తిరుగుతుంటే చూస్తూ ఊరుకోవాలా అంటూ ఏడుపు లంఘించుకుంది

సుబ్బారావుకి కోపం పెరిగిపోయి మరొకటేదో అనేశాడు పద్మ మరో రెండన్నది

అలా చిన్న చిన్న చినుకులుగా మొదలైన మాటలు, చిలికి చిలికి వాదనగా మారి చివరికి గాలివాన లాంటి పోట్లాటైంది ఫలితంగా ఆరాత్రి ఇద్దరికి ఎడమొఖం పెడముఖం అయింది ఎందుకిలా జరిగిందా అని ఆలోచిస్తూ సుబ్బారావు జాగారం చేసాడు

ఏదో సరదాకి చెప్పిన విషయాన్ని ఇంత రాద్ధాంతం చేస్తుందా ఇవాళ పద్మ చేతి కాఫీ కూడ

డాక్టర్ ముగ్గరాజు
శ్రీనివాసరావు

తాగను'అనుకుంటూ మంచం దిగి బాత్‌రూమ్ లోకి నడిచాడు

రాత్రేం జరగనట్టు పద్మ కాఫీ, టిఫిన్ సిద్ధం చెయ్యటం సుబ్బారావుకి ఆశ్చర్యం వేసినా–పద్మతో మాట్లాడితే రాజీకి వచ్చినట్టవుతుంచని స్కూటర్ తీసుకుని బర్రున బయలు దేరాడు యూనివర్శిటీకి

కొంచెం దూరం వచ్చిన తరువాత ఆలోచించాడు ఆరోజు టైంటేబిల్ ఏమిటా అని'

ప్రీవియస్‌కి డబుల్ లెక్చర్, ఫైనల్‌కి సింగిల్ లెక్చర్--మొత్తం మూడు గంటలు వాగాలని గుర్తొచ్చే సరికి ఆత్మారాముడు గోల చేశాడు

ఒకసారి వాచ్ చూసుకుని అప్సర హోటల్ వైపు నడిపించాడు స్కూటర్‌ని

ఎయిర్ కండిషన్డ్ రెస్టారెంట్ ఖాళీగా వుంది మూలగావున్న బల్ల మీది కెళ్ళి కూర్చున్నాడు

పది నిమిషాలైంది ఒక్క సర్వరూ రాలేదు ఆత్మా రాముడి గోల ఎక్కువైంది మేనేజర్ దగ్గరికి వెళదా మని విసురుగా లేవ బోయాడు

సరిగ్గా ఆ సమయంలో డోర్ తీసుకుని ఓ సుంద రాంగి లోపలికి రావటంతో సుబ్బారావు కుర్చీలోనే ఉండి పోయాడు ఆ సుందరాంగి తన వైపు చూసి నవ్వేసరికి ఎవరబ్బా ఈవిడ అని అనుమాన పడ్డాడు 'క్లాస్‌మేటా' కాదు స్టూడెంటా కానేకాదు మరెవరై వుంటారు' ఎవరైనా కొలీగ్ భార్యనా' అయితే ఇలా పొద్దునే ఒక్కతే హోటల్‌కెందు కొస్తుంది''

తరువాత తీరికగా గుర్తు తెచ్చుకోవచ్చుని ముందు సభ్యత కోసమని చిరునవ్వు సమా దానంగా ఇచ్చేశాడు

ఆ సుందరాంగి ఎదురుగా వున్న సీటులోకి వచ్చి కూర్చుంటూ మరోసారి'నవ్వింది

బదులుగా నవ్వక తప్పిందికాదు సుబ్బారావుకి

అప్పుడు రంగ ప్రవేశం చేశాడు పది నిమిషాల్నించి సుబ్బారావు ఎదురు చూస్తున్న సర్వర్

మంచినీళ్ళ గ్లాసులు బల్ల మీదుంచి అటెంక్షన్‌లో నిలబడ్డాడు

"నాకు ఇడ్లీ, పూరి, కాఫీ' చెప్పాడు సుబ్బారావు

"నాకు పూరీ వద్దు ఇడ్లీ, వడ, మసాల దోశె, కాఫీ' ఆర్డరిచ్చింది సుందరాంగి

'ఇదేమిటి ఇది బ్రేక్‌ఫాస్టా లేక లంచా!' ఆశ్చర్యపోయాడు సుబ్బారావు

ఆర్డరిచ్చిన టిపిన్స్ వచ్చే లోగా ఆ సుందరాంగి రెండు సార్లు నవ్వితే ఏం చెయ్యాలో అర్థంకాక సమాధానపు నవ్వులు నవ్వాడు సుబ్బారావు

ఈ లోగ మరో రెండు టేబిల్స్ నిండటంతో సర్వర్ల హడావుడి పెరిగింది

టిఫిన్ తినటం పూర్తి చేసి వాష్ బేసిన్ దగ్గరికి వెళ్ళి వస్తున్న సుబ్బారావుకి చెయి కడుక్కోవటానికి వెళు-తున్న సుందరాంగి కనిపించి మరో చిరునవ్వు విసిరింది

ఎమిటబ్బా ఈ చిరునవ్వుల అర్థం అను కుంటా టేబుల్‌కి చేరి కాఫీ తాగుతూ గమనించాడు సుందరాంగి కాఫీ కప్పు కూడా ఖాళీగావుంది



'ఎందుకో ఈ హడావుడి అని మనసులోనే నవ్వుకుని సుందరాంగి కోసం ఎదురు చూడసాగాడు

సుందరాంగి తిరిగి రాలేదు కాని అదేసమయంలో సర్వర్ బిల్ అందించటం, అది చూసిన సుబ్బారావు ముఖం మీద నవ్వు మాయమై కోపం చోటు చేసు-కుంది

ఏమిటయ్యా మీ హోటల్లో రాత్రికి రాత్రే రేట్లు పెంచేశారేమిటి" అన్నాడు చిరాకుగా సర్వర్‌కి సుబ్బారావు ప్రశ్న అర్థంకాక పోవటంతో మాట్లాడ-కుండా నిలబడ్డాడు

లేక పోతే ఇడ్లీ, పూరీ కాఫీకి పది రూపాయిల బిల్లా

సుబ్బారావు కోపం బిల్లుమీద అని అర్థం చేసుకున్న సర్వర్ మరి మీ శ్రీమతి గారు తిన్న టిఫన్ సంగతో

ఛత్ నోర్ముయ్ ఎవర్ని నా భార్య అంటున్నావ్'

అదేంటి సార్ మీ ఎదురు సీట్లో కూర్చుని మీతో టిఫిన్ తిన్నావిడ

ఎదురు సీట్లో ఎవరున్నా వాళ్ళు భార్యలేనా కొంచెం గొంతు పెంచి అన్నాడు సుబ్బారావు

ఇక్కడ జరుగుతున్న హడావుడికి హోటల్ మేనేజర్ కష్టమర్స్ నలుగురైదుగురు మిగిలిన సర్వర్లు గుంపుగా చేరారు

నాకీ హోటల్లో పదిహేనేళ్ల పైచిలుకు సర్వీసుంది బల్లమీద కూర్చున్న పద్ధతి బట్టి ఆ జంట సంబంధం ఏమిటో ఇట్టే చెప్పెయ్యగలను మొదలుపెట్టాడు సర్వరు ఎదురెదురుగా కూర్చుని చూసుకోవటం ఎక్కువ, మాట్లాడుకోవటం తక్కువ చేస్తుంటే అది అప్పుడే ప్రేమలోకి దిగుతున్న జంటన్నమాట అలా కాకుండా మాటలు, ముసి ముసినవ్వులు అలకలు సమపాళ్ళలో వుంటే ఆ జంట మధ్య ప్రేమ నడవ బట్టి రెండేళ్ళు దాటిందన్నమాట అలా కాక పక్క పక్క కుర్చీల్లో

# నిరీక్షణ

నిరీక్షణ తీపి
    తలంపుల గవేషణ
నిరీక్షణ సుమధుర
    సురభిళ అన్వేషణ
విరహిణీ విరహాల
    అహరహంపు టాలోచన
సమాగమం సుఖాంతమైతే
నిరీక్షణ మధురాన్వేషణ

—శ్రీ లక్ష్మీప్రియ

## సుబ్బారావు - సుందరాంగి

కూర్చుని మాట మాటికి భుజాలు తగిలించుకుంటు గుసగుసలాడుతుంటే అది కొత్త పెళ్ళి జంట, అదే కొంచెం వెకిలిగావుంటే చాటుమాటుగా వ్యవహారం సాగిస్తున్న గుంటలన్నమాట ఇవేవి కాకుండా ఎదురెదు రుగా కూర్చుని టిపిన్ తింటానికే హోటల్‌కి వచ్చినట్టుగా ముఖాలు సిరియస్‌గా పెట్టుకుని, వేరు వేరు టిపిన్స్ ఆర్డరిచ్చి మాట్లాడకుండా తిన్నారంటే వాళ్ళు భార్యాభర్తలు కాకుండా మరొకరు అయ్యే అవకాశంలేదు అర్థమైందా అంచేత మీరు భార్యాభర్తలే

సర్వర్ భాష్యానికి సుబ్బారావు తల తిరిగి పోయింది అందరు తననే వింతగా చూడటం మరీ ఇబ్బందిగా వుంది ఆ షాక్‌నుంచి తేరుకుని మాట్లాడబోయేంతలో మేనేజర్ అందుకున్నాడు

ఇతను మా హోటల్లో సీనియర్ సర్వర్ హోటల్ కొచ్చిన వాళ్ళ సంబంధాన్ని ఇట్టే పట్టేయగల దిట్ట వాడిగురి ఇంతవరకు తప్పలేదు అంచేత మరేం మాట్లాడకుండ బిల్లు కట్టండి

సర్వరిచ్చిన షాక్‌నుంచి పూర్తిగా తేలుకొని సుబ్బారావు మేనేజర్ మాటలకు మరింత కంగారు పడ్డాడు

ఇదో రకం మోసమన్నమాట లోకం మరీ కుళ్ళి పోయింది పక్కటేబుల్ మీదనుంచి ఎవరిదో కామెంట్

సుబ్బారావు తల తిరిగిపోయింది జుట్టు గట్టిగా పీక్కోబోయాడు

అప్పుడు చూసుకున్నాడు చేతికున్న వాచీలో టైమ్‌ని ఎనిమిదికి సరిగ్గాఐదు నిమిషాలుంది

అంటే ఇంకో అయిదు నిముషాల్లో యూనివర్శిటీకిచేరి, రిజిష్టర్‌లో సంతకంచేసి, క్లాస్‌లో వుండక పోతే ప్రొపెసర్ ఇవ్వబోయే మెమో

వెంటనే బిల్లు పదిరూపాయలు టిప్పు రెండు రూపాయలు పన్నెండు రూపాయలు సర్వర్ చేతిలో కుక్కి పరుగున బయటకు చేరుకున్నాడు □



# మరో అమ్మాయి కథ

"వందన"





దలు....దబ మని వినిపిస్తున్న తలుపు చప్పుడుకి కళ్ళు బలవంతంగా తెరచి గోడగడియారం వైపు చూశాను. అప్పుడే సాయంత్రం ఐదు గంటలు కావొస్తూంది! మా బాబు కాన్వెంటు నుండి తిరిగి వచ్చినట్లున్నాడు. ఇంతలోనే మళ్ళీ దబ.... దబ మని చప్పుడు! అబ్బ! ఒక్క క్షణం ఆలస్యం చేయ-కూడదు– అనుకుంటూవీధి గుమ్మంవైపు నడిచాను.

వీధి తలుపు తెరచి యధాలాపంగా ఎదురింటివైపు చూశాను. ఆఇంట్లో అమ్మాయి దిగులుగా వీధి గుమ్మంలో కూర్చొని ఉంది. ఇంకా పసి తనపు ఛాయలు పోని ముఖంలో విషాద రేఖలు. ఛెంగు ఛెంగున పరవళ్ళు తీసే వయసులో దీనంగా కూర్చొన్న ఆ అమ్మాయిని చూస్తే. ఏదో హృదయాన్ని కలచిన బాధ. నాలుగు నెలల నుంచి రోజూ చూస్తున్నదే అయినా. ఈ రోజెందుకో, ఆ అమ్మాయితో మాట్లాడి ఓదార్చితే బాగుండుననిపిం-చింది. కాని ఎలా?ఏవిధంగా? తెలియదు!

"అమ్మా టిఫిన్ పెట్టవే" అంటూ మాబాబు అరచిన- అరపుకు మళ్ళీ ఈ లోకంలో పడ్డాను. పద – అంటూ భారంగా లోనికి నడిచాను.

మా బాబుకి ప్లేటులో ఉప్మా పెట్టి, వరండాలో కూర్చొన్నాను. మావీధి తలుపు తీసి ఉంటే, ఆ అమ్మాయి. వాళ్ళ ముందు గది అంతా కనిపిస్తుంది. ఆ అమ్మాయి పుస్తకం చదువుతూనో, మంచంమీద పడుకొనో ఎక్కువగా కనిపిస్తుంది. వయసు 17 ఏళ్ళుంటాయేమో. ఎంతో అమాయకంగా ఉంటుంది. లక్షణమైన ముఖం. వాళ్ళమ్మ మాత్రం చింతామణి నాటకంలోని లచ్చుప్పను గుర్తుకు తెస్తుంది. ఏపనీ చేసినట్లు కనపడదు. ఏ తల్లయినా తను కష్టాలను భరించి తన సుఖం కోసం, తన కూతుర్ని సుఖపెట్టాలని చూస్తుంది. కాని ఈ రాక్షసి మాత్రం. తన సుఖం కోసం, తన జీవనోపాధి కోసం తన కూతుర్ని ఒక ముసిలాడికి అప్పగించింది.

ఆ ముసిలాడు నల్లగా, బాన పొట్టతో, ముఖం మీద స్ఫోటక మచ్చలతో, అక్కడక్కడ నెరసిన వెంట్రుకలున్న బట్ట తలతో వికారంగా ఉంటాడు. అతనికి భార్య పిల్లలు ఉన్నారని తెలిసింది. కొడుక్కి పెళ్ళి కూడా అయిందట! తన మనవరాలి వయసులో ఉన్న ఆ పిల్లతో సంబంధం పెట్టుకోవడానికి వాడికి మనసెలా ఒప్పిందో మరి.

ఆ అమ్మాయి వయసులో ఉన్న ఆడ పిల్లలంతా మంచి బట్టలు వేసుకోవాలని, అందంగా అలంక-రించుకోవాలని ఉవ్విళ్ళూరు తుంటారు. తన తల్లి ఆ కోర్కెలను ఎలాగు తీర్చలేదు. ఆ ముసిలాడైనా ఆ కోరికలు తీరుస్తాడు కదాని వాడితో పొందుకు ఆ అమ్మాయి ఒప్పుకొని ఉండవచ్చు. కాని రోజులు గడిచే కొలది ఆ అమ్మాయికి ఆ మోజులన్నీ తీరి-పోయినట్లున్నాయి. బుద్ధి వికసించి తనకేమి అవసరమో ఇప్పుడిప్పుడే గ్రహిస్తున్నట్లుంది.

నేను మా వారు కలసి సినిమాకు వెళ్ళినా. బయటకు వెళ్ళినాబాధగా చూస్తుంది చుట్టూ ఉన్న తన వయసువాళ్ళు హుషారుగా కబుర్లు చెప్పుకుంటుంటే వారివంక ఆశగా చూస్తుంది కాని ఎవర్తూ ఆ అమ్మాయితో మాట్లాడటానికి సాహసించరు కారణం ఆ అమ్మాయితో మాట్లాడటం చూస్తే ఇంట్లో పెద్దవాళ్ళు ఊరుకోరు నేను ధైర్యం చేసి మాట్లాడుదామని అనుకుంటే మా వారికేమీ అభ్యంతరం లేదు కాని చుట్టుప్రక్కల వాళ్ల విమర్శలకు గురికావలసి వస్తుందేమోనని జడిసి ఊరుకొన్నాను

ఏమిటోయ్! మరీ అంత పరధ్యానంగా ఉన్నావు" అంటూ మా వారు పిలచిన పిలుపుకు ఉలిక్కిపడి చూశాను అప్పటికే బట్టలు మార్చుకొని ఎదురుగా కుర్చీలో కూర్చొని ఉన్నారు అబ్బే ఏమీలేదు అంటూ టీ తీసికొని రావడానికి వంటింట్లోకి వెళ్ళాను

మరునాడు ఆదివారం శనివారం సెకండ్ షోకి గాని, ఆదివారం ఫస్టుషోకి గాని, సినిమాకు వెళ్లే అలవాటు మాకు అది కూడా నేను నిర్ణయించవలసినదే "ఏమండీ! నామనసేమి బాగోలేదు ఈ రోజు అలా పార్కుకి వెళ్దాము సినిమాకు రేపు వెళ్లొచ్చు" అని నేననగానే మావారు "సరే తొందరగా రెడీకా" అని స్నానం చేయడానికి బాత్‌రూంలోనికి వెళ్ళిపోయారు

పార్కులో ఒక మూల ఖాళీగావున్న బెంచీమీద కుర్చొన్నాం బాబు దగ్గరలోనే ఆడుతున్న పిల్లల దగ్గరకు వెళ్లి వాళ్లతో ఆటలో మునిగిపోయాడు "ఎవ్వరితోనైనా ఇట్టే కలసిపోతాడు వీడు" అంటూ – నావైపు తిరిగి "ఇప్పుడు చెప్పు మనసేమీ బాగోలేదన్నావు ఏమిటి కారణం" అని ఆయన నన్నడిగారు

మా ఎదురింటి అమ్మాయి సంగతి చెప్పాను అతని డబ్బు చూసి మోజు పడించంటారా? లేక అతనిచ్చే వస్తువుల గురించి ఆశపడిందంటారా" అంటూ––నా అనుమానాలన్నీ ఆయన ముందుంచాను అంతావిని "అవును చాలా రోజులుగా నేనూ గమనిస్తున్నాను అసలు విషయ మేమిటో కనుక్కో మనకు చేతనయిన సహాయం చేద్దాం"అన్నారు ఆట పూర్తయిందనుకుంటా మా బాబు "డాడీ! ఇంటికి పోదాం ' అంటూ ఆయన చెయ్యి పట్టుకొని లాగేసరికి మాటల్లోంచి తేరుకొని ఇంటివైపు నడిచాం

సోమవారం మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో ఆ అమ్మాయి ఒక్కతే ఇంటిగుమ్మంలో నిలుచొని ఉంది ఎండ తీవ్రంగా ఉండటంతో అందరూ తలుపులు వేసికొని లోపలే ఉన్నారు నేను వీధి గుమ్మం దగ్గరకు వెళ్లి, ఆ అమ్మాయిని లోపలకు రమ్మని సైగ చేసాను పిలిచిందే – తడవుగా ఆ అమ్మాయి సంతోషంగా తలుపులు చేరవైచి గబ, గబా మాఇంటిలోనికి వచ్చేసింది తనను లోపలికి తీసుకొని వెళ్లి కూర్చోమని చెప్పి, నేను వంట ఇంటిలోనికి వెళ్లి రెండు కప్పుల టీ చేసుకొని వచ్చి ఒకటి ఆ అమ్మాయికి ఇచ్చాను

ఆమె పేరు రజని ఆట తొమ్మిదో క్లాసు వరకు చదువుకుందట ఆమె గురించి నేను ఊహించినవన్ని నిజమే ఆముసిలాడి పేరు సుబ్బారావు ఆ అమ్మాయి వాళ్లమ్మ, అతని అగరవత్తుల కంపెనీలో పనిచేసేవారట మెల్లిగా వాళ్లమ్మను డబ్బు ఎరచూపి, బుట్టలో వేసి కొన్నాడట ఇప్పుడు వాళ్లమ్మ, అముసిలాడు కలసి తనను అతనికి లొంగి పొమ్మని బలవంతం చేస్తున్నారట కాని ఇప్పటి వరకు ఎలాంటి అఘాయిత్యము జరగలేదట

"నాకు అందరిలాగే పెళ్లిచేసుకోవాలని ఉంది నాకు నచ్చినవాడు, నేనంటే ఇశ్టపడేవాడు నన్ను పోషించ గలిగితే చాలు అటువంటి మనిషికే నాసర్వస్వాన్ని అర్పిస్తాను కాని నాకు ఆ ఆశ తీరేమార్గం కనుచూపు మేరలో కన్పించడంలేదు సంబంధాలు చూసి పెండ్లి చేసే తండ్రి లేడు ఉన్న తల్లికి నామనస్సేమిటో తెలిసికొని నాకోర్కె తీర్చాలన్న ఉద్దేశ్యం అంతకన్నా లేదు నాఇష్టానికి వ్యతిరేకంగా నాపై ఏదైనా అఘాయిత్యం జరిగితే నేను బ్రతకను" అంటూ చెప్పి ఆ అమ్మాయి తననెలాగైనా రక్షించమంటూ భోరున ఏడ్చేసింది నాకూ కళ్ళు చెమర్చాయి

ఏదో సరదాగా పుస్తకాలు చదువుతుందని అనుకొన్నానుగాని, జీవితం గురించి, ఆ అమ్మాయి మనసులో ఇన్ని ఆలోచనలు ఉన్నాయని, శీలం గురించి ఇంత పవిత్ర భావం పెంచుకొన్నదని అనుకోలేదు ఆ సమయంలో ఆమె ఎంతో ఆత్మీయురాలిగా, మరింత సంస్కారవంతురాలిగా, అంతకుమించి ఉన్నతురాలిగా నాకన్పించింది

"నీకేం భయంలేదు! మా వారికి తెలిసిన పోలీసు ఇనస్పెక్టరు ఒకాయన ఉన్నారు మా పెద్దమ్మగారమ్మాయి స్త్రీ సంక్షేమ ఆఫీసర్ నీకు మా చేతనైన సహాయం చేస్తాము ఈలోగా నీవేమీ తొందరపడవద్దు ' అని ఓదార్చి ఇంటికి పంపించేసాను

సాయంత్రం మావారు రాగానే విషయమంతా చెప్పాను ఆయనసలే జాలి గుండె ఇనస్పెక్టరు దాకా ఎందుకు వాడి సంగతి నేనే చూస్తానంటూ మండిపడ్డారు కాని నేను నచ్చచెప్పిన తరువాత మర్నాడే ఇనస్పెక్టరు గారిని తీసుకొని రావడానికి ఒప్పుకొన్నారు ఆ అమ్మాయి విషయాలే మాట్లాడుకుంటూ కూర్చుండిపోయాము

ప్రొద్దున్నే లేవగానే వీధిలో గలభా వినిపించి ఏమిటో చూద్దామని బయటకు వచ్చాను ఒక్క క్షణం నా కాళ్ల కింద భూమి కంపించినట్లయింది వాకిట్లో ఆ రజని శవం గబ గబ ఇంట్లోకి వచ్చి ఉండబట్టలేక భోరున ఏడ్చేశాను మావారు కంగారుగా లేచి ఏమయ్యింది అంటూ అడిగారు నా నోట మాట రాక వీధిలోనికి వేలెత్తి చూపించాను గబ, గబ బయటకు వెళ్లి చూసి హతాశులయ్యారు

రజని శవం ప్రక్కన కూర్చుని ఆమె తల్లి గట్టిగా ఏడుస్తోంది ఎందుకలా ఏడుస్తావు అసలు నీవు తల్లివేనా పిల్లను చేతులారా నీవే చంపేశావు నీ సుఖం కోసం కన్న కూతురినే బలిచేశావు' అంటూ ఆయన బిగ్గరగా అరవడం విని అంత బాధలో కూడా నాకు కంగారు పుట్టింది ఆయన ఎప్పుడూ అంత కోపంగా ఉండగా నేను చూడలేదు పరుగెత్తినట్లుగా బయటకు వెళ్లి ఆయన రెక్క పట్టుకుని లోనికి తీసుకొని వచ్చాను ఆయన కళ్ళు కూడా చెమ్మగిల్లడం చూసి నాకు మళ్ళీ దుఃఖమాగలేదు

అంతలోనే నేను తేరుకొని 'వెంటనే వెళ్లి పోలీసులను తీసుకొని రండి లేకపోతే శవాన్ని కూడా దహనం చేసి, వాళ్ళు శిక్షపడకుండా తప్పించుకొంటారు" అంటున్న నా మాటలు పూర్తి కాకుండానే, ఆయన బట్టలు వేసుకుని పోలీస్ స్టేషన్‌కి వెళ్లారు

పోలీసులు వచ్చి ఇల్లంతా సోదాచేసి ఒక ఉత్తరాన్ని పట్టుకొచ్చారు అది రజని నాకు వ్రాసింది!

ప్రియమైన అక్కయ్యగార్కి,

నేను మీ ఇంటికి రావడం మా అమ్మ చూచింది. ఇంటికి వెళ్లగానే నన్ను నిలదీసింది. మీ అండ చూసుకొని మా అమ్మకు ఎదురు తిరిగాను నానిర్ణయాన్ని, మీరు చేస్తానన్న సహాయం గురించి చెప్పాను ఎట్టి పరిస్థితులలో ఆ ముసిలాడికి లొంగేదిలేదని గట్టిగా చెప్పాను

ఆ రాత్రి అతను రాగానే మా అమ్మ అతను కలసి నాకు నచ్చ చెప్పచూశారు కాని నేను గట్టిగా ప్రతిఘటించడంతో మా అమ్మను సినిమాకు పంపించి, నన్ను బలవంతంగా అనుభవించాడు

ఈ పాపపు ముఖాన్ని మీకు చూపించలేను నా ఆశలు ఈ జన్మలో తీరేవికావు మరో జన్మంటూ వుంటే మీ కడుపున పుట్టే భాగ్యం ప్రసాదించమని ఆ భగవంతుణ్ని వేడుకొంటున్నాను

నమస్సులతో
అభాగ్యురాలు
రజని

ఆ ఉత్తరం చదువుతున్నంతసేపూ నా కళ్ళు ధారాపాతంగా వర్షిస్తూనే ఉన్నాయి

ఆ తర్వాత పోలీసులు ఆ ముసిలాడిని అరెస్టు చేయడం, అతనికి 10 సంవత్సరముల కఠిన కారాగార శిక్షపడటం జరిగింది

రజని చనిపోయిన సంవత్సరానికి, మాకుపాప పుట్టింది అవే కళ్ళు, అదే ముక్కు నేను కడుపుతో ఉండగా పదే పదే రజని గుర్తుకు రావడం వల్లనో లేక దేముడు రజని మొర ఆలకించి, నా పాపగా పుట్టించడం వల్లనో పాపకు రజని పోలికలు వచ్చాయని మేమనుకొన్నాము

పాపకు రజని అనిపేరు పెట్టడానికి మా వారేమీ అభ్యంతరం చెప్పలేదు 



# సినిమా



## "విషకన్య"లో నాగిని

గుహ... ఆహార పదార్థాలు పళ్ళెంలో ఉంచుకుని నాగిని (స్మిత) భయంగా దిక్కులు చూస్తూ వెళ్తోంది... బూజుపట్టి గబ్బిలాలు రొద చేస్తున్న ఒక చీకటి గుహ మూలలో సన్నగా, బలహీనంగా ఉన్న మాంత్రికుని భార్య దృష్టి చటుక్కున నాగిని చేతిలోని పళ్ళెం మీద పడింది. "ఆహారం! ఆహారం!" అంటూ ఆమె పిచ్చిగా నవ్వుతూ లేచి, నాగిని చేతిలోంచి పళ్ళెన్ని లాక్కొని ఆబగా తినసాగింది. ఆమె కంటిలో నీటి పొర తేలగా నాగినిని చూస్తూ "ఆకలితో ఉన్న నాకు పట్టెడన్నం పెట్టావు. నువ్వెవరమ్మా?" అడిగింది.

"నీ భర్త చేత చెరబట్టబడిన నాగకన్య నమ్మా;" అంది నాగిని.

"చెరబట్టబడ్డావా? హుఁ!" నిట్టూరుస్తూ మాంత్రికుని భార్య ఒక మూలకు వెళ్ళి, ఒక దుప్పటి తెచ్చిస్తూ, "ఇదిగో...ఈ మాయా దుప్పటిని నా భర్త నా కిచ్చారమ్మా. ఈ చిత్రహింసలు పడటం నాకిష్టం లేకపోతే, ఏ క్షణాన్నయినా ఇది ఒంటినిండా కప్పుకుంటే— గుహ బయటికి వెళ్ళేందుకు మాత్రం ఉపయోగిస్తుందని, నా ఇష్టమొచ్చిన చోటికి పోయి బ్రతకమని చెప్పారమ్మా. తీసుకో. ఈ దుప్పటి కప్పుకుని బయటపడు. ఆకలి తీర్చిన నీకు మరే ఉపకారం చేయలేను," అంది.

నాగిని జాలిగా చూసింది. "అమ్మా, మీరిలా అష్టకష్టాలనుభవిస్తూ ఇక్కడపడుండి, ఈ దుప్పటితో నన్ను బయటకు వెళ్ళమంటారా? వద్దు. మీరే ఈ చెఱలోంచి వెళ్ళిపోండి."

"పిచ్చిదానా! నా భర్త దుర్మార్గుడే కావచ్చు. ఆయన ఏ క్షుద్ర ఆరాధకుడైనా కావచ్చు. కాని; ఆయన ఉన్న చోటే నాకు దేవాలయమమ్మా. ఈ బొందిలో ఊపిరి ఉన్నంత వరకూ ఆయనే నా దేవుడమ్మా ఇక్కడే నా బ్రతుకు తెల్లారాలి. వెళ్ళమ్మా...వెళ్ళు. ఏ తల్లి కన్నబిడ్డవో— నీ కన్నతల్లి నీ కోసం ఎంత విలపిస్తుందో. వెళ్ళి ఆమెను కలుసుకో!" అని నాగినిని ఆశీర్వదించి, ఏడుస్తూ వెళ్ళిపోయింది.

ఆమె ఆప్యాయతకు నాగిని చలించిపోయింది. "అమృత మూర్తివి, తల్లీ!" అంటూ ఒంటి నిండా దుప్పటి కప్పుకుంది. మరు క్షణంలోనే మాయమైంది.

రవితేజ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో విజయ బాపినీడు సమర్పించే "విషకన్య" చిత్రానికి కె.ఎం. సుబ్బారాయుడు, ఎం.హెచ్. శ్రీనాథ్ నిర్మాతలు.

## జంధ్యాల రచన, దర్శకత్వంలో "మొగుడు—పెళ్ళాలు"

"ప్రేమ, వివాహాల మీద అల్లిన కథ. ఒక మొగుడు, ఇద్దరు పెళ్ళాలకు సంబంధించిన హాస్యభరిత చిత్రం," అన్నారు జంధ్యాల. ఈయన రచన, దర్శకత్వంలో శివరామరాజు నిర్మించిన పై చిత్రంలో నరేష్, భాగ్యప్రియ, వేలు, వీరభద్రరావు, శ్రీలక్ష్మి, కాకినాడ శ్యామల, జానకి, శుభలేఖ సుధాకర్, సౌమ్య, రవి, విశాఖకు చెందిన కళాకారులు పాల్గొన్నారు. ఏప్రిల్ విడుదల.



# విశేషాలు

-జి. వి. జి.

## "మా వారి గోల"లో కామేశం గోల

కిశోర్ (నరేష్) ఏదో ఆలోచిస్తూ కూర్చొనుండగా కామేశం (వేలు) వచ్చాడు. "ఏమిటి, కిశోర్! ఫ్యూజ్ తీసినవాడిలా డల్‌గా ఉన్నావేం ?" అడిగాడు

"ఉద్యోగం అనేది ఫ్యూజ్‌లాంటిదే కదండీ? మీకైతే—అటు అత్తగారి ఆస్తి, మీ ఆస్తి కలసి పెద్ద పవర్ హౌస్‌నే సెటప్ చేసుకున్నారు. డబ్బు అనే కరెంట్ మీ ఇంట్లో ఎప్పుడూ ఫైల్ కాదు," అన్నాడు కిశోర్

"మన రాతల్లో పవర్ ఉండాలేగాని హౌస్‌లోకి అదే వస్తుందయ్యా "

"ఎంతయినా—మా అక్కయ్యను చేసుకున్న మీ అదృష్టవంతులు, బావా!"

"అలా అనకు నేను కట్టుకున్నాను కనుకనే అది సుఖపడుతోందంటాను నేను "

"నే నొప్పుకోను ఏమైనా లక్ష్మీకళ మా అక్కలోనే ఉంది," అంటూ కిశోర్ అటు వస్తున్న తన అక్క లక్ష్మి (విజయవాణి)ని చూసి, "ఏంటక్కా, [illegible] ఊరుకుంటావేం ?" అన్నాడు.

"తప్పు బాబూ! ఈ రోజు మా పెళ్ళి రోజు. పోట్లాడకూడదు ఆయనేమన్నా నేను కాదనను," అంది లక్ష్మి

కిశోర్ గుడ్లు మిటకరించాడు.

విద్యాసాగర్ రెడ్డి దర్శకత్వంలో అశోక్ చిటూర్గా నిర్మించే విష్ణు ఫిలిమ్స్ "మా వారి గోల" చిత్రానికి రాకేష్, వి అమర్‌నాథ రెడ్డి నిర్మాతలు



"ఓ తండ్రి తీర్పు"లో జయసుధ



## షూటింగ్ పూర్తయిన "ఆగ్రహం"

"సోషల్— జంగిల్ చిత్రం హీరో శివకృష్ణ ఫారెస్టు రేంజర్ ఈయన అడవిలోని చెట్టూ పుట్టా ప్రకృతితోపాటు మృగజాలంతో అనుబంధాన్ని పెంచుకుంటాడు.

నాలుగు ఏనుగులు, చిఱుతపులి, ఎలుగు బంటి ఎంతో విస్మయాన్ని కల్గిస్తాయి ఈ చిత్రం కోసం తలకోన సిద్దేశ్వర స్వామి ఆలయం సమీపాన ఒక గృహాన్ని ప్రత్యేకంగా నిర్మించాం హీరో శివకృష్ణ కొన్ని సన్నివేశాలలో ప్రాణాలకు తెగించి నటించారు. మోటారు బైక్ మీద చిఱుతపులితో ఆయన కొన్ని ఫీట్స్‌ను ఎంతో అవలీలగా చేశారు," అన్నారు ఎం రోసిరాజా

ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సి. కె రంజిత్ సమర్పించే జయభారతి ఆర్ట్ ప్రొడక్షన్స్ "ఆగ్రహం" చిత్రంలో శివకృష్ణ, అరుణ, నూతన్‌ప్రసాద్, రాజేంద్రప్రసాద్, శుభలేఖ సుధాకర్, రాజ్యలక్ష్మి, జానకి, అనిత, మమత, మహీజా, కాంతారావు, త్యాగరాజు, రాళ్ళపల్లి, కిరణ్ బాబు, సి.హెచ్ కృష్ణమూర్తి ప్రభృత నటవర్గం చెఱువు—ప్రణవి సమకూర్చిన కథకు పైడిపల్లి రవీంద్రబాబు సంభాషణల కర్త సత్యం స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు లక్ష్మణ్ ఆర్య ఛాయ, ప్రకాశరావు శిల్పం, జగన్నాధరావు సహకార దర్శకత్వం, అప్పారావు సాహసాలు, ఎస్ వి రాజకుమార్ ప్రొడక్షన్, వేణుగోపాల్ కూర్పు, ఎస్ ఆర్ హనుమంతరావు నిర్వహణతో ఎస్ ఆర్ భారతి నిర్మాత





ఉగాదినాడు హైదరాబాదులో జరిగిన రాష్ట్ర ప్రభుత్వ నంది అవార్డు ప్రదానోత్సవంలో ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి రామారావు నుంచి ఉత్తమచిత్రం 'స్వాతి'కి బంగారు నంది అందుకుంటున్న దర్శక నిర్మాత శ్రీ క్రాంతికుమార్, రెండవ ఉత్తమ చిత్రం 'కాంచనగంగ'కి వెండి నందిని అందుకుంటున్న శ్రీ అట్లూరి రామారావు, మూడవ ఉత్తమ చిత్రం 'సువర్ణ సుందరి'కి కంచునందిని అందుకుంటున్న శ్రీ అట్ల బ్రహ్మారెడ్డిగార్లని చిత్రంలో చూడవచ్చు

## కృష్ణంరాజు, బాపు, ముళ్ళపూడి కాంబినేషన్‌లో కొచ్చిన్‌లో "బులెట్" పతాక సన్నివేశాలు

"ఒక టాప్ స్టార్ ఎంతో రిస్క్ తీసుకుని, డూప్ లేకుండా స్పీడ్ బోట్ ఛేజింగ్, ఫైట్స్‌లో చూపిన చొరవ అందులోనూ ఎక్స్‌పర్ట్‌లా స్పీడ్ బోట్ నడపడం వండర్‌ఫుల్!" హీరో కృష్ణంరాజు గురించి ఇంతగా విస్మయం చెందింది "బులెట్" పతాక సన్నివేశాల చిత్రీకరణ కోసం చిత్రకల్పన వారు లండన్ నుంచి ఆహ్వానించిన రాయ్‌స్కామెల్ అనే ఫైట్స్ ఎక్స్‌పర్ట్ ఈయన "మిడ్‌నైట్ ఎక్స్‌ప్రెస్", హిందీ "అర్జున్" వగైరా భారీ చిత్రాలకు పని చేసి ప్రశంసలందుకున్నారు ఫిబ్రవరి 12 నుంచి 25 దాకా సముద్ర జలాలపై కొచ్చిన్ చుట్టుపక్కల దాదాపు 70–80 కిలోమీటర్ల పరిధిలో బోట్ ఛేజింగ్స్‌ను అధిక వ్యయ ప్రయాసలకోర్చి అత్యున్నతమైన సాంకేతిక నైపుణ్యంతో చిత్రీకరించినట్లు రచయిత ముళ్ళపూడి తెలియజేశారు నీళ్ళలో భయంకరమైన ప్రేలుళ్ళు బోట్లు ప్రేలిపోవడంలాంటివి స్పెషల్ ఎఫెక్ట్స్ నిపుణుడు అరుణ్ పాటిల్ (బొంబాయి) నిర్వహించారు

షూటింగ్ కార్యక్రమాలు చకచకా సరదాగా సాగిపోవడం చిత్రకల్పన యూనిట్‌లోని ప్రత్యేకత. 120 మంది సభ్యులుగల ఈ యూనిట్ కొచ్చిన్‌లోని బోట్ గట్టి పాలెస్‌లో బస చేసింది. అందరూ విహార యాత్రలా గడిపారు. అంతే కాదు, కొచ్చిన్‌లోని తెలుగు అసోసియేషన్ సభ్యులు దాదాపు 200 మందిని చిత్రకల్పన యూనిట్ ఆహ్వానించి, తెలుగుదనం ఉట్టిపడే రీతిలో చక్కని విందును ఇచ్చారు అక్కడి తెలుగు సమితి భవన నిర్మాణానికి కృష్ణంరాజు ఐదువేలు, చిత్రకల్పన రెండున్నర వేలు, రావుగోపాలరావు రెండున్నరవేలు, గుమ్మడి వెయ్యిన్నూట పదహార్లు, సుధాకర్ వెయ్యి రూపాయలు విరాళంగా ప్రకటించారు పైగా బెనిఫిట్ షోస్‌గా ప్రదర్శించుకోడానికి తమ చిత్రాలు కొన్ని ఇస్తామని కృష్ణంరాజు, చిత్రకల్పన నిర్మాత ముళ్ళపూడి చెప్పారు

మార్చి 16 నుంచి 21 వరకు జరిగిన షెడ్యూల్‌తో మొత్తం షూటింగ్ పూర్తయిన "బులెట్" చిత్రంలో కృష్ణంరాజు, సుహాసిని, రావుగోపాలరావు, గుమ్మడి, సుధాకర్, రాళ్ళపల్లి, దేవిశ్రీ, వీరభద్రరావు, సూర్యకాంతం పాత్రధారులు కె వి మహదేవన్ సంగీతం, థామస్ జేవియర్ ఛాయ, ఎమ్మెల్–కె వి రావు సహకార

అవార్డులని అందుకుంటున్న ఉత్తమ నేపథ్య గాయని శ్రీమతి పి సుశీల, ఉత్తమ నేపథ్య గాయకుడు శ్రీ ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం, ఉత్తమ దర్శకుడు శ్రీ వి మధుసూధనరావు







ఉత్తమ బాలనటుడుగా చి సుబ్రహ్మణ్యం, ఉత్తమ సహాయ నటుడిగా నూతన్‌ప్రసాద్, ఉత్తమ నటుడిగా కృష్ణంరాజు, ఉత్తమ నటిగా సుహాసిని ముఖ్యమంత్రి నుంచి అవార్డులు అందుకుంటున్న దృశ్యం.

దర్శకత్వంలో బాపు దర్శకుడు ముళ్ళపూడి వెంకటరమణ రచయిత, నిర్మాత.

## "ఇల్లాలే దేవత"లో కల్యాణ రాముడు

కల్యాణరాముడు (నూతన్ ప్రసాద్) చేతిలోని బ్రీఫ్‌కేస్ వంక గోపీకృష్ణ (ఎ ఎన్ ఆర్.) చూశాడు

"వాట్, మిస్టర్! పెళ్ళి ఊరేగింపుని చూసినట్టు పెట్టెకేసి ముచ్చటగా చూస్తున్నావ్? దాంట్లో ఏముందనా? క్యాష్ మిస్టర్, క్యాష్ ఈ పెట్టెతో బయలుదేరి కష్టంలో ఉన్న వాళ్ళకు కట్టలు కట్టలు ఇచ్చేయడం నా కాలక్షేపం," అన్నాడు కల్యాణరాముడు

గోపి విచిత్రంగా చూశాడు "ఏమిటీ, కష్టంలో ఉన్న వాళ్ళకి డబ్బిస్తారా?"

"ఖచ్చితంగా ఇస్తాను కాకపోతే బ్రహ్మచారై ఉండాలి"

"ఓహో! అలాగా? ఇంకేం నేను బ్రహ్మచారినే"

"గుడ్ ఏం చదివావ్?"

"గ్రాడ్యుయేషన్"

"వెరీ గుడ్! ఉద్యోగం ఉందా?"

"భలే వారండీ మీరు ఉద్యోగం ఉంటే ఈ పార్కులో గోళ్ళు గిల్లుకుంటూ ఎందుకు కూర్చుంటాము?"

"అవునూ— నువ్వు పొద్దున్నే నక్కతోకే మన్నా తొక్కావా? తొక్కే వుంటావు లేకపోతే నన్ను కలుసుకునే అదృష్టం పట్టదు నీకు. ఓ—కే చెప్పు ఎన్ని లక్షలు కావాలి నీకు?" అంటూ కల్యాణరాముడు పెట్టె మూత తెరిచి, కొందరు యువతుల ఫొటోలు చూపించాడు.

"ఇందులో నీకు నచ్చిన అమ్మాయిని పెళ్ళి చేసుకున్నావంటే— నీకు కట్నం రూపంలో డబ్బొస్తుంది నాకు కమీషన్ రూపంలో డబ్బొస్తుంది"

"ఓర్నీ పెళ్ళిళ్ళ పేరయ్యవా?"

"ఛీ—ఛీ అలా పేరయ్యా, సూరయ్యా అని ఇష్టం వచ్చినట్లు పిలవకు నా పేరు కల్యాణ రాముడు ఎం ఎ ఎం ఎ— అంటే, మేరేజ్ ఏజెంట్!"

"చూడు, ఎం ఎ! అదే మేరేజ్ ఏజెంట్! ఇలా లక్షలూ కోట్లూ అని చెప్పిపోవడం అనవసరం నాకు కావల్సింది మూడు వేలు— ఏర్పాటు చేయగలవా?"

"ముష్టి మూడు వేలకి, రెండు వేలకి సంబంధాలు ఏర్పాటు చెయ్యడానికి ఈ కల్యాణ రాముడు ఎందుకు? నా మాట విను. ఈ పిల్ల నచ్చితే చెప్పు రాధ ఈజ్ ఈక్వెల్ టు యాభై లక్షల్స్!" అంటూ ఒక ఫొటో తీసి చూపాడు

ఆ ఫొటో వంక గోపీకృష్ణ రెప్పలార్పకుండా చూస్తూండిపోయాడు.

తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో నంగునూరు శ్రీనివాసరావు సమర్పించే లక్ష్మీ ఫిలిమ్స్ కంబైన్స్ "ఇల్లాలే దేవత" చిత్రానికి ఎన్.ఆర్. అనూరాధాదేవి నిర్మాత

దాంపత్యం లో జయసుధ. ఎ. ఎన్. ఆర్.



# రసనా తయారు చేయడం అఆఇఈలు నేర్చుకొన్నంత సులభం. నిజం చెప్పాలంటే పిల్లలకూ ఇది ఓ ఆట!

పిల్లలకి రసనా అంటే ప్రాణం. వారికది ఎంతో ఇష్టం. దీన్ని తయారు చేయడం ఎంతో సులభం పిల్లలు స్వయంగా కూడా చేసుకోగలరు.
రసనా ప్యాకెట్ విప్పి దానిలోని పదార్థాన్ని ఒక పాత్రలో వేసి పంచదార, నీళ్లు కలిపితే చాలు రెండు సీసాల సిరప్ నిమిషాల్లో తయారు!
ఏమాత్రం వృధా అవదు ఎందుకంటే సిరప్ నిల్వ చేసుకోవచ్చు ఎంతోకాలం. అందుచేత ఎప్పుడు కావాలంటే అప్పుడు క్షణంలో రసనా మజా-మజాగా త్రాగవచ్చు!
ఎంతో ఆదా కూడా! ప్రతి ప్యాక్‌కు 32 గ్లాసుల రసనా పానీయం తయారుచేసుకోవచ్చు



సిరప్/స్క్వాష్‌పై పెట్టే ఖర్చులో సగం కంటే తక్కువ ఖర్చుకే.
అంతేకాదు, కేవలం రసనా మాత్రమే 9 వివిధ రుచులను అందిస్తుంది.
**ఆరెంజ్, పైనాపిల్, లైమ్, కాలాఖట్టా, మిక్స్ ఫ్రూట్, రోజ్, ఖస్, మసాలా మిల్క్, మసాలా సోడా.**




## రసనా

సాఫ్ట్ డ్రింక్ కాంసెంట్రేట్

**ఎంతో రుచి**
**ఎంతో ఆదా**
**ఇప్పుడు రకరకాల రుచులు**

ఇచ్చట కూడా లభ్యం కువైట్, దుబాయ్, బహరిన్, మారిషస్, కైరో, ఖార్తూమ్, లుసాకా, నైరోబీ, జెడ్డా, ఆస్లో, లండన్

తయారుచేయువారు **పయోమా ఇండస్ట్రీస్, అసర్వా, అహమ్మదాబాద్ 380 016.**

Mudra A PI 2120 TEL.

# సినిమా

## రీరికార్డింగ్ మొదలైన "ఇల్లాలికో పరీక్ష"

"తండ్రీ కొడుకులుగా మోహన్‌బాబు రెండు విభిన్న తరహా పాత్రలను అద్వితీయంగా పోషించారు పరీక్ష ఎదుర్కొనే ఇల్లాలుగా శారద నటన పరాకాష్ఠ నందుకుంది మార్చి 8 నుంచి 16 వరకు ఊటీలో మూడు పాటలు పిక్చరైజ్ చేశాక మార్చి 17నుంచి 24 వరకు మద్రాస్‌లో లాస్ట్ షెడ్యూల్‌ను ఫినిష్ చేశాం," అన్నారు తాతినేని ప్రసాద్ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె వెంకట్రామరాజు సమర్పించే ఎ ఆర్ ఆర్ పిక్చర్స్ వారి 'ఇల్లాలికో పరీక్ష" చిత్రంలో భానుప్రియ, సత్యనారాయణ, త్యాగరాజా, సారధి, పి హెచ్ కృష్ణమూర్తి, టెలిఫోన్ సత్యనారాయణ, రామరాజా, ఆర్.



సినిమా బాగోలేదని అంతగా నువ్వు బాధపడటం దేనికి? తగలెట్టింది నా డబ్బులే కదా!

పద్మరాజా స్మిత, అనూరాధ తక్కిన తారాగణం మోదుకూరి కథకు గణేశ్‌పాత్రో సంభాషణల కర్త వేటూరి గీతాలకు రాజ్—కోటి బాణీలు కూర్చారు విపిన్‌దాస్ ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, నాయని మహేశ్వరరావు కూర్పు, గూనా సహదర్శకత్వం, సూరి ప్రొడక్షన్, బి నాగేశ్వరరావు సహకార దర్శకత్వం కె వెంకట్రాముడు నిర్వహణతో కె. ధ్రువకుమార్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ ఈ చిత్రాన్ని తాతినేని ప్రసాద్ దర్శకత్వంలోనే హిందీలోకూడా నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నట్లు నిర్మాత కె ఎల్ ఎస్ ఎస్ రామచంద్రరాజా తెలిపారు □




**ఎ. కె. పెరికీడు.**

కట్నం కోసం ఒకరిని , ప్రేమ కోసం మరొకర్ని చేసుకోవాలనుకొనే మగజాతినేమనాలి?

★ వాళ్లనెందుకు అనడం? ముందు మీ నిర్ణయం ఏమిటో తేల్చుకోవాలి!

**పి. ఆర్. ఇల్లెందు.**

నేటి బాబాలు, సన్యాసులు, మహాత్ములు, హిప్నటిస్టులపై మీ అభిప్రాయం

★ నిజంగా – నాకో అభిప్రాయం లేదు – లేదూ– లేదూ

★ మహాకవి కోరిన సోషలిజాన్ని మనం చూడ కల్గుతామా?

ఏన కల్గుతున్నాం కదా – కంఠశోషగా?

**కె. ఎ. ఆర్. విజయనగరం.**

వైరాగ్యం ఎప్పుడు వస్తుంది?

★ మన ఎత్తులు పారనప్పుడు! ఎదుటి వాడి కష్టం చూసినప్పుడు– ఆహా! ఈ ప్రపంచం నీటి బుడగ దాని మీద ఇంద్ర ధనుస్సు– యీ జీవితం! అంతే – అనిపిస్తుంది

**కె. ఎస్. ధవళేశ్వరం.**

'నేనూ ఆరుద్రా ప్రేమించు కున్నాం వివాహానికి మీ ఆశీర్వాదం కావాలని, ఒక కాలేజీ అమ్మాయి అందనుకోండి అపుడు మీ రెలా ఫీలవుతారు?

★ 'శుభం' కాస్త త్వరగా పెట్టించు ముహూర్తం పట్టు చీర కట్టుకుని పెళ్లికే వచ్చి ఆశీర్వాదం ఏం కర్మ కాసిని అక్షింతలు కూడా వేసి వెడతా' అంటాను (ఎన్నాళ్ల నుంచో అనుకుంటున్నా ఎవతేనా యిలా నమ్మకంగా యిల్లు చూసు కునేది దొరుకుతుందా అని!)

**ఎ. ఎస్. ఆర్. రొంపిచెర్ల.**

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను ఆమె ప్రేమించింది లేంది తెలియదు

★ అంటే తమకింకా ప్రేమించే వయస్సు రాలేదని అర్థం

**ఎమ్. ఎన్. ఎమ్. విజయనగరం.**

మానవుని విజ్ఞానం సముద్రంలోని కడివెడు నీళ్ళు మాత్రమేనని అంటారు అంటే విజ్ఞానము అపార మైనదని అర్థం ఇది జగమెరిగిన సత్యం అయితే ఏ తరహా ఎటువంటి ప్రశ్నలకుమీరు జవాబు చెప్పలేరో చెప్పకలరా?

★ తెలియదే ! మీ ప్రశ్నలాంటి దానికి ఇవ్వలేను ఎందుకంటే – సముద్రాన్నా? కడవనా? సముద్రంలో ఎన్ని కడవల నీరుండొచ్చు? చెత్తా చెదారం ఇసుకతో కలిసిన విజ్ఞానమా? కాదా! ఇలా ఆలోచించుకుంటూ వుండి పోతాను (సామాన్యుల విజ్ఞానం కొలతకి అందదు బ్రదర్ అది లోకానుభవంతో సంపాదిస్తారు )

**సి. హెచ్. ఎన్. ఆర్. సత్తెనపల్లి.**

న్యాయస్థానం చట్టానికి ప్రాముఖ్యాన్నిస్తుందా? న్యాయానికా?

★ సాక్ష్యానికి ! న్యాయం ఎవడిక్కావాలి?!

**సి డి. బి. మిర్యాలగూడ.**

ఎంతో మంది పేపర్లో కలం స్నేహం శీర్షికకు ఉత్తరాలు రాస్తుంటారు కాని వారికి ఉత్తరం రాస్తే జవాబు యివ్వరు మీ రిచ్చే సలహా?

★ నేనిలాంటి వాటికి సలహా యివ్వను కాని మీరేం రాశారు? అని కుతూహల పడతాను! తెలుసు కోవాలని

**వి. వి. ఆర్. జగ్గయ్యపేట.**

'చూస్తున్నారు కనుక తీస్తున్నాం' అన్న వాదం సినిమాలకి పొసగదు ఎందు కంటే ఏ చెత్త చిత్ర మైనా చూస్తామని అర్థం చెప్పరాదు శంకరాభరణం, సాగర సంగమం, సితార

★ చాలు చాలు ఉత్తమ చిత్రాలు విజయ వంతం కావడమూ – ఫ్లాక్ అంచేత ఉత్తమ చిత్రాలే ఎందుకు తీస్తూ పోరు అని మీరు అడగ వచ్చు – కాని – మినిమమ్ గ్యారంటీగా చూస్తారన్న 'మధ్యమరకం చిత్రాలలో – కాస్తైనా రక్షణ – వుంటుంది– పెట్టు బడికి అని అవి తీయడం శ్రేయస్కరంగా బావించడమూ తప్పు కాదు అంచేత ప్రేక్షకులు చెప్పేది ఒకటి చేసేది ఒకటి– అని గ్రహించండి ఉన్నతాభిరుచీ ఉత్తమ సంస్కారం అంటూ కబుర్లు, ఏ పిక్చర్లో ఎక్కువ సెక్సు హింస ద్వంద్వార్థపు మాట పాటలూ వుంటే వాటిని ఒకటికి పది సార్లు చూడడం– తెలిసిన విషయమే అందుకే మంచి చిత్రం ఒకటి బ్రతికి బట్ట కడితే పది ఇతర చిత్రాలు డబ్బు సంపాదిస్తాయి మామూలు ఆర్థిక శాస్త్రపు లెక్కలు సినిమా రంగానికి వర్తించడానికి ప్రయత్నించ కండి– ఈ తీరే వేరు!

**జె. వి. ఆర్. విజయవాడ.**

మీరు ఏం చదువుకుని ఈ ప్రశ్నలకు జవాబులు రాయికల్గుతున్నారు?

★ అదే గమ్మత్తు చదువుకో కుండానే– రాయి కల్గుతున్నా

మీ పెళ్లికి మీ వాళ్ళు ఎంత కట్నం యిచ్చారు? (నాకు తెలుగు వ్రాయడం సరిగా రాదు హిందీ మీడియమ్ లో చదువు కున్నాను )

★ ఫరవాలేదు ఇలాంటి చొప్పదంటు ప్రశ్న అడగడానికి– ఏ భాష రాక పోయినా యిబ్బంది లేదు బాగానే వ్రాశావు తమ్ముడూ లేదు ఏం కట్నం యివ్వలేదు మా పెళ్లి కసలు డబ్బుతో పనే లేదు అప్పుడు

**ఎస్. బి. దువ్వ.**

చెడిన నీరు నదిని చేరి తీర్థం అవుతోంది చెడిన స్త్రీ పవిత్రమైన వివాహం తరువాత కూడా పవిత్రతగా గుర్తింప బడ దెందుచేత?

★ ఆమె భర్తే క్షణం క్షణం గుర్తు చేస్తూంటాడు ఆమె చెడిన దని, తాను ఉద్ధరించానని భర్తే గౌరవించని స్త్రీని సమాజం గౌరవిస్తుందా? □



వారపత్రికలకు ఒరవడిదిద్దిన

# ఆంధ్రపత్రిక

సంస్థ నుంచి వెలువడిన మరో వనితా పక్షపత్రిక

# కలువబాల



పరితలను ఆలోచింపచేసే రచనలు,
వినూతన శీర్షికలు, పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణ
$\frac{1}{4}$ డెమ్మీ సైజు.

# ప్రేమించవే మనసా......

## అడ్డేపల్లి సుచిత్రాదేవి

(గత సంచిక తరువాయి)

ఆ రోజే శిల్ప భువనేశ్వరి, శివశంకరం గార్లతో యింటికి వెళ్ళిపోయింది.

మరునాటి నుంచీ క్లాసులు మొదలవటంతో సస్య కాలేజికి వెళుతుంది.

శిల్ప మాత్రం యిక చదవనని చెప్పేసింది. చదువులో పడితే ఆ వ్యాపకంలో నైనా శామ్‌ని మరిచిపోతుందని అనుకున్న తల్లీతండ్రికి నిరాశే ఎదురయింది.

ఎవరెంత నచ్చ చెప్పాలని చూసినా లాభం లేకపోయింది. శిల్పకు చిన్నప్పటి-నుంచీ చిత్రలేఖనంలో అభిరుచి ఉండేది. స్కూల్లో చదువుకునేటప్పుడు ఎన్నో బహుమతులు కూడా గెల్చుకుంది. కాలేజీలో అడుగు పెట్టిన తర్వాత స్నేహితులు ఎక్కువవటంతో తన బొమ్మకు గానూ సమయం వెచ్చించను కుదరక ఎప్పుడో అరా ఒకటీ వేస్తూ రాను రాను కుంచె పట్టుకోవడం మానేసింది.

కానీ యిప్పుడు మళ్ళీ తనను తాను మరిచిపోయేందుకు అదొక్కటే సరి అయిన సాధన అనిపించింది శిల్పకు. "చదువు పేరుతో నలుగురిలోకి వెళ్ళట మంటే తను కోల్పోయినదేమిటో అనుక్షణం తెలిసి రావటమే అవుతుంది" అనుకుంది. శామ్ ఏక్సిడెంట్‌లో చనిపోయాడనీ శిల్ప యిక చదువు మానేసిందనీ తెలిసిన రాధిక బొంబే నుంచి బాధపడుతూ ఉత్తరం వ్రాసింది.

సునంద, షాజాది, ఫ్లారీ అందరూ శిల్ప కోసం యింటికి వెళ్ళి స్నేహితురాలి నెంతో బ్రతిమాలారు.

"కాలేజికి రమ్మని, తమతో మామూలుగా కలిసి ఉండమని!"

"శిల్పా, అనుకున్నవన్నీ జరిగితే అది జీవితమూ కాదు, మనం మనుషులమూ కాదు. నీకు చెప్పేంత పెద్దరికం లేకపోయినా మా మాట విను. అతను లేకపోయి-నంత మాత్రాన నీకు నువ్విలా అందరి నుంచీ, అన్నింటి నుంచీ వెలివేసుకుని నాలుగు గోడల మధ్యనే ఉండిపోవటం భావ్యంకాదు!" సునంద అన్నది. ఆ మాటలకు చిన్నగా నవ్వింది శిల్ప. "నేనేదో మీ అందరికీ దూరమైపోయినట్లు మాట్లాడతారేం? మీ కనుల ముందేగా వుంటున్నాను. నేను ఎవరి నుంచీ, ఎక్కడికీ పారిపోవటం లేదు. పారిపోలేను కూడా!" అన్నది.

వాళ్ళు వెళ్ళిపోతుంటే "అప్పుడప్పుడు వస్తూండండి" అని భువనేశ్వరే కోరింది.

శిల్ప స్వహాతాగా మితభాషి. ఎంతో మృదు స్వభావం. ఎప్పుడూ ఎవరినీ ఎదిరించటమూ కానీ, నొప్పించటమూ కానీ తెలియదు.

"మరీ యింత మెతకగా వుంటే ఎలాగే భీతహరిణేక్షణీ!" అని వెక్కిరిస్తూంటుంది కూడా సస్య ఒక్కోసారి.

అలాంటిది ఎవరు చెప్పినా యిక చదువు ప్రసక్తే తేవద్దని అలా కచ్చితంగా చెప్పటం అందరికీ ఆశ్చర్యం వేసింది. అ, ఆలు, ఎ. బి. సి. డి లు కలిసి నేర్చుకుని చిన్నప్పటి నుంచీ కూడా ప్రతి క్లాసులో, సబ్జక్ట్సు కూడా మారక ఒకే ఒక్క డెస్కులో కూర్చుని చదువుతూ వచ్చిన సస్యకు పక్కన శిల్ప లేకుండా క్లాసులో ఉండాలంటే చెప్పలేని వెలితిగా అనిపించసాగింది. శిల్ప అలా నిర్ణయం తీసుకున్నందుకు ముందు కోపం వచ్చింది. కానీ ఆ కోపం క్షణికమే!

పసిపాపలుగా నడక నేర్చుకున్నప్పట్నుంచీ ఒకరి కోసం మరొకరు అడుగులు వేసిన స్నేహం వారిది! ఒకరిపై ఒకరు కోపంతో అలగటమూ అన్నది వాళ్ళకు చేతకానిది!

అయితే మనసుండబట్టలేక విజ్జూ దగ్గర మాత్రం బాధపడింది.

"చూసావా విజ్జూ, కేవలం అతని తోటి అనుబంధం ఒక సంవత్సరం. కానీ మనం, తప్పటడుగుల కాలం నుంచీ కలిసి తిరిగాం. ఈనాడు అతను చనిపోయాడని అదిక యీ లోకంలో అంతా పోగొట్టుకున్నదానిలా ప్రవర్తించటం న్యాయమా?"

విజ్జూ నవ్వుతూ ఓదార్చాడు. "అమ్మాయి మనసు అమ్మాయికే తెలియాలి-మరి. ప్రేమించిన వారి తోడిదే లోకం. ఇక జీవితంలో వేరే ఎవరూ ఏ అనుబంధాలు అక్కర్లేదు అని మీరనుకుంటారు కాబోలు. రేపు తమరూ అంతే. పెళ్ళి అయితే నా బోటి వారు మీ యింటి కొస్తే "ఎవరివయ్యా విజ్జూ నువ్వు? ఏ జన్మలో స్నేహం అంటావు మనది? అని అడుగుతావు!"

"చాల్లే మహా ఆడపిల్లల మనస్తత్వం తెలుసుకున్నావు కానీ" చిరుకోపంతో కసిరింది సస్య.

* * * * *

ఆకాశంలో నల్లగా ముసురుకోబోతున్న మబ్బులు గాలికి చెదిరి కదిలి పోవటం చూస్తుంటే ఏనుగుల గుంపు పరుగులు తీస్తున్నట్టుంది పైన.

కొద్ది సేపటికి ఉన్నట్టుండి గాలి ఆగిపోవటంతో మబ్బులు నిలిచి పొయ్యాయి. సన్నగా తుంపర ప్రారంభమయింది.

నిజానికది వానలా లేదు. విరి జల్లులా ఉంది.

గదిలో కిటికీ దగ్గర నిలుచుని వాననూ, ఆకాశాన్ని చూస్తున్న శిల్ప తన ఫియట్‌కారు తాళాలు తీసుకుని బయటకు వచ్చింది. భువనేశ్వరి వెనుక కిచెన్ గార్డెన్‌లో ఏదో పని చేయిస్తూంది. హాల్లోంచి తాగేసిన టీ కప్పులు లోపలికి తీసుకెళుతున్న పనిమనిషితో "మమ్మీతో నేను బయటకెళుతున్నాను. ఇప్పుడే వచ్చేస్తాను అని చెప్పు" అన్నది. అది తలవూపింది.

సన్నటి జల్లులో విశాలంగా వున్న రోడ్లపై కారు స్లోగా డ్రైవ్ చేసుకుంటూ పోవటం ఓ వింత అనుభూతి!

అయితే ప్రస్తుతం శిల్ప మనసు ఆ అనుభూతిని ఆనందించే స్థితిలో లేదు.

మనసు వారిస్తున్నా గతంలోకి పరుగెడుతుంది.

"ఒకరోజు యిలాగే సన్నటి చినుకులలో తానొక్కతే డ్రైవ్ చేసుకుంటూ పోతుండగా....."

* * * * *

రోడు పక్కగా బస్టాపులో బస్సుకోసం వెయిట్ చేస్తున్న వాళ్ళు శిల్ప అలా ఏమీ పనిలేనట్టు దర్జాగా కారులో కూర్చుని నింపాదిగా నడుపుకు వెళుతుంటే

జరిగిన కథ-5 : భువనేశ్వరి, శివశంకరంగార్ల కూతురు శిల్ప. ప్రేమించిన శ్యామ్ దూరమవడంతో ఆమె బ్రతుకే చీకటయిపోయింది. ఆమెను ఆ దిగులునుంచి మరిపించేటందుకు సస్య, శిల్ప వాళ్ళింట్లోనే నాలుగు రోజులు ఉండి తనతో కూడా తనింటికి ఆమెను తీసుకొని వెళ్ళింది. విజ్జూ, సస్య, శిల్ప, సంజయ్, రజియా కలిసి యాదగిరిగుట్టకు వెళ్ళి వచ్చారు. మరునాడు కాఫీ కూడా తాగకుండా స్నానం చేసి ఇప్పుడే వస్తానని చెప్పి కారులో ఒక్కతే ఎక్కడికో వెళ్ళింది. మధ్యాహ్నం ఒంటి గంటయినా ఆమె జాడ లేకపోయే టప్పటికి శిల్ప డైరీ చదివితే ఏమైనా విషయం తెలియవచ్చని ఆమె డైరీ చూస్తాడు విజ్జూ. శిల్ప గండిపేటకి వెళ్ళి వుండవచ్చని ఊహించి వెళ్ళిన విజ్జూ, సస్యలకు రౌడీలు వెంబడిస్తుంటే పరుగెత్తుకొస్తున్న శిల్ప కనబడింది. నిస్రాణగా పడిపోయిన శిల్పను ఇంటికి తీసుకు వచ్చారు. పెళ్ళి చేస్తే శిల్ప మనసు కుదుట పడుతుందని సస్య తండ్రితో అంటారు శివశంకరంగారు. రజియా తల్లి తండ్రులను తలచుకొని బాధ పడుతూంటే ఆమెని ఊరడిస్తుంది శిల్ప.




కొంచరి కళ్ళు ఆశగా, కొందరు కోపంగా, కొందరు ఈర్ష్యగా చూస్తున్నారు

శిల్ప మనసు రెపరెపలాడింది అంత మంది పాపం వర్షం పెద్దదవుతుందేమోనన్న దిగులుతో, ఎప్పుడు వస్తుందో తెలియని బస్సుకై రోడ్లపై అలా నిలబడి ఎదురు చూస్తుండగా తానిలా కారులో షికార్లు కొట్టటం బాధగా అనిపించింది

కానీ తానేం చేయగలదు?

వాళ్ళందర్నీ ఆ చిన్నకారులో ఎక్కించుకుని వారి వారి గమ్యస్థానాల్లో చేర్చటం అనేది అయ్యేపనా? ఇప్పుడిలా కోపంగా, ఈర్ష్యగా చూసిన వాళ్ళే ఒకవేళ తానాపని గనుక చేస్తే తన మంచితనాన్ని అర్థం చేసుకోక ఎవరో పిచ్చిది అన్నా అంటారు తన ఆలోచనలకు తనే నవ్వుకుంది

ఎప్పుడూ తన మనసు యీ విధంగా దారినపోయే ప్రతి చిన్న విషయాన్ని గురించీ ఎందుకు ఆలోచిస్తుంటుందో కదా' అనుకుంటూ రోడ్డుపైకి చూస్తున్న శిల్ప గభుక్కున కారుకి బ్రేక్ వేసింది

ఆ సన్నటి జల్లులో తడుస్తూ వడివడిగా వెళుతున్నాడు శామ్

# ప్రేమించవే మనసా

తన పక్కనే కారు ఆగటం, అందులోంచి శిల్ప "శామ్" అని తీయగా పిలుస్తుండటము అతనికి "కలా, నిజమా" అనిపించిందో క్షణం.

శిల్ప ఫ్రంట్ డోర్ తెరవడం, అతను కూర్చోవటం జరగగానే కారు ముందుకు కదిలింది.

"మీరు దేవతా ఏమిటి?" జేబులోంచి కర్చీఫ్ తీసి తల తుడుచుకుంటూ అడిగాడు శామ్

అదేమిటి? ఆశ్చర్యంగా అడిగింది శిల్ప ఎదురుగా రోడ్డు వైపే ఏకాగ్రతతో చూస్తూ

నేను మీగురించి అనుకుంటూ నడుస్తున్నాను ఇంతలో మీరే వాహన సమేతంగా ప్రత్యక్షమైపోయారు తపసుకు మెచ్చి వరాలివ్వ దలచిన దేవతలు మాత్రమే అలా ప్రత్యక్షమవుతారంటారు కదా, అందుకని?

బాగా కోస్తున్నారు! నవ్వింది చిన్నగా

'ఏం కోస్తున్నానంటారు? యిక్కడేమీ లేనిదే? అటూ యిటూ చూస్తూ కావాలని అమాయకంగా అడుగుతున్న శామ్‌ని చూసి విచ్చుకుంటున్న పెదవులు బిగపట్టి గంభీరంగా అన్నది శిల్ప

మనసనే మల్లెతీగ నుంచి వలపు సుగందాలను విరజిమ్ముతున్న సుమాలు బోలి మాటలు దోసిట నిండా కోసి, నా పైన వెదజల్లి నేనేమి కోసానంటా వదేమి గడుసుదనం చెలికాడా?

శిల్ప వంక కంగారుగా చూసాడు శామ్ మీరిప్పుడు మాట్లాడినదే భాష?'

ప్రణయ బాష?' ఫక్కున నవ్వింది శిల్ప

ప్ర ప్రణయభాష? నాకు అంత లేసి తెలుగు మాటలు అర్థం కావు సరిగా ఇదేదో తిరకాసులా వుంది?

తిరకాసూ లేదు, అరకాసూలేదు కానీ శామ్ మీకో వింత చెప్పనా?

పత్రికల్లోని ఈ వారం వింతల్లాంటివి కాదుగదా?

చాల్లే బడాయి? ఈ వింత మీకూ నాకూ సంబందించింది!

వెరీ యింట్రస్టింగ్! ఏమిటది?

అతి మెల్లగా చెప్పింది శిల్ప నేను చాలా తక్కువ మాట్లాడుతానని అంటారు నన్ను తెలిసిన వాళ్ళందరూ కానీ కాని అదేమిటో మీ ముందు వుంటే యీ మధ్య నాకు తెలియకుండానే ఏదేదో మాట్లాడేస్తున్నాను ఒక్కదాన్నే వున్నప్పుడు యిది ఆలోచిస్తుంటే ఎంతో ఆశ్చర్యంగా వుంటుంది నేను నేనేనా? అనిపిస్తుంటుంది

అంటే నా సన్నిధిలో మీరు మీరు కాదని నాకూ తెలిసి పోయిందది!" ఎంతో సీరియస్‌గా అన్నాడు అతను

అదేమిటి? అతని వైపు తిరిగింది

"అంటే మీరే నేను, నేనే నీవు! ఆమె కన్నుల్లోకి చూస్తూ నవ్వాడు

ఒక్క నిముషం అతని వైపే తదేకంగా చూసిన శిల్ప కిలకిలా నవ్వింది. అప్పటికి వర్షం జోరు బాగా హెచ్చింది శిల్ప కారు ఎప్పుడు ఆపిందో మాటలలో ఆమెకే తెలియదు రోడ్డు పక్కగా పెద్ద తురాయి చెట్టు కింద ఆగివుందది గాలి విసురుకి చెట్టునుంచి ఎర్రని పువ్వులు గుత్తులుగా రాలి బోనెట్ పై అక్కడక్కడా పడివున్నాయి

అలా వర్షంలో ఎవ్వరూ లేని ప్రదేశంలో తామిద్దరే వుండటం ఒకరి మనసు మరొకరు తెలుపుకోవటం, అద్భుతం! అనుకుంది శిల్ప కన్నుల్లో మెరుపుతో

శిల్పా! మెత్తగా పిలుస్తూ అతను చాపుతున్న చెతుల్లో మృదువుగా వాలిపోయింది, నిస్సంకోచంగా

చిరుజల్లులో తడిసిన అతని షర్టు తడి, గుండెల్లోని వెచ్చదనం రెండూ కలగలసిన ఆ స్పర్శ వింతగా, హాయిగా, మదురమైన అనుభూతిగా శిల్ప మనసులో నిలిచి పోయింది

జీవితం ఎంత ఆనంద మయం?

ఈ అపురూప మైన క్షణాల్లోనే జీవితం ఆగిపోతే?!

★ ★ ★ ★ ★

అదే చెట్టు, అవే పువ్వులు, అదే గాలి, అదేవాన జోరు, అదేకారు, అదేవిధంగా తానూ....... కానీ అతనేడి?

"శామ్! ఎన్నెన్ని వూసులు? మరెన్ని బాసలు? అన్నింటినీ నా ఒక్కదానికే వదిలేసి నువ్విలా వెళ్ళిపోవటం న్యాయమా?"

కనుల నుంచి కన్నీటి ధారలు చెక్కిళ్ళ పై జారుతూ గుండెను తడువుతున్నాయి. కానీ ఎంత కన్నీరు కురిసినా చల్లారే అగ్నికాదు గుండెలో నిది!

కనుల వెలిగెడి విబుడు
కన్నీటిలో ప్రతిఫలింపగ
తుడువకే కన్నీరు చెలీ
తుడువకే, తుడువకో

ఎంత అందంగా చెప్పావమ్మా కవయిత్రీ!

మనిషి శరీరంలో అణువణువునూ పరిశోధించి వాటి ధర్మాలు చెప్పగలిగిన శాస్త్రవేత్తా కన్నీటి గురించి నువ్వేం చెపుతున్నావ్?

అలా ఎంత సేపుందో ఆమెకే తెలియదు దూరంగా ఎక్కడ్నుంచో రేడియోలోంచి ఆంగ్ల వార్తలు వస్తున్నాయి

అంటే తొమ్మిది!

కారు చుట్టూ కారు చీకటి!

రోడ్డు కటు పక్కన షాపుల్లోని లైట్ల కాంతులు యింత దూరం రాలేక పోతున్నాయి

ఇంట్లో తన కోసం కంగారు పడుతుంటారు! ఆ ఆలోచనతో వెంటనే తెప్పరిల్లి కారు స్టార్టు చేయబోయింది

ఊహు, అదేమాత్రం కదలనంది

అరె, ఏమయింది? మళ్ళీ ప్రయత్నించింది ఏమీ లాభం లేదు ఏ మాత్రం కదలిక లేదు ఏమయిందో? అలా సరిగ్గా యిది తను నడిపినంత దూరమే వచ్చి ఆగిపోవటమో వింత! చేసేదిలేక కారు లాక్‌చేసి ముందుకు నడిచింది టపటప మంటూ పడుతున్న చినుకుల్లో తడుస్తూనే షాపుల దగ్గర కొచ్చింది

ఏదైనా ఆటో దొరుకుతుందా అని అటూ యిటూ చూసింది కానీ ఆ మూలకి పనికట్టుకుని ఆటోలు, టాక్సీలు వస్తాయని అక్కడే నిలబడి ఎదురు చూడటం వెర్రితనం అనుకుని ఎదురుగా నున్న ఫాన్సీస్టోర్‌లోకి నడిచింది

షాపు అతన్ని అడిగి టెలిఫోన్‌లో తమ యింటి నంబర్ తిప్పింది

"ఈ మారుమూల షాపులో ఫోనుండటము తన అదృష్టము అని తలచింది

"హలో, డాడీ? మీరేనా, కారు సడన్‌గా స్టార్టు అవటం లేదు డ్రైవరుతో మీ కారు పంపండి యిక్కడికి తానెక్కడున్నదీ చెప్పింది

నేనే వస్తున్నాను!" ఆయన కంఠంలో ఆత్రుత

ఫోన్ పెట్టేసి ఎదురు చూస్తూ నిలబడింది బయటకు వచ్చి పది నిముషాల్లో శివశంకరంగారి ప్లేమత్ వేగంగా వచ్చి ఆగింది వచ్చి తండ్రి పక్కన కూర్చుంది శిల్ప కారు టర్నింగ్ తిరుగుతుండగా కనిపించింది ఆయనకి దూరంగా చెట్టుకింద శిల్ప ఫియట్ వానలో చీకటిలో, జాలిగా!

ఏముంది యిక్కడ? ఎందుకొచ్చింది శిల్ప యిక్కడికి?"

నీ కోసం మమ్మీ ఎంతో కంగారు పడుతుంది ఎందుకొచ్చా విక్కడికి? అడిగారు

ఏమీ మాట్లాడలేదు శిల్ప టైర్ల తాకిడికి రోడ్డుపై నిలిచివున్న నీళ్ళు చిందటం చూస్తోంది మౌనంగా

"ప్చ్, శిల్పకు త్వరగా ఆ మూడుముళ్ళు వేయించేస్తే కానీ యీ భ్రమ వదలదు! అనుకున్నారాయన తనలో తాను మరోసారి గట్టిగా

★ ★ ★ ★ ★ ★

ఆ రోజు ప్రకాష్ ప్రమోషన్ ఆర్డర్స్ అందుకున్నాడు సస్యతో ఆ సంతోషం పంచుకోవాలను కున్నాడు పార్టీ యిస్తానన్నాడు

# మీపాపాయికి
# సిరిలాక్ ప్రేమను అందివ్వండి!

సుమారు 4వ నెల నుంచి, మీ పాపాయికి పాలతోపాటు, ఘనపదార్థాలు కూడా అవసరమవుతాయి. బాబుకు సిరిలాక్ ప్రేమను అందించడానికి తగిన సమయం ఇదే.

**పోషకాహారపు లాభం :** ప్రతి సిరిలాక్ తీసుకున్నప్పుడు, మీ పాపాయికి కావలసిన పోషకాహారాలు–మాంసకృత్తులు-కార్బొహైడ్రేట్లు-కొవ్వు-విటమిన్లు-ఖనిజాలను సమకూరుస్తుంది. మీ పాపాయి ప్రత్యేక అవసరాలకు తగినట్టు సమపాళ్లలో తయారయింది

**త్వరితగతి లాభం :** మీ పాపాయికి ఎప్పుడు కావాలంటే, అప్పుడు, సెకన్లలో సిద్ధమవుతుంది. దీనిలో పాలు, పంచదార ఉండనే ఉన్నాయి. ఇక, మీరు, ముందు మరిగించి వుంచుకున్న నీటిలో దీన్ని కలపాలి-అంతే!

**రుచి లాభం :** మొదటి ఘన ఆహారం, కొత్త గమ్మత్తు రుచినీ అనుభూతినీ ఇస్తుంది. పాపాయిలకు దీని రుచి ఎంతో నచ్చుతుంది. ఇది, శుభారంభం కూడా. మీ పాపాయికి సమపాళ్లలో పోషకాహారాన్ని అందచేసేందుకూ, తయారీలో శుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను అనుసరించండి.

**పెరుగుదల పట్టిక ఉచితం !**
మీ పాపాయికి తన స్వంత పెరుగుదల పుస్తకం కోసం రాయండి-సిరిలాక్, పోస్ట్‌బాక్స్-3 కొత్త ఢిల్లీ-110008.







## సిరిలాక్ కేర్: పోషక రీత్యా పూర్తి విలువలున్నది. ఎంతో రుచికరమైనది

A/FSL/C/3799 TEL

# ప్రేమించవే మనసా

సాయంత్రం అయిదింటికి ప్రకాష్ "యింటికి వస్తాను రెడీగా వుండ మనటంతో సస్య అలంకరణలో ఉంది.

గులాబీ రంగు సిల్కు షల్వార్ కమీజ్ వేసుకుని రెండు జడలు అల్లుకుంది. కనుబొమల మధ్య చిన్న రోజ్ చుక్క, చెవులకు పెద్ద పెద్ద రింగులతో అద్దంలో తన రూపం తనకే ముద్దొచ్చేలా బొమ్మలా తయారయి తన గదిలోంచి కిందకి వచ్చింది.

ఏమీ తోచక ప్రకాష్ కోసం ఎదురు చూస్తూ యింటిముందు పూల మొక్కల మధ్య పచార్లు చేయసాగింది.

సస్య ఎంతో సేపు ఎదురు చూడాల్సిన అవసరము లేకుండానే ప్రకాష్ వచ్చేసాడు. వాళ్ళ ఫ్రెండు కారు అడిగి తీసుకువచ్చాడు. ఎంతో హుషారుగా వున్నాడు.

"లవ్‌లీ!" సన్నగా విజిల్ వేసాడు సస్యనలా చూడగానే.

కొద్దిగా ముక్కు చిట్లించి, కళ్ళు రెపరెపలాడిస్తూ "అలాగా?" అన్నట్లు తమాషాగా నవ్వింది సస్య.

"నిజం! నీకీ డ్రస్ ఎంతో బాగుంది."

సస్య దానికేదో చెప్పబోతున్నదల్లా వీధిలోకి చూసి ఆగిపోయింది. అక్కడ ఎదురింట్లో నుంచి విశాలాక్షిగారు ఎంతో త్వరత్వరగా పరుగెత్తుతున్నట్లే వచ్చి కారులో కూర్చోవటం, డ్రైవరూ సర్రున రోడ్డులోకి తిప్పాడు కారు.

కానీ యింతలో ఆవిడ ఏదో గుర్తు వచ్చినట్లు "ఒక్క నిముషం" అంటూ మళ్ళీ కారునాపించి అంతా హడావుడిలో ఎందుకో లోపలి కెళ్ళింది.

"ఎందుకాంటీ అంత కంగారుగా ఉన్నారు? ఏదన్నా సీరియస్ కేసు వచ్చింది కాబోలు" అనుకుంటుండగా కారుతో పాటే బయటి కొచ్చిన యాదమ్మ డాక్టర్‌గారు మళ్ళీ లోపలకెళ్ళగానే యిక్కడ గేటు దగ్గర సస్యని చూసి పరుగెత్తుకొచ్చింది.

"సస్యమ్మా, విజ్జుబాబుకి కిరికెట్ బంతి తాకినాదంట . ఆళ్ళ దోస్తులు ఫోన్ చేసిండ్రు. దావకానలో చేర్పిండ్రంట."

సస్యకి అర్థమయిందొక్కటే. "విజ్జూకి దెబ్బ?"

ఇంతలో విశాలాక్షి లోపల్నుంచి వస్తూండటము చూసి సస్య గబగబా కారు దగ్గర కెళ్ళింది.

"ఆంటీ, ఏమిటి యాదమ్మ ఏదో అంటుంది?"

"విజ్జూకి క్రికెట్ బాల్ భుజం దగ్గర తగిలి ఎముక ఫ్రాక్చర్ అయిందట. వాళ్ళ ఫ్రెండ్స్ ముందు హాస్పిటల్‌కి తీసుకెళ్ళి అక్కడ్నుంచి నాకు ఫోన్ చేసారు."

"ఆంటీ నేనూ వస్తున్నాను" అని అలాగే వచ్చి ఆవిడ పక్కన వెనుక సీట్లో కూచుంది.

విజ్జూకి గాయమనగానే సస్యకి యింకేమి ఆలోచన రాలేదు. కొన్ని అడుగుల దూరంలో ప్రకాష్ నిలబడి వున్నాడనీ, అతనూ తనూ కలిసి బయటకెళ్ళాలనుకున్న సంగతి అంతా మర్చిపోయింది.

కనీసం అతనితో చెప్పి కారెక్కాలన్న తలంపు కూడా రాలేదు. కారు కదిలి పోతుంటే ప్రకాష్ అప్పుడు ఒక్క వుదుటున గేటుదగ్గర కొచ్చి చూసాడు.

సస్య అంతలో వెళ్ళి పోవటం గమనించిన ఒక్కక్షణం అతని కేమి అర్థం కాలేదు.

"సస్య వెళ్ళి పోయింది!" అన్నది మాత్రమే తెలుస్తుంది. క్షణంలో అతని ముఖం తెల్లగా పాలిపోయింది.

యాదమ్మ చెప్పింది అతనూ విన్నాడు.....కానీ.....

"ఏమయితేనేం, ఎందుకయితేనేం, ఎక్కడకయితేనేం? యిక్కడ తను అనే ఓ మనిషి వున్న ఆలోచనే లేనట్లు....." ఎవరో ఎత్తయిన కొండమీద నుంచి తోసేసి పైనెచ్చు కిందపడిన తనని చూసి హేళనగా పడిపడి నవ్వుతున్నట్లు అనిపించింది ప్రకాష్‌కి.




ఎంత నిర్లక్ష్యం? సస్య తననో ఫూల్‌గా భావిస్తుందా? తన నసలు పట్టించుకోవాల్సిన అవసరమే లేదనుకుందా?"

అతని మనసులో కోపమూ, కసి ఉవ్వెత్తున లేచాయి. విసురుగా వెళ్ళి కారులో కూర్చుని స్టార్టు చేస్తుంటే యిగ్నిషన్ కీ పట్టుకున్న చేయి వణుకుతుంది.

అప్పుడే లోపల్నుంచి పోర్టికోలో కొచ్చిన రజియా కారులో ప్రకాష్ ఒక్కడే వెళ్ళిపోతూండటం చూసింది.

"అరే, ఎందుకతని ముఖం అలావుంది? సస్య ఏమయింది?"

"మేమిద్దరం బయట కెళుతునాం అని చెప్పి డ్రెస్ చేసుకుంటుండింది కదా. మరి అతనొక్కడే వెళ్ళి పోతున్నాడేం? సస్య ఏది?"

అయోమయంగా తోచిందో క్షణం.

అంత వరకూ రెండు కార్లూ రెండు దార్లంట వెళ్ళటం చూసిన యాదమ్మ రజియా దగ్గరకొచ్చి తాను అంతకు క్రితం సస్యకు చెప్పిందే చెప్పింది.

"సస్యమ్మ డాక్టరమ్మతో వెళ్ళింది" అని అది చెప్పగానే రజియాకంతా అర్థమయిపోయింది.

"విజ్జూకి దెబ్బ అనగానే సస్య యిక ప్రకాష్ మాట మరిచిపోయి ఆవిడతో పాటే ఆ కారెక్కేసి వుంటుంది. ఇతనికి కోపం వచ్చి వెళ్ళిపోయినట్లున్నాడు. అయినా యీ సస్య ఒక్కోసారి మరీ యిలా చిన్నపిల్లలా ప్రవర్తిస్తుందేం? అతనితో చెప్పి యిద్దరూ కలిసే వెళ్ళవచ్చుగా, విజ్జూని చూద్దామంటే అతనేమీ కాదనడు కదా? ప్చ్, ప్రకాషనే ఏమిటి? ఎవరికైనా కోపం రాదూ యిలా చేస్తే?

సస్య ఏమీ పసిపాప కాదు ఇరవై ఏళ్ళు పైనే వచ్చాయి. ఆ మాత్రం తనను కోరుకుంటున్న మొగవాడి మనసేమిటో గ్రహించుకోలేకపోతే యిక జీవితంలో సుఖపడటానికి ఎన్ని చదువులు చదివితే ఏం లాభం? ఎంత తెలివితేటలుంటే ఏం లాభం ఆడపిల్లకి?" అనుకుంది చిన్నగా నిట్టూర్చుతూ.

* * * * * *

ప్రకాష్ మనసులో ఒకే ప్రశ్న.

"సస్య తనని ప్రేమిస్తుందా?"

"లేదు, లేదు, లేదు!" అతని అంతరాత్మ అరిచి చెప్పింది. ఆ అమ్మాయి తనకు పరిచయమైనప్పట్నుంచీ జరిగిన సంఘటనలన్నీ గుర్తు చేసుకున్నాడు.

ఎప్పుడూ, ఒక్కసారైనా, ఒక్క క్షణమైనా తన కోసం తహతహలాడినట్లు కానీ, తన సన్నిధిలో తనను తాను మైమరిచిపోవటం కానీ, తన కోసం ఏం చేయటానికైనా సిద్ధపడటం కానీ, ప్చ్ ఏమీ లేవు.

"ప్రకాష్" అని ప్రేమగా పిలుస్తూ ఒక్కసారీ కనీసం తన చేతిని కూడా తాకలేదు. ఎప్పుడూ ఆంక్షలే, ఎప్పుడూ హద్దులే, ఎప్పుడూ గడువులే, బ్రతుకంతా తానామె అనుగ్రహం కోసం ఎదురు చూడటంలో నే సరిపోయేలా వుంది. తానేమీ హద్దు మీరమనటం లేదు. కానీ ఎప్పుడూ తనపై కోరికున్నట్లే అనిపించదే? సస్య తనని ప్రేమించటం లేదు, లేదు! అదో అందమైన భ్రమ. తను "అయ్ లవ్‌యూ" అనగానే తనలో తిరస్కరించాల్సిన గుణాలేంలేవు కాబట్టి నవ్వుతూ తల వూపింది.

ద్వేషించకపోవటమే ప్రేమించటమనుకుని "అయ్ టూ?" అని చిలకలా చెప్పింది. అంతేకానీ అది ఆమె తనని కోరుకోవటం లేదు. అవును!

ఇన్ని రోజుల బట్టి ఎక్కడో ఏ మూలో వుండే సందేహం ఆనాటితో తీరిపోయినట్లయింది.

ఆ అమ్మాయికి తన చుట్టూ వున్న ఆత్మీయుల్లో తానూ వొకడు. అంతేకానీ తానేమీ ఆమె జీవన సర్వస్వం కాదు. కానీ... కానీ తన కలా ఓ జీవిత భాగస్వామిని అక్కర్లేదు!

తను అతిసామాన్యుడు. ప్రతిఫలం ఆశించని మహనీయుల్లా తన ప్రేమను పంచలేడు. తన తోటి వారికి స్నేహాన్ని, ఆత్మీయతనూ యివ్వగలడేమో కానీ తన మనసునూ, జీవితాన్ని తనకు మాత్రమే ప్రాధాన్యతనిచ్చే స్త్రీకి మాత్రమే యివ్వగలడు.

ఇది స్వార్థమే కావచ్చు, అసూయ కావచ్చు, మరేదైనా కావచ్చు కానీ జీవిత సహచరిణి అయో అమ్మాయి మనసులో అత్యున్నత స్థాయి తనకు తప్ప మరెవరికీ ఉండకూడదు.

ఆమెకు తల్లీ తండ్రీ తోబుట్టువులు, స్నేహితులు ఎవరైనాసరే తన తర్వాతే, అంతే!

అలాంటి స్థానం సస్య మనసులో తనకు లేదు! లేదని ఈ సంఘటనతో తెలిసిపోతూనే వుంది!

కానీ అలా అనుకునేందుకు మనసు యిష్టపడటం లేదు. ఆలోచనలతోనే ఎంతో సేపు పిచ్చిగా రోడ్లన్నీ తిరిగాడు. ఆ తర్వాత ఓ హాఫ్ బాటిల్ విస్కీ కొనుక్కుని రూమ్ చేరాడు. ఆ రాత్రి తిండిలేదు. నిశ్చింతలేదు. సీసా కాళీ అయిన తర్వాత దాన్ని గోడకేసి విసుగ్గా విసిరాడు. భళ్ళున పగిలిపోయిందది.

* * * * * *

మరునాడు పొద్దున ప్రకాష్ ఆఫీసులో పని చూసుకుంటుండగా టెలిఫోన్ మోగింది. ఒక చేత్తో చూస్తున్న ఫైల్లో పేజీలు తిప్పుతూనే ఎడం చేత్తో రిసీవర్ అందుకున్నాడు.

"హలో" యధాలాపంగా అన్నాడు.

"ప్రకాష్, నేను సస్యను" అవతల్నుంచి ఆ గొంతు వినిపించగానే అతని కుడిచేయి పని ఆపింది ఒక్క క్షణమే! మనసుకు సర్దిచెప్పుకున్నాడు. సాధ్య

## ధర్మపథం



# రామాయణ వైశిష్ట్యం

భారత, భాగవతాల కంటె రామాయణానికే ప్రచారం ఎక్కువ. వాల్మీకి రామాయణం నిత్యపారాయణ గ్రంథం. విష్ణు దేవాలయాలలో చాలా చోట్ల నిత్యమూ శ్రీమద్రామాయణ పారాయణ జరుగుతూ ఉంటుంది. శ్రీరాముని చరిత్రను గురించిన ఈ శ్లోకం ప్రసిద్ధంగా ఉన్నది. అది –

"చరితం రఘునాథస్య
శతకోటి ప్రవిస్తరమ్,
ఏకైకమక్షరం ప్రోక్తం
మహా పాతక నాశనమ్."

శ్రీ రఘురాముని చరిత్ర శతకోటి విస్తారం కలది. అంటే అన్ని వర్ణములు ఉన్నదన్న మాట. అందులో ఒక్కొక్క అక్షరాన్ని ఉచ్చరించినా, మహా పాతకాలన్నీ నశిస్తాయి – అని దీని అభిప్రాయం.

పురాణేతిహాసాలలో విషయానికి ఉన్న ప్రాముఖ్యం కవిత్వానికి ఉండదు. కొన్ని కొన్ని ఘట్టాలు విసుగును కూడా కలిగించవచ్చును. రసవంతమైన కవితను వాటిలో ఆశించలేము. రామాయణం అట్టి పురాణేతిహాసాలలో చేరదు. అది రసప్రధానమైన కావ్యం. సంస్కృతంలో తొలి రచన అదే కావడం వల్ల దానికి ఆది కావ్యమనే ప్రసిద్ధి ఏర్పడినది. కావ్యాల వల్ల కలిగే ప్రయోజనాలన్నీ దానివల్ల లభిస్తాయి. వాల్మీకి కేవలం మహర్షి మాత్రం కాదు. మహాకవి కూడా. రామాయణ ప్రాశస్త్యాన్ని గురించి కంకంటి – పాపరాజామాత్యుడు తన ఉత్తర రామాయణంలో ఇలా చెప్పాడు. ఇది బ్రహ్మ శ్రీరాముని ఉద్దేశించి చెప్పిన పద్యం –

"సారప్రజ్ఞ ఘటించు శ్రోతల కభీ
ష్టంబుల్ ప్రసాదించు, భా
గీరథ్యాపగ బోలి పంక మడచున్
గీర్వామినీ పాద మం
జీర స్ఫార మృదు ధ్వనిన్ చెవులకున్
చేకూర్చు నుల్లాస, మీ
శ్రీరామాయణ మాది కావ్యము సుమీ
సీతా మనో వల్లభా!

(అష్ట మాశ్వాసం. 123. ప.)

రామాయణం ప్రజ్ఞను ప్రసాదించి, విన్నవారికి కోరికలు నెరవేర్చి, గంగానదీ జలంవలె పాపాలను పోగొట్టి, కవితా మాధుర్యం వల్ల ఆనందాన్ని కలిగిస్తుంది. శ్రీమద్రామాయణ పారాయణ పుణ్య ప్రదమైనది.

**–బులుసు వేంకటరమణయ్య**

---

## ప్రేమించవే మనసా

మైనంత మామూలుగా ఉండేందుకు ప్రయత్నిస్తూ మళ్ళీ ఫైలు చూస్తూనే అడిగాడు.

"ఏమిటి?"

"నీకు కోపం వచ్చింది కదూ నా పైన? రాత్రి యింటికి రాగానే వదిన కూడా బాగా కేకలేసింది నన్ను"

నవ్వాడు ప్రకాష్ "వదిన చెప్పబట్టే ఫోన్ చేస్తున్నావా?"

"ఛ, ఛ, అదేంకాదు. నిజమే కాదూ పాపం నువ్వు పార్టీ యిస్తానని ఎంతో ప్రేమగా పిలిస్తే నేను అలా చేయటం నాదే తప్పు. అయామ్ సారీ ప్రకాష్. రియల్లీ వెరివెరి సారీ. విజ్జుకి దెబ్బ, హాస్పిటల్లో చేర్చారనగానే నాకింకేం తోచలేదు" ప్రాధేయపూర్వకంగా అన్నది.

"దట్సవై అయ్ లైక్యూ సస్యా, ఎట్‌లీస్ట్ యువార్ ఆనెస్ట్" అనుకున్నాడు ప్రకాష్ మనసులో.

"ఎలా వుంది విజ్జుకి" అడిగాడు.

"బోన్ కొద్దిగా ఫ్రాక్చరయింది. ఏం ఫర్వాలేదట. సెట్టయిపోతుందట. అయినా ఆ బాల్ కనుక ఏ తలకో తగిలితే ఎంత ప్రమాదము?" ఇంకా సస్య మనసు తన నేస్తం గురించే ఆలోచిస్తుండటం గమనించాడు ప్రకాష్.

"హాస్పిటల్లో వున్నాడా?"

"లేదు యింటికి వచ్చేసాడు. ఇంట్లో ఆంటీ చూసుకోగలరు కదా?"

"ఒకే! నేను సాయంత్రం వచ్చి చూస్తాను" ఫోను పెట్టేయబోతుండగా త్వరత్వరగా అడిగింది సస్య.

"ప్రకాష్, ఆగాగు పెట్టేయ్యకు. ఇంతకీ నీకు కోపం వచ్చిందా రాలేదా? వస్తే పోయిందా, యింకా వుందా అదేం చెప్పలేదు నువ్వు"

నవ్వాడు ప్రకాష్. ముందు చిన్నగా తర్వాత పెద్దగా. ఆ తర్వాత ఫోన్ పెట్టేసాడు.

అవతల యింకా ఫోన్ పట్టుకునే వున్న సస్యకేం అర్థం కాలేదు.

"ఏమిటీ నవ్వు? ఎందుకూ?" అనుకుంది.

"ఊ, సాయంత్రం వస్తానన్నాడు కదూ, అప్పుడు అడగొచ్చులే" అనుకుంటూ తనూ పెట్టేసింది.

**(ఇంకా ఉంది)**

# విముక్తి

'వెధవ కుక్క ఇంట్లో కొచ్చేస్తోంది ఏయ్!అవతలికి పో

నా యింట్లోకి నే నొస్తుంటే ఇదేమిటి ఇట్లా అంటారు వీళ్ళు

అబ్బ చూడమ్మా ఈ పాడు కుక్క కదల్దు'

నడుమ్మీద ఒళ్ళుటి పడనీ కుయ్యోమంటూ అదే అవతలికి ఛస్తుంది

"వెధవకు ఆ పనే చెయ్యాలి ఉండు దీని పని చెబుతాను ఏయ్! పద, ఇప్పుడు పద!"

అమ్మో చచ్చాను అమ్మాయి చేతిలోని బడితెను చూసి వాకిట్లోకి పరిగెత్తాను కానీ ఇదేమిటి? ఇది నా యిల్లు నా ఆస్తి నా సర్వం నేను ఈ ఇంటి యజమానిని ఆ ముందరింట్లో పూలహారం వేసిన ఫోటో నాది

నా భార్య కామేశ్వరికి ఇప్పుడు మొహాన బొట్టు-లేదు తల దువ్వి పూలు పెట్టుకోదు ఆ కళ్ళెప్పుడు కాటుకతో కళకళలాడుతూ అపర లక్ష్మీదేవిలా వుండేది ఇప్పుడు దైన్య దేవతలా తిరుగుతోంది

మెయిను బజారులో నా ఆహారదాన్యాల సరఫరా కాంట్రాక్టు వ్యాపారం ఇప్పుడు మా పెద్దవాడు చూస్తున్నాడు దర్జాగా నాలాగే నా కారులో వెళ్తొస్తుంటాడు మా సంస్థ హాలులోసైతం నా తైలవర్ణ చిత్రం తగిలించారు మా పెద్దవాడు దానికి రోజూ పూలహారం వేసి బత్తీలు వెలిగిస్తూంటాడు మరి అదే నేనక్కడి కెడితే–మా నౌకర్లు సైతం ప్రొద్దున్నే వెధవ కుక్కొచ్చిందేమిటి అని నన్ను తరిమికొడతారు ఈ సంస్థకంతా యజమానిని నేనేనని ఎంత అరిచి చెప్పుకున్నా ప్రయోజనం శూన్యం కదా? నన్ను ఇంతేసి రాళ్ళతో తరిమి తరిమి కొడతారు ఇంకెలాగ?

పోనీ నా సంతతే కదా మీరు అనుభవించండి నాకు కాస్తంత కబళం వెయ్యండి తిని ఈ పంచనే పడివుంటాను అని ఎంత హీనంగా మొత్తుకొన్నా నన్ను తరిమి కొడుతూనే వున్నారు. మొన్న మా చిన్న వెధవయితే నా మీదికి రాళ్ళ కర్ర విసిరాడు అది నా వెనక కాలికి బలంగా తగిలి నాలుగు గంటలు నొప్పెట్టింది ఆ దెబ్బకు ఐదు రోజులై యింకా కుంటుతూనే వున్నాను

వెధవా నేను మీ నాన్ననురా కొడతా వేమిటి అని ఏడ్చి చెప్పుకొన్నాను అయినా పొగరుగా విసిరాడు వాడు

నా ఇల్లు నా వాళ్ళు నా ఆస్తి నా సర్వస్వం ఇదంతా రోజుల తరబడి దుఃఖిస్తూ చెప్పుకొంటు-న్నాను అయినా పిడికెడన్నం పెట్టలేదు మా వాళ్ళు పాపాత్ములు ఎదురింటి కొట్టంలో వున్న నా శత్రువు రామస్వామి భార్య అలివేలే ఎంతో మేలు నేను కుంటుకుంటూ ఏడుస్తుంటే దయగా పిల్చి వొళ్ళు దువ్వి కాస్తంత కబళం పెట్టి నా ప్రాణం కాపాడింది లేకుంటే చూసి చూసి నానా పెంటలన్నీ తినటం నాకు సరిపోదు ఆకలితో చచ్చయినా పోదును కాక!

నిజంలో రామస్వామిని నా బాకీ కట్టలేదని వీధిలో కీడ్చి జోడుతో కొట్టలేదా నేను? అలివేలును అనరాని దుర్భాషలాడలేదా? అవన్నీ మరచి కాసిని ఎంగిలి మెదుకులైనా విదిలిస్తోంది ఆ పుణ్యాత్మురాలు

★ ★ ★ ★

కాస్తంత కునుకు పడితే అందులోంచి ఎన్నో జ్ఞాపకాలు నాకు! నిజంలో ఎన్ని పాపాలు చేశానో అనిపిస్తుంది నాకు ఒక్కోసారి!! మా గుమాస్తా గురవయ్యను కోపమొచ్చి పనిలోకి రావద్దని తరిమి-కొట్టాను గురవయ్య దీనంగా మొర పెట్టుకుంటూ కాళ్ళు పట్టుకున్నా తన్ని తగలేశాను బోలెడు పిల్లల్ని వెంటేసుకుని అతడి భార్య కన్నీళ్ళు పెట్టు-కుంటూ ఎండలో నిల్చొంది నౌకర్ల చేత తన్నించ-లేదా ఆనాడు వాళ్ళని? గురవయ్య చేసిన తప్పేమిటి? ఈ జీతం చాల్దండి, మరో పదయినా కలిపివ్వండి రాత్రింబగళ్ళు మీకు చేసే చాకిరీకి రెండు పూట్ల కూడయినా తిననివ్వండి" అని గట్టిగా అడిగాడు అంతే తరిమికొట్టాను ఈ దేశమే వొదిలి వెళ్ళిపోయారు వాళ్ళు ఓ పది రూపాయలు వేసిచ్చి వుంటే ఎంత బావుండేది అమ్మో! నౌకర్లను ఇలా మరిపితే యావయినా వుందా! మరి అజ్ఞాత భక్తుడిగా ఏడుకొండలవాడి హుండీలో లక్షలకు లక్షలు అర్పించుకున్నానే మరి వారు దేశం వొదిలి వెళ్ళిపోయారూ అంటే వారికి భగవంతుడలా రాసి పెట్టాడు బాగుందే! అజ్ఞాత భక్తుడిని నేనూ అంటే అది వేరే విషయం నేను చేసిన పాపాలకు ప్రతి-హారంగా అలా అర్పించుకున్నాను ఆ భగవంతుడి దయవల్లే కదా ప్రతి సంవత్సరం ఆహారధాన్యాల కాంట్రాక్టులు నాకే వొచ్చేవి అంటే అదికూడా వేరే విషయం మంత్రులకూ సెక్రెట్రీలకూ పోసిన లంచాలతో పోలిస్తే భగవంతుడికిచ్చింది తృణ-ప్రాయమే! ఎటొచ్చీ కంట్రాక్టులు నాకే వొచ్చేలా చేసుకునేసరికి భగవంతుడే దిగివచ్చినంత పనయ్యేది

కంప్లీటుగా నాలుగు జిల్లాల ఆహారధాన్యాలు నా కాంట్రాక్టు ద్వారానే సప్లయి అవుతూండేవి బియ్యం, గోధుమలు, పప్పుధాన్యాలు, చక్కెర సర్వే సమస్తం నా కాంట్రాక్టే!

గోడవున్లలో – వాటిల్లోకి మట్టిపెళ్ళలు, ఇసక, రాళ్ళు లారీలతో తోలించి కల్తీ చేస్తుండేవాడ్ని చక్కెరలో అదేదో సుద్దపొడిని సపరేట్ లారీ తెస్తుండేది చౌక దుకాణాల ముందు ఎండలో క్యూలో నిల్చుని కొన్న ఎన్ని వేలమంది తెలుగు ఆడపడచులు వాటిని తిట్టుకుంటూ చెరిగి పోసు-కునేవారో! ఆ తిట్లన్నీ భగవంతుడికి – నా పెట్టెకి భాగ్యరాసులొచ్చి పడేవి ఎంతమంది పేద ప్రజల కష్టార్జితమో ఈ భాగ్యరాసులన్నీ అందుకు భాగస్వామని నేనే కాదు మంత్రులు సెక్రెట్రీలు సైతం వారికీ ఇలాగే జన్మాంతరం శిక్షలు పడి-వుంటాయా?ఏమో నాకెలా తెలుసు? అయినా వాళ్ళు సైతం మరోరూపంలో నాకు కన్పించక పోతారా?

★ ★ ★ ★

ఆకలవుతుంటే డొక్క లెగసి పడుతోంటే లేచి టక టక టక చెవులు విదిలించుకొన్నానో లేదో ఆ పూర్వ స్మృతులన్నీ పారిపోయాయి ఆకలి ఆకలి మండిపోతోంది నాలుగు పగళ్ళు దాటిపోతున్నాయి రామస్వామి, అలివేలు ఎటు వెళ్ళారో కూడు వేసే దిక్కు లేదు రెండు మధ్యాన్నాలు పైడు కాలువ నీళ్ళు తాగి ఆకలిని అణచుకొన్నాను అలాగే పడుకొన్నాను నా సొంత యింటి ముందు నాలుక వేలాడేసి రొజుకుంటూ ఎన్ని గంటలు ఆశగా నిల్చొన్నా ఒక్కరూ నా గతి చూడరు కదా! ఓ రాత్రప్పుడు ఆకలో అంటూ హృదయ విదారకంగా ఏడ్చేశాను కూడా ఎవడో అవతలింటివాడు కోపంతో పరిగెత్తుకొంటూ వచ్చి పెద్ద బండరాయి విసిరాడు నా మీదికి దైవమా అంటూ ప్రాణాలుగ్గబట్టి పరిగెత్తాను లేకుంటే ప్రాణాలే పోయుండేవి నా యింటివాళ్ళు నోరెత్తలేదు కదా నవ్వి వూర్కొన్నారు

మరిప్పుడెలా? కడుపు మాడిపోతోందే

ఇజ్జా ఇజ్జా ఇజ్జా "హమ్మ బాబూ! ఎవరో పుణ్యాత్ములు కబళం వేస్తున్నారు వెంటనే చెవులు రిక్కించి పిక్కలు బిగబట్టి ఆ శబ్దం వస్తున్న వీధి చివరికి లేని సత్తువ తెచ్చుకొంటూ పరుగుపెట్టాను అతనెవరో పాపం అరిటాకు నిండా పెరుగన్నం విసిరాడు కానీ నాకన్నా ముందే సింహాల్లాంటి బలమైన కుక్కలు జొరబడి ఒకటి తినడం మరొకటి వోర్చులేక గర్రు గర్రుమంటూ పోటీల మీద దాన్ని ఆరగించేస్తున్నాయి ఏమయితే అదవుతుందని నేనూ వాటిలోకి జొరబడ్డాను అంతే ఆ కుక్కలు నాలుగూ భయంకరంగా పళ్ళు బైట పెట్టి అరుస్తూ నన్ను కుమ్మేస్తూ అవతలికి నెట్టేశాయి ఒకటైతే నా మెడ మీద కొరికేసింది మరొహటి పంజాలతో నా మొహాన్ని కొట్టి బరికేసింది నేను తిరగబడి పళ్ళు బైట పెట్టి అరిచాను నోరెత్తావంటే చంపి కండలు తీస్తామంటూ అవి నాలుగూ మీదికి ఒకేసారి లంఘించాయి

భగవంతుడా ఆ కూడూ వద్దు పాడూ వద్దు ప్రాణాలు దక్కించుకుంటే అంతేచాలు ననుకొంటూ తోక ముడిచి వెనక్కి వెనక్కి వొదిగి నా ఓటమిని తెల్పుకుంటూ పారిపోయి కొట్టం ముందుకొచ్చి పడుకున్నాను మెడ మీద నుండి కారుతున్న నా నెత్తుటిని నేనే నాక్కుంటున్నాను మెడ మీద, కంటి మీది గాయాలు బాగా నొప్పెడుతున్నాయి అలాగే కునుకులోకి జారిపోయాను

"అయ్యో! దీన్ని బాగా కొరికేశాయి కదయ్యా ఏవో" మగతలోంచి ఏదో పరిచయ స్త్రీ కంఠం పలుకుతోంది మాటల్ని

"మనం నాలుగు రోజులు వూళ్లో లేము కదా దీనికింత కూడు పెట్టే దిక్కులేక దెబ్బలు తగిలించుకుని ఎలా పడిపోయిందో చూడు పాపం" రామస్వామి గొంతు అది

ఎంతయినా కుక్క జాతికి ఎంత విశ్వాసం చూడయ్యా తిన్నా తినకున్నా మనింటి ముందే కాపుదారి కాస్తోంది సూడు" అలివేలు నా వొళ్ళు దువ్వింది నేను బాధగా మూలిగాను ముక్కులు వెళ్లబెట్టి ఏడ్చాను నా మెడమీది వుండు కడిగి ఏదో నూనె రాచింది రెండు గంటలయ్యాక నాకింత అన్నం బిడ్డకు పెట్టినట్టు దగ్గరుండి తినిపించింది అలివేలు

తల్లీ నీ ఋణమెలా తీర్చుకోను నిన్ను ఒకప్పుడు నానా దుర్భాషలాడానే నీ భర్తను జోడుతో కొట్టానే అని దుఃఖిస్తూ పశ్చాత్తాప పడ్డాను

రామస్వామి వనిదతాడు అలివేలు కూలికెడుతుంది ఆమె మధ్యాన్నానికెప్పుడో యింటికొచ్చి యింత కూడు పడేస్తుంది నాకు అంతవరకూ కడుపు కాలుతూంటుంది నాకు అందుకని ఆమె వచ్చేలోగా తిండేమయినా దొరుకుతుందేమోనని




భూమి మీది అణువణువునీ వాసన చూస్తూ తిరగటం రివాజు నాకు

రోజు సైడు కాలువల వెంట నడుస్తూ ఏదో తిండిని పసికట్టాను కానీ అవేవో రెండు ప్రాణులు సైతం వాటిని సమీపిస్తున్నాయి వాటి కళ్ళు వాటి రెండు కళ్ళు కూడా నాకు పరిచయమే అవికూడా నా వైపు "అరె నువ్వా" అన్నట్టు చూసినా నిర్లక్ష్యంగా ఎంగిలాకును లాక్కుంటున్నాయి నాకు వొళ్ళు మండి గయ్యిమని వాటిని ఎదుర్కొన్నాను అవి భయపడుతూనే వెనక్కి వొదిగి నా వైపు చూశాయి అందులో పెద్దది

"నేను మంత్రిని నేను మంత్రిని" అంది కాస్త చిన్నది

"నేను సెక్రెట్రీని నేను సెక్రెట్రీని " అంది వాటి మొహాలు అప్పుడు జ్ఞాపకమొచ్చాయి నాకు ఓహో మీరు ఒకప్పుడు నావద్ద లక్షలకు లక్షలు లంచాలు భోంచేసిన వాళ్లేనా మీకు పంది జన్మలొచ్చాయన్న మాట అన్నాను అవి అవునన్నట్టు తలలూపుతూ రాచరికంగానే అవతలికి పరిగెత్తాయి

ఆవేళ నా ఏడవ వర్ధంతట పెళ్లి పందిరంత షామియానా వేశారు మంత్రాలు బ్రాహ్మల ఆరగింపులు అయ్యాక పేదలకు షామియానా నిండా

# ఇవేమన పద్యాలు




**భూమి తనదటన్న భువనేశ్వరుడు నవ్వు**
**దానహీను జూచి ధనము నవ్వు**
**ప్రాణభీతు జూచి పరగయముడు నవ్వు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

అన్నదానం చేస్తున్నారు అన్నాలు ఆరగిస్తున్న ఆ మొహాల్లో ఎంతో తృప్తి ఆనందం ఓ మూల నిల్చొని అన్నీ గమనిస్తున్నాను పేదలకు సైతం లోపం చెయ్యకుండా పిండివంటలు, లడ్డూలు, పెరుగన్నం వడ్డిస్తున్నారు నాకు నోరూరింది అబ్బ! నేనూ అవన్నీ తినేస్తే ఎంత బావుణ్ణు అనిపించింది ఆశగా లోనికి వెళ్లాను

నన్ను దూరం నుంచి చూసిన నా పెద్దకొడుకు విస విసా మండిపడుతూ వచ్చి ఏయ్! రంగడూ . ఆ వెధవ కుక్కని అవతలికి తరుము" అని కేకలేశాడు

"అది మా కుక్కేలేయ్యా ఏయ్ ఇజ్జూ ఇలా రావే మూల బంతిలోంచి అలివేలు నోటి నిండా పెరుగన్నంతో నవ్వేస్తూ అంది అక్కడికి పరిగెత్తాను నా వొళ్ళు దువ్వి పక్కన కూర్చోబెట్టు-కుంది అలివేలు ఎంత దయో నా మీద వొళ్లో ఏవో పిండివంటలు, లడ్డూ పెరుగన్నం దాచుకొచ్చి పాకలో నాకు తినిపించింది అబ్బ ఎంతకాలం తర్వాత తినగలిగాను యింత మంచి తిండి అనిపించింది నా జన్మకంతా ఆ వొక్కసారే అలాంటి తిండి తినటం

## విముక్తి

వూళ్లో కరువొచ్చింది అన్నారు ఎండలు మండిపోతున్నాయి ఎక్కడా నీళ్ల చుక్క లేదు షావుకార్లు మాత్రం ముప్పూటలా బాగా భోంచేస్తున్నారు పారేయగలిగినంత పారేస్తున్నారు వాటిని బలమైన కుక్కలే ఆరగించేస్తున్నాయి నా దాకా రావడమే లేదు అటు వెళ్లానా నన్ను కౄరంగా అరిచేస్తూ దూరంగా తరిమేస్తాయవి వూళ్లోని మనుషులు కూలి దొరకడం లేదని మూటముల్లెలతో దూరాలకు వెళ్లిపోతున్నారు రామస్వామి అలివేలు కూడా పెట్టెలుపెటారాలతో బయల్దేరారు

వెడుతూ వెడుతూ రాస్వామి భార్య నన్ను వొళ్ళు దువ్వి నన్ను తనతో తీసుకెడతానంది అందుకతడు గయ్యిన అరిచాడు "మనకే గతి లేక దేశం వొదిలి వెళ్లిపోతున్నాం దీన్నెక్కడికి తీసికెళ్లగలం బస్సుల్లో చార్జీలడగుతారు

అలివేలు నా మొహం చుట్టూ చేతులు తిప్పి ముద్దెట్టుకుని ఉసూరుమంటూ మండే ఎండలో ప్రయాణమైంది వాళ్లను కొంత దూరం అనుసరించాను వాళ్ళు ఆదరా బాదరా కదులుతున్న బస్సు ఎక్కేసారు నేను దిగులుగా చూస్తూ వుర్కొండిపోయాను

నేను సైతం ఎక్కడైనా దేశం వదిలి వెళితే ఎంత బావుండును కానీ నా యిల్లు నా వాళ్ళు నా ఆస్తి నా కాంట్రాక్టు వ్యాపారం ఎలా వదల్ను? అనిపిస్తుంది అయితే ఏం ప్రయోజనం? నన్ను తరిమి తరిమి అవతలికి తోలేస్తున్నారే ఈ నా అన్నవాళ్లే ఈ ప్రపంచంలో ఎవరి కెవరు? నేను మీ యజమానినని ఎంత మొత్తుకున్నా – యిలా తయారయ్యాను ఈ జన్మెత్తాను చూడండి అని ఎంత విలపించి చెప్పు-కున్నా ఈ నా అన్నవాళ్లే నాలుగు మెతుకులు విదిలించరు కదా? ఇక వీళ్లకీ నాకు ఏమిటి సంబంధం!

నిజమే నా జన్మ కాలంలో నేను మాత్రం ఎవరికి నాలుగు మెతుకులు విదిలించాను కాబట్టి నా సొంత మనుషులు తింటుంటేనే ఓర్వలేకపోయానే! పైసా దానం ప్రాణమున్న వాళ్లకి ఏనాడు చెయ్య-లేదు కదా! ఎంతమందిని చావగొట్టాను ఎంత-మందిని కూటికి దూరం చేసి మాడ్చి చంపేశాను అందుకే నాకీ జన్మాంతర శిక్ష?

*　　*　　*

వొళ్లంతా గజ్జి పుట్టి బొచ్చంతా వూడిపోయింది గజ్జి దురదని కొరుక్కొని కొరుక్కొని వొళ్లంతా పచ్చి గాయాలు బాగా చిక్కి బక్కైముకలు బైట-పడ్డాయి చూచిన వాళ్లంతా ఛీ ఛీ. అని అసహ్యించుకొంటున్నారు కరువు కాల్చేస్తూంది దేశాన్ని చుక్క నీళ్ళు పుట్టడం లేదెక్కడా పిడికెడు మెతుకులు కళ్ల జూసి ఎన్నాళ్లయింది? ధర్మ దేవతలాంటి అలివేలు ఎక్కడికెళ్లిందో ఆ తల్లి

రెండు రాత్రిళ్ళు రెండు పగళ్ళుగా కాళ్ళు కదలటంలేదు బొత్తిగా నీరసమొచ్చి పడిపోయాను ఆకలి చచ్చే పోయింది నాలో ఒక్కోసారి వూపిరి సైతం అందక రొమ్ములు ఎగిసి పడుతున్నాయి

ఈ దేహాన్ని వొదిలిపెడితే ఎంత బావుండును హాయిగా గాలిలో తేలుతు పూర్వలోకాల కెళ్లిపోవచ్చును అక్కడ ఆకలిదప్పులు ఎండవానలు కరువు కాటకాలుండవు కసిరి కొట్టే మనుషులుండరు ప్రతి మొహంలోనూ దైవత్వం, ప్రేమానురాగాలు, పలకరింపులు

గతంలో ఇలాగే జబ్బునపడి పెళ్లాం పిల్లలతో ఛీ అనిపించుకొని ఆ దేహాన్ని వొదిలాను ఆ లోకాలకే వెళ్లాను కానీ అక్కడి వారి ప్రేమానురాగాలు, దైవత్వాలకన్నా నా యిల్లు నా వ్యాపారం నా కాంట్రాక్టులే కావాలని కొట్టుకులాడాను ఇందుకేనా? నా వాళ్ల చేత తరిమి కొట్టించు-కోటానికేనా?

అమ్మా అమ్మా అయాసం ముంచేస్తూంది అయినా ఈ దేహాన్ని ప్రాణం వొదలనంటుందేమిటి? ఎప్పుడు నాకు విముక్తి ఎప్పుడు నాకు విముక్తి □




(గత సంచిక తరువాయి)

దార్లో కూడా యిద్దరూ యేమీ మాట్లాడుకోలేదు ప్రభాత తన కాలేజ వద్ద దిగి కొంచెం దూరం వెళ్ళాక హారన్ వేసి పిలిచాడు అతని పిలుపుతో ఆశ చిగురించగా వెనక్కి వచ్చింది

సాయంత్రం నా కోసం వెయిట్ చేయకు

వెలుగుతున్న వెయ్యి దీపాలు వొక్కసారిగా ఆరిపోయిన చందమైన ప్రభాత ముఖం చూస్తే జాలి కలిగింది అతనికి అతని హృదయం ఆర్ద్రమైంది కాని ఆ చాయలు ముఖం మీద పడనీయకుండా నాకు బాగా ఆలస్యం కావచ్చును అన్నాడు

కంట చిందిన నీరు అతని కంట పడకుండా వెనక్కి తిరిగింది

ఆ సాయంత్రం బస్స్టాపుకు వస్తున్న ఆమెను చూచి మీ మామయ్య వచ్చారుగా అన్నారు స్నేహితులు

మామయ్యకు కొన్ని రోజులు టైమింగ్సు కుదరవన్నారు అంది

ఈ అందమైన అబద్ధమే నిజమైతే బాగుండును అనుకుంది

ప్రతిరోజూ మౌనంగానే కలిసి వెళ్తున్నారు అతని ముభావంలో మార్పేమీ లేదు ఇలా కొన్ని రోజులు గడిచాక అడిగింది

ఎందుకు మామయ్య అలా వుంటున్నావు?

'ఎలా వుంటున్నాను?

ఎలా వుంటున్నావో చెప్పలేను గానీ మునుపటిలా లేవు'

వయసు మిరుతోంది ముసలితనం పరుగులు తీస్తూ వచ్చి పైన బడ్తోంది

ఈ పదిరోజుల్లోనేనా' అని ప్రభాత ప్రశ్నించలేకపోయింది

నువ్వెళ్ళాక నేనొక కవిత వ్రాశాను మామయ్యా

వెరీగుడ్

**జరిగిన కథ-15 :** అక్క కూతురు రాజ్యలక్ష్మి చనిపోవడంతో ఆమె కూతురు ప్రభాతను తన ఇంట్లోనే ఉంచుకొంటుంది ప్రభావతమ్మ రామస్వామి, ప్రభావతమ్మల పెద్ద కొడుకు కృష్ణచైతన్య అతనికి ప్రభాతంటే అమితమైన అభిమానం కృష్ణచైతన్య చిన్ననాటి స్నేహితుడు శరత్ శరత్, రాధలు ప్రేమించుకుంటారు అజంతా, ఎల్లోరా వెళ్ళినప్పుడు అక్కడ కృష్ణచైతన్య రమేష్, ప్రభాతలకు డా విద్యను పరిచయం చేసాడు రమేష్, డా విద్యను తను ప్రేమిస్తున్నట్లు కృష్ణచైతన్యకు ఉత్తరం రాసాడు రాధ పెళ్ళి శరత్తో జరిగిపోయింది డా విద్య తాను యుక్త వయస్కురాలు కాలేదని, మాతృత్వం పొందలేనని కృష్ణచైతన్యకు ఉత్తరం రాసింది కృష్ణచైతన్య మిత్రుడు రవి వచ్చాడు రవికి బిజినెస్ వ్యవహారాల్లో సహాయ నిమిత్తం మద్రాసువెళ్ళి వచ్చిన కృష్ణచైతన్య ముభావంగా ఉండటం ఇంటిల్లిపాదిని ఆశ్చర్య పరిచింది

నీకు చూపించాలి.

ష్యూర్

ఎప్పుడు చూపించను?

నీ యిష్టం

ఆమె ఎంత ప్రయాసపడినా సంభాషణ అంతకన్నా వుత్సాహభరితంగా వుండటం లేదు ఎక్కడో వొకచోట, యెలాగోలాగ అతడు మాటల్ని త్రుంచేస్తున్నాడు

ప్రభాత ప్రతిదినం యేమో చెప్పాలని ఆరాట పడటం అతడు గమనించీ యేమీ పట్టనట్లు నిర్దయగా ప్రవర్తిస్తున్నాడు ఇంట్లోగూడా అతని తరహా అలాగే వుంటోంది పూర్వంలా గంటల తరబడి తల్లిదండ్రులతో కబుర్లు చెప్పటం లేదు ఎప్పుడైనా కూర్చున్నా కుటుంబ విషయాలను చర్చనీయాంశంగా తీసికోకపోవడం ప్రభావతమ్మను కలవర పెడ్తోంది యూనివర్సిటి నుండీ సరాసరి యింటికి రావడం లేదు ఒకవేళ వచ్చిన వెంటనే వెళ్ళిపోతున్నాడు అతనికి బయట కార్యక్రమాలు అధికమయ్యాయి అనేక రకాల పనులు కల్పించుకుని నిత్యం బిజీగా వుంటున్నాడు

ఒకరోజు –

ప్రభావతమ్మ మనుమరాల్ని ప్రశ్నించింది నీకేమైనా చెప్పాడామ్మా వాడు?

ఏ విషయం అమ్మమ్మా అమాయకంగా ప్రశ్నించింది

వాడీమధ్య అదోరకంగా వుంటున్నాడు నీకేమైనా కారణం తెలుసా? అంటున్న అమ్మమ్మ పట్ల జాలి వేసింది

అవునమ్మమ్మా, మామయ్య యెందుకలా మారిపోయాడు?

నా ఖర్మ తల్లీ నెత్తి బాదుకుంది

ఆ రాత్రి కృష్ణచైతన్య స్టడీరూంలోకి ప్రవేశిస్తున్న ప్రభాతను యేమిటి?' అని పొడిగా ప్రశ్నించాడు

అతని కంఠంలోని మార్పు, చూపులోని నిర్లిప్తత ఆమెకు మామయ్య సన్నిధిలో కాక నూతన వ్యక్తి సామీపంలో వున్న అనుభూతిని కలిగించాయి

రెండుక్షణాలు ఆమె సందేహిస్తుండగా గడచిపోయాయి

భయంకరమైన ఆ మౌనాన్ని భరించలేక చెప్పు అన్నాడు

మామయ్యా'

నేను నేను వ్రాసిన

ఆమె పూర్తి చెయ్యకముందే చెయ్యిచాచి ఆమె చేతిలోని నోటుబుక్ అందుకున్నాడు

ఒక పిట్ట యెగురుతోంది
ఒక మేఘం కదులుతోంది
గాలి వీస్తోంది
నా హృదయం స్పందిస్తోంది
ఆ పిట్ట యెగిరి
నినుచేరి నా వేదన చెప్పదా
ఆ మేఘం కదిలి
నిను కనుగొని నా బాధ తెలియ చెయ్యదా
గాలి వీచి సాగి సాగి నినుతాకి
నా విరహం విడమరచదా
సదా నీ నీడగా మసలే నా హృదయ
మమతలను ప్రకటించి
నిను నా దరికి చేర్చదా'

ఆమె వ్రాసిన కవిత్వం చదువుతున్నంత సేపూ అతని కన్నుల్లో మెరిసిన మెరుపులు ఆమె హృదయంలో నవోత్సాహాన్ని సృష్టించాయి కానీ ఆ వుత్సాహం వయసు కొన్ని క్షణాలు మాత్రమే

పుస్తకం మూసేస్తూ తన మామూలు మూడ్‌లోకి వచ్చిన కృష్ణచైతన్య, వ్రాయ గలిగిన వుత్తేజం చాలా గొప్పది ప్రబా క్రమంగా ఆసక్తి వృద్ధి చెందుతుంది

అయితే యింత చిన్న వయస్సులో నువ్వు విరహ గీతాల మీద కాక మరో సబ్జెక్టు మీద దృష్టి నిలిపితే మంచిది

ఆ సబ్జెక్టు యేమిటో అతడు చెప్పలేదు

ప్రబాత సిగ్గుతో వచ్చిపోయింది

ఆ కవిత్వం లోని వుద్దేశం అతని కర్థం కాకనే మాట్లాడాడా? ఇంత కాలానికి మనసులోని మాటను బయట పెడితే మొఖాన పేడనీళ్ళు కొట్టినట్లుగా జవాబిచ్చాడు మామయ్య పూర్తిగా మారిపోయాడు అతని చూపులో లాలన లేదు. మాటలో మార్దవం నశించింది గుండెల్లో ప్రేమ యింకి పోయింది ఎందుకిలా జరుగుతోంది ఇతడు తన బ్రతుకును యేమి చేయనున్నాడు!

తల వంచుకుని నిష్క్రమిస్తున్న ప్రబాతను చూచి బరువుగా నిట్టూర్చాడు

* * * * *

కాలం యెవ్వరికోసం ఆగదు సాగుతూనే వుంటుంది కాల గర్భంలో లభించిన ఆనందాలను, కష్టాలను, విషాదాన్ని అశాంతిని, ప్రశాంతతను యేరుకుని కూర్చుకునేదే జీవితం

రమేష్ వివాహానికి వెళ్ళొచ్చాక కృష్ణచైతన్యలో కొద్ది మార్పు వచ్చింది పెండ్లి కుమారునిగా ముస్తాబైన రమేష్‌ను చూస్తూ నిన్నిలా చూడగలగటం చాలా సంతోషంగా వుంది అన్నాడు

నేనూ ఆ సందర్భం కోసమే చూస్తున్నాను

సారీరా రమేష్ నీకా అవకాశం లేదు

అరేయ్ కృష్ణా, యేమిట్రా నువ్వనేది?

ఆ విషయం వదిలెయ్యి రమేష్ తల్లి కాలేని స్త్రీని నీవు పరిణయ మాడగలవా?

నెవ్వర్

ఒక వేళ నిన్నో స్త్రీ ముందుగా తెలిసే మోసం చేస్తే?

నేనామెకు శాపంలా మారిపోతాను

దట్సాల్ నేను పొరపాటు చేయలేదు

'నీకేమైనా మతిగానీ పోయిందట్రా? నువ్వేం మాట్లాడుతున్నావో నీకు అర్థం అవుతోందా

పెద్దగా నవ్వాడు



# మౌనవిపంచి

రమేష్ మతి పోయినట్లు నిల్చున్నాడు

ఇప్పుడు నిన్ను చూస్తే యెవ్వరైనా మతిపోయిందంటారు

"కృష్ణా బాధగా అరిచాడు

రికవర్ మై ఫ్రెండ్ రికవర్ నేనిప్పుడే వస్తాను నువ్విలా మతిపోగొట్టుకుంటే చూచే వాళ్ళు అపార్థం చేసికోగలరు

అతడెళ్ళిన దిశ చేష్టలుడిగి చూస్తూ నిల్చున్నాడు రమేష్ అతడికి విడమర్చి చెప్పక పోయినా కృష్ణచైతన్యకు రమేష్ అభిప్రాయాలు తెల్సుకున్నాక మనసులో బరువంతా దింపినట్లయింది

వాడికి చెప్పక పోవడం ద్వారా నేనేమీ పొరపాటు చేయలేదు' అనుకుని సంతుష్టుడైనాడు

క్రమంగా అతడు పూర్వ స్థితికి వచ్చాడు తల్లితో నవ్వుతూ మాట్లాడుతున్నాడు ఆమె కష్ట సుఖాలు ప్రశ్నిస్తున్నాడు తండ్రితో తమ వ్యాపారం, ఆస్తుల విషయాలు, కుటుంబ వ్యవహారాలూ చర్చిస్తున్నాడు ప్రభాత యోగ క్షేమాలు విచారిస్తున్నాడు

కానీ, అతని మాటలు ఆమె పట్ల మమతల్ని వెల్లడించటంలేదు అతని చూపులు ఆమె హృదయాన్ని తాకి పరవశం కలిగించటం లేదు ఒక శ్రేయోభిలాషిలా ప్రశ్నిస్తున్నాడు, పరిశీలిస్తున్నాడు

నీ కొడుకు వ్యవహారం యేమిటో ! అన్నారు రామస్వామి గారు

'మీరెప్పుడూ వాడ్ని ఆడి పోసుకుంటారు వాడు కాని పనేం చేశాడు? మన మీద గౌరవంతో నే వాడేమీ అనలేక బాధ పడుతున్నాడు, అంది బాధగా

ఆ సమయంలో కొడుకును యెవ్వరేమన్నా అతని బాధకు కారణం వాళ్ళేనని గట్టిగా నమ్మి యుద్ధం చేసే రీతిలో వుంటోందామె యీ మధ్యనుండే

ప్రభావతీ ఊరకే అలా ఆవేశపడకు నీకు ఆవేశం నప్పదు ఇక పోతే అసలు విషయానికి వద్దాం నాకు మాత్రం వాడి సుఖ, శాంతులకన్నా కావల్సిందేముంది? నేను వాడ్ని కష్టపెడ్తానా? ప్రారంభంలో అనుమానం కలిగి నిన్ను హెచ్చరించాను వారి మనసుల్లో నాటుకున్న బీజం మొలకెత్తరాదని నా యిష్టా యిష్టాలతో నిమిత్తం లేదు కాబట్టి అది మొలచి, పెద్దదై శాఖోపశాఖలుగా విస్తరించాక నేనేం చెప్తాను

వాడిప్పుడు అదోలా వుంటున్నాడండీ నాకేమిటో భయంగా వుంది

భోరున యేడ్చిందామె

ఎన్నాళ్ళ నుండో పేరుకపోతున్న దుఃఖం ఆమెది

ఎవ్వరితో చెప్పుకోకుండా గుండెల్లో దాచుకుని క్రుళ్ళిపోతోంది

ఇంకా దాచుకోను సాధ్యం కాలేదు

రామస్వామి గారికి ఆమెను వోదార్చటం దుస్సాధ్యమైంది

ప్రభా అంటూ నోరారా పిలిచారు దగ్గరకు తీసికుని కన్నీరు తుడిచి వోదార్చారు

ప్రభా నీ కొడుక్కి నీ పెద్ద కొడుక్కి బాధ లేకుండా నేను చూచుకుంటానోయ్ అన్నారు చివరిగా

ఆమెకు మరోమార్గం లేక ఆయన్ని విశ్వసించింది యెందుకంటే-

ఆ విశ్వాసం ఆమెకెంతో వూరట కలిగిస్తోంది

* * * *

ఆదివారం కాబట్టి రామస్వామి గారు పది గంటలైనా పేపర్లో నుంచి ముఖం బైటకు తీయలేదు కృష్ణచైతన్య బయటకు పోను సిద్ధంగా వున్నాడు

హాల్లో ఫోను-రింగవుతోంది

ఎవరో వొకరు తీస్తారులే అని అందరూ అశ్రద్ధ చేశారు

చివరకు ప్రభాత రిసీవ్ చేసికుంది

"తాతయ్యా మీకే ఫోన్

"ఎవరో కనుక్కో" దృష్టి మరల్చకుండానే అడిగాడు

విశ్వనాథ్‌గారట, బెంగుళూరు నుండి వచ్చారుట ఫోన్ ప్రక్కన పెట్టింది

బెంగుళూరులో విశ్వనాధ్‌గారు యెవర్రా అన్నారు పేపరు ప్రక్కన పెడ్తూ

తెలియదు నాన్నా

ఫోన్లో మాట్లాడి క్రాడిల్ మీద పెట్టేస్తూ నంపూ పంపినట్లున్నాడు ఆయన కొద్ది సేపట్లో వస్తారుట

బయటకు వెళ్ళడానికి లేచి నిలబడిన కృష్ణచైతన్య యీ మాట వింటూనే ఆగిపోయాడు మిష్టర్ గణేశన్‌కు ఫోను చేసి తానిప్పుడు రాలేక పోతున్నానని తెలియజేసి క్షమార్పణ వేడుకున్నాడు

అమ్మా విశ్వనాథ్ గారికి లంచ్ యేర్పాటు చెయ్యి అన్నాడు

అసలెవరో యేమిటో తెలియ కుండానే యెలారా కృష్ణా

నీకా బాధేమీ లేదు ఆయన యిక్కడ యీ రోజు భోజనం చేస్తారమ్మా నీ పని కానిచ్చుకో

ఆదివారం గూడా స్వాతంత్రం లేదని విసుక్కుంటూ స్నానాదికాలు ముగించి రాబోయె ఆగంతకుని కోసం నిరీక్షించ సాగారు రామస్వామి గారు

బయట టాక్సీ ఆగిన ధ్వని వింటూనే ప్రభాతా కాఫీలు సర్వు చెయ్యి అని హెచ్చరించి వచ్చిన వ్యక్తికి యెదురెళ్ళి సాదరంగా ఆహ్వానించి కూర్చుండ బెట్టి లోపలకు వచ్చి తండ్రికి తెలియ చేశాడు కృష్ణచైతన్య

రామస్వామి గార్ని చూచి లేచి నమస్కరించారు విశ్వనాధ్ గారు తనను తాను పరిచయం చేసుకుని విజిటింగ్ కార్డు టీపాయ్‌మీద వుంచారు

'మీట్ మై ఎల్డర్ సన్ కృష్ణచైతన్య

విశ్వనాధ్ కృష్ణ చైతన్యతో కరచాలనం చేస్తూ ఐనో ఐనో అన్నారు

విశ్వనాధ్ గారికి తెలుగు బాగా రానందున సంభాషణ ఇంగ్లీషులోనే సాగింది రామస్వామి గారు తన చిన్నకొడుకు యోగ క్షేమాలు కనుక్కున్నారు కృష్ణచైతన్య కర్ణాటక రాజకీయాలు ప్రస్తావించాడు అలా లోకాభిరామాయణం సాగాక విశ్వనాధ్ గారు వచ్చిన పనిలోకి సూటిగా దిగారు

'నాకు వొక్కరే సంతానం నాకూతురు లావణ్య బి ఎస్‌సి హోం సైన్సు పూరిత చేసి కాలక్షేపం కోసం కాన్వెంటులో పని చేస్తోంది నందకిషోర్‌తో ఆమెకు చాలా కాలం నుండీ పరిచయం వున్నట్లు మాకు యీ మధ్యనే తెలిసింది అతడితో పరిచయం కలిగాక అతడ్ని నేను కూడా అభిమానించ సాగాను చాలా కాలంగా నాభార్య కుమార్తె పెండ్లి విషయమై పోరు పెడ్తోంది ఒక ఆడపిల్ల తండ్రిగా, బిడ్డ క్షేమాన్ని, సంతోషాన్ని కాంక్షించే తండ్రిగా నేనీ ప్రయాణం చేశాను

రామస్వామి గారు తెల్లబోయారు ఆయనకీ విషయం క్రొత్తగా వుండటం వలన బదులివ్వ లేక పోయారు

నాకు వొక్కటే కూతురు బెంగుళూరులో బంగ్లా వుంది మైసూర్ సమీపంలో రియల్ ఎస్టేట్

ఆయన మాటల్ని త్రుంచి వేస్తూ 'నేను డబ్బు మనిషిని కాను మీరు చెప్తున్న విషయం క్రొత్తగా వుంది అన్నారు రామస్వామి గారు

"అఫ్‌కోర్సు మొదట్లో నాకూ అలానేవుండి క్రమంగా జీర్ణించుకుపోయింది మనకు పిల్లలుగా అగుపించినా వారు పెద్దవారయ్యారు వారి మాటను మన్నించాల్సిన సమయం ఆసన్నమైంది

"మీకు సమయం పట్టినట్లే నాకూ కొంత వ్యవధి కావాలి

అంతటితో ఆ విషయం చర్చించటం ఆపుచేశారు

విశ్వనాధ్‌గారు వద్దంటున్నా లంచ్ సర్వ్ చేయబడింది

వెళ్ళిపోబోతున్న రామస్వామిగారి దెశ ప్రశ్నార్థకంగా చూశారు ఆయన

"మీకు సాధ్యమైనంత త్వరగా వ్రాస్తాను నా పెద్ద కుమారునికింకా పెళ్ళి కాలేదన్న విషయాన్ని మీరు గుర్తుంచుకోవాలి "

థాంక్యూ... థాంక్యూ వెరిమచ్ చెప్పి వెళ్ళిపోయారాయన

రామస్వామిగారు భార్యను పిలిచి ఆయన వచ్చిన పని తెలియజేశారు

కులం యేదైతేనేమమ్మా వాడు కోరుకున్న పిల్ల

రోజంతా లక్ష్మి ఇంట్లో
ఒక్కర్తే వున్నా ఒంటరితనం
అనుభవించదు—కారణం నిప్పో

# "నిప్పో మీ నమ్మకాన్ని ఎన్నడూ వమ్ము చేయదు"

మా ఇంట్లో అందరూ పనికి, బడికి వెళ్ళినతర్వాత ప్రపంచానికి నాకు మధ్య తలుపులు వేసినట్లే వుంటుంది.

అప్పుడే నిప్పో స్పెషల్ నాకు నిజంగా తోడుగా వుంటుంది. నిప్పో నా ట్రాన్సిస్టర్‌లో వుండడంతో నాకు నచ్చిన రేడియో కార్యక్రమాలు లభిస్తాయి.

నిప్పో నమ్మకమైన శక్తి శబ్దాన్ని స్పష్టంగానూ, శ్రావ్యంగానూ **వినిపిస్తుంది.** అందుకే ఎవరో నాకు తోడుగా వున్నారనే అనుభూతి కలుగుతుంది. నా టార్చ్‌కీ నిప్పో స్పెషల్‌నే వుపయోగిస్తాను — ధర చౌక కూడా!




నిప్పో బ్యాటరీ మీ నమ్మకాన్ని ఎన్నడూ వమ్ముచేయదు.

National **NIPPO**
**Batteries**

నిప్పో బ్యాటరీలు—జపాన్ దేశపు నేషనల్ వారి సాంకేతిక విజ్ఞానంతో తయారుచేయబడినవి.

INL.5,85-A-TEL

# మౌనవిపంచి

"అచేమిటి కృష్ణా వెళ్ళి వెళ్ళి అక్కడెక్కడో నాకేమంత యిష్టంగా లేదురా

"అమ్మా, నువ్వూ నాన్న యీ విషయం ఆలోచించుకోండి ఒక నిర్ణయానికి వచ్చేముందు వాడి యిష్టాన్ని, అభిప్రాయాన్నీ మన్నించాలని గుర్తుంచుకోండి అంతేకాదు వాడు చిన్నవాడు కాదు పెద్ద వుద్యోగస్తుడు. వాడు మన నిర్ణయాన్ని ఆమోదించకపోతే పర్యవసానం ఆలోచించి మరీ నిర్ణయించుకోండి."

ప్రభావతమ్మకూ. రామస్వామిగారికీ యీ విషయంలో వొక నిర్ణయానికి రావడానికి యెక్కువ వ్యవధి పట్టలేదు

తమ యిష్టాన్ని ప్రకటిస్తూ "నీ విషయం యేమిటి?" అన్నారు.

నాకు మొదటి నుండే యిష్టమేను నాన్నా వాడు కావాలనుకున్నాక మనం యెందుకు కాదనాలి?"

కావాలని మాటల్ని మారు త్రోవ పట్టిస్తున్నాడని తెలిసి "నీ పెళ్ళి కాకుండా వాడి పెళ్ళి చెయ్యం కృష్ణా" అంది తల్లి

"నాకు పెళ్ళేమిటమ్మా "

గుండెల్ని లాగి. తీసి. యంత్రంలో వేసి తిప్పితే యెలా వుంటుంది? ఆ తల్లి మనసు గిలగిల్లాడింది

నా బంగారు కన్నా నీకేం తక్కువరా?" వణుకుతున్న కంఠంలో నుండీ వెలువడిన పలుకులు అస్పష్టంగా వినిపించాయి

నీ వుద్దేశం చెప్పయ్యా - తండ్రి

"మీ రెందుకిలా విచారిస్తున్నారో నాకు బోధపడటం లేదు

సర్వకాలాల యందు. సర్వ వ్యవస్థల్లోనూ వాంఛనీయమైనదాన్ని నువ్వు త్రోసి రాజనడానికున్న బలీయ కారణ మేమిటయ్యా?" ఆయనకు ప్రతి చిన్న అవసరానికి. పనికీ తమ మీద ఆధారపడిన ముప్ఫై యేళ్ళనాటి కృష్ణలా అనిపించాడు కొడుకు అతడ్ని లాలించి. బుజ్జగించి. నవ్వించి. సంతోషపెట్టాలనే బలీయమైన కోరిక ఆ తండ్రిని విచలితుడ్ని చేస్తోంది

"నీ మనసులోని మాట చెప్పు నాన్నా" తల్లి దీనంగా ప్రార్థించింది

బదులుగా అతడిచ్చిన నవ్వు ఆమె మనసులో బాకులా బలంగా నాటుకుంది




ఎందుకా విషాదం? ఎంత కాలంగా తన బాబు వోదార్పులేని బాధననుభవిస్తున్నాడు? ఆమెకు కొడుకును హృదయానికి హత్తుకుని లాలించాలనిపించింది "నీ కెవరిమీదనైనా యిష్టం వుందా?" – తండ్రి

"చెప్పు నాన్నా మా కెవరికైనా అభ్యంతరం లేదు–" తల్లి

"ప్రభాతను చేసికోవాలనుకుంటే "

"మా కిష్టమే' రెండో వారు పూర్తి వేశారు

అయినా అతనిలో చలనం లేదు

"ప్రభాత చిన్నపిల్ల ఆమెకు మంచి సంబంధం చూచి వీలైతే నందూ పెళ్ళితో చేద్దాం "

"నందూ పెళ్ళి ప్రభాత పెళ్ళి నీ పెళ్ళి విషయం చెప్పరా?"

'నేనేం చెప్పలేనమ్మా "

అతని కంఠంలోని నిర్లిప్తత తల్లి గుండెల్ని పిండి చేస్తుంటే. ఆ రాపిడి తాలూకు బాధను భరించలేక "కృష్ణా" అని బావురుమంది

నీ బాధను చూడటానికే నేను బ్రతికున్నానా? అరచేతుల్లో వుంచుకొని. గుండెల్లో దాచుకొని. కళ్ళల్లో నిలుపుకొని నిన్ను పెంచాన్రా ఇందుకేనా? నువ్వు సన్యాసిలా మారటం చూడనికట్రా?"

ఆమె కొన్ని నిమిషాల క్రితం కొడుకును వోదార్చాలనుకుంది అది జరుగక ముందే అతడు తల్లిని సమీపించి "నువ్వు పొరబడుతున్నావమ్మా నాకే బాధలూ లేవు కేవలం ఆ విషయంలో నిర్దుష్టమైన అభిప్రాయాలు లేకపోవడం వల్ల యిన్నాళ్ళూ దాటవేశాను "

"నీ మాటల గారడీని నేనిక నమ్మన్రా "

"ఒ కె అమ్మా నా నిర్ణయాన్ని నీ కెన్ని రోజుల్లో తెలియజెయ్యమంటావు?"

"వారం వొకే వొక వారం రోజులు గడువిస్తాను ఒక్క నెలలోపు నీ పెళ్ళి రంగరంగ వైభవంగా జరిగిపోతుంటే చూచి తరించి పోవాలి కృష్ణా "

"ఒ కె అమ్మా నీకు యిష్టం కలిగేలానే అన్నీ జరుగుతాయి "

తల్లిదండ్రులిరువురూ అతని నిర్ణయం కోసం యేడు రోజులు యేడు సంవత్సరాల్లా గడిపారు ఏడు రోజులూ యే విశిష్టతా లేకుండానే జరిగిపోయాక. కృష్ణచైతన్య తల్లి వద్దకు వచ్చి "అమ్మా నీ కాబోయే కోడల్ని చూస్తావా?" అన్నాడు

ఆమె ఆనందంతో తల మునకలు కాగా "ఎప్పుడు?" అంది

"అఫ్‌కోర్స్, నీవింతకు ముందొకసారి చూశావు"

"ఎవరు?"

"మచ్చలేని చందమామను చూపిస్తాను నువ్వేమీ ప్రశ్నించకూడదు నీ యిష్టప్రకారమే నా పెళ్ళి జరుగుతుంది అయితే నాకు యిష్టమైన రీతిలో జరగాలి "

"నేను కాదంటాన్రా "

ఆ సాయంత్రమే కృష్ణచైతన్యతో ప్రభావతమ్మ. రామస్వామి గారు సిద్ధమైనారు రాధకు ఫోన్ చేసి ఆమెను పిలిపించనీయనందుకు ప్రభావతమ్మకు కలిగిన కష్టం యెక్కువసేపు నిలవలేదు

సిగ చుట్టి. వెంకటగిరి చీరే కట్టి. బంగారు ఆభరణాలు ధరించిన ఆమెను చూచి "యెక్కడకమ్మమ్మా" అంది ప్రభాత

ప్రభావతమ్మ నిరుత్తరైంది

"డాక్టర్ విద్యా వాళ్ళింటికి" రామస్వామి నుండి వచ్చింది జవాబు.

"నేనూ వస్తానమ్మమ్మా"

అప్పుడే వచ్చిన కృష్ణచైతన్య "ఆమెను మనింటికి తీసికు వస్తాను ప్రభాతా" అన్నాడు

అతడు భావగర్భితంగా పలికిన పలుకుల్లో సారం యేమిటో ఆమెకు తెలియలేదు.

వారు ముగ్గురూ వెళ్ళేసరికి విద్య వీరి రాక కోసమే నిరీక్షిస్తోంది. ఇంటి అలంకరణలో ప్రత్యేక శ్రద్ధ తీసికోనప్పటికీ లోనికి అడుగు పెట్టగానే ఆహ్లాదకరంగా వుంది. ముందు గదిలో వున్న నాలుగు కర్చీల్లో నలుగురూ ఆసీనులయ్యారు.

"నిన్ను చాలా కాలం క్రితం చూశానమ్మా. అయినా నాకింకా బాగా గుర్తున్నావు" అంది ప్రభావతమ్మ.

విద్య చిరునవ్వు నవ్వింది.

కృష్ణచైతన్య టీపాయ్ మీదున్న ఇండియా టుడే తీసికున్నాడు. రామస్వామి గారు వొకే వొక్క క్షణం ఆమెను పరిశీలించారు. విద్య లేచి రిఫ్రెష్‌మెంట్సు కోసం లోనికి వెళ్తుంటే ప్రభావతమ్మ కూడా అనుసరించింది. ఇల్లు లోపలగూడా నీటుగా సర్దబడి వుంది.

ఆమె యిచ్చిన స్వీటు తింటూ రామస్వామి గారన్నారు. "కృష్ణ నా మొదటి సంతానం. వాడి పెళ్ళి నిరాడంబరంగా జరగడం తల్లికి కష్టంగా వుంది."

"మీరు నన్ను మన్నించాలి. నా తల్లి చివరి రోజులను గడుపుతోంది. నిజానికి నేను రెండు రోజుల క్రితమే వూరెళ్ళవలసింది. డా. కృష్ణచైతన్య గారు యీ విధంగా ప్రపోజ్ చేయడం వలన ఆగిపోయాను. అందువలనే నా తరపున పెద్దలు గూడా ప్రస్తుతం మీతో మాట్లాడటానికి యెవ్వరూ లేరు."

రామస్వామి గారు ఆమె కుటుంబ విషయాలు విచారించి సంతుష్టులయ్యారు. ఆమె తల్లి చావు బ్రతుకుల మధ్య నున్న విషయం తెలిశాక పెళ్ళి ఆలస్యం చేయవచ్చునేమోనని ప్రభావతమ్మ విచారించింది.

"అమ్మా, వీడ్ని నేను అందరికన్నా ముందు కన్నాను. ఆఖరివాళ్ళైన ఆడపిల్లలు పెళ్ళిళ్ళు ఐపోయాయి. వీడి తరువాత వాడైన నందూ వివాహం ఖాయమైంది. కృష్ణ కోసమె వేచి వున్నాడు వాడు. అవతల ఆ అమ్మాయి తల్లిదండ్రులను యిబ్బంది పెట్టడం భావ్యంకాదు". అంది.

విద్యకు ఆమె ఆంతర్యం స్పష్టంగా బోధపడింది.

ఆమెకూడా అన్ని విషయాలూ స్పష్టం చెయ్యదలచింది.

"అమ్మా" అని సంబోధించి "నా తల్లి చివరి క్షణాలను లెక్కిస్తోంది. ఈ సందర్భంలో, దాదాపు ముప్పై సంవత్సరాలుగా తలపెట్టని పెండ్లి గూర్చి యింట్లో చెప్పబూనటం యెంత అసమంజసంగా వుంటుందో మీరే చెప్పండి. అమ్మగాక నాకంటూ పెద్దలెవ్వరూ లేరు. అక్కయ్య అమెరికాలో సెటిలైపోయింది. మిగిలినవారంతా నాకన్నా చిన్నవారు. నా పరిస్థితులన్నీ విపులీకరించాననే నేను భావిస్తున్నాను. మీరు చెప్పినట్లుగా నడుచుకుంటాను". అంది.

రామస్వామి గారికీ, ప్రభావతమ్మకూ యిప్పట్లో విద్య యింట్లో వారెవ్వరూ ఆమె వివాహ విషయమై సంప్రదింపులకు రారనీ, ఆమె ఆ ప్రసక్తి వారితో తేదనీ అర్థమైంది. ఆమె పరిస్థితులన్నీ సానుకూలమయ్యే వరకూ ఆగే పరిస్థితి కాదు వీరిది.

"చివరి ఘడియల్లో కుమార్తె వివాహాన్ని గూర్చి విన్న మీ తల్లిగారు ప్రశాంతంగా, తృప్తిగా కన్ను మూయవచ్చును. లేదా యీ సంతోషం కలిగించిన బలంతో కోలుకోవచ్చును." అన్నారు రామస్వామి గారు.

విద్య అంగీకార సూచనగా తలవూపింది.

తండ్రి ఉద్దేశ్యాన్ని గ్రహించిన కృష్ణచైతన్య కలుగ చేసికుని "అతి త్వరలో వివాహం చేసికుని మనమే మీ అమ్మగారి వద్దకు వెళ్ళి ఆశీస్సులు పొందితే యెలా వుంటుందంటారు?" అన్నాడు.

విద్య ఒక్క నిమిషం ఆలోచించి రామస్వామి గారి దెస చూచి "మీ అంగీకారమైతే నాకభ్యంతరం లేదు" అంది.

ఏ మాత్రం సమయం యివ్వకుండా, అతి నిరాడంబరంగా జరగనున్న పెద్దకొడుకు పెళ్ళి ప్రభావతమ్మకు వొక విధంగా ఆనందంగానూ, మరొక విధంగా అసంతృప్తిగానూ వున్నప్పటికీ ఆమె యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా పెళ్ళి యేర్పాట్లన్నీ జరిగిపోయాయి.

(ఇంకా ఉంది)

# ఫాల్గుణి డైరీ

## "బసివి" సంబరం!

కర్నూలుజిల్లా ఆదోనిలోని ఓ తెగలో వో మూఢాచారం వుందట. ఆడపిల్ల పెద్దమనిషవగానే ఆమెకు "బసివి" అని వో సంబరం చేస్తారట. ఆనక ఆమె తన శీలాన్ని తనను కోరిన వో యువకునికి అర్పించాలట. ఆనక యిహ ఆమె అదే పద్ధతిలో పురుషుల కామ తృప్తి కోసమే జీవించాలట. ఈ బసివి అన్న పదం బసవడు అనే పదంలోంచి వచ్చి వుండొచ్చునని కొందరి అభిప్రాయం. ఆంబోతును "బసవడు"గా ఎంచి అచ్చుపోసి వదిలినట్లు ఈ ఆడవారిని వదలడంబట్టి ఈ పదానికి ఆ పదానికి సంబంధం వుంటుందని

అభిప్రాయమట. ఆ గ్రామంలో యీ "బసివి"లు సుమారు 199 మంది వున్నారట. వీళ్ళు పత్తి మిల్లుల్లోనూ, నూలు మిల్లుల్లోనూ పని చేసుకుంటూ, తమకేసి చూసి పళ్ళికిలించిన పురుషునికి కామ విందులు అర్పిస్తూ వుంటారట. వీరి సంతానం 378 మంది లెక్కకు తేలారట. ఆడపిల్లలను మళ్ళీ బసివిలుగా మార్చి, మగాళ్ళను రోడ్లకు వదిలి వేస్తారట వీళ్ళు

## ఎన్నికల ప్రచారం చేసిన సింహం!

బరేలి కంటోన్మెంట్ నియోజకవర్గం నుంచి ఇండిపెండెంట్‌గా పోటీ చేస్తున్న అఫ్సర్ అహమ్మద్ తన గుర్తు అయిన సింహాన్ని సజీవంగా తనతో పాటు ఎన్నికల ప్రచారానికి తీసుకు వెళ్లారట. ఈయన సింహాన్ని తనతో ప్రచారానికి తీసుకు వెళ్ళడానికి వన్యమృగ సంరక్షణాధికారి అనుమతి తీసుకున్నారట – ఏ పని చేసినా సరే... అనుకున్నది సాధించు అన్నారు కదా పెద్దలు!

## చైనాలో రామాయణానికి గిరాకీ!

వాల్మీకి రామాయణం, కాళిదాసు, టాగూర్ రచనల వంటివి ఎన్నో చైనా భాషలోకి అనువదింపబడ్డాయట. వాల్మీకి రామాయణాన్ని అనువదించిన ప్రొఫెసర్ జి. క్సియాన్ లిన్ బీజింగ్ విశ్వవిద్యాలయం మాజీ వైస్ ఛాన్సలరట. తనకు యీ మహత్ కావ్యం అనువదించడానికి మూడు సంవత్సరాలు పట్టిందని.. అచ్చు వేసిన 20 వేల కాపీలు ఛట్టున అమ్ముడైపోయాయని ఆయన వో సభలో కొత్త ఢిల్లీలో అన్నారట.

## అరుదైన తాబేలు!

దక్షిణ అమెరికాకు చెందిన వాల్కనిక్ దీవులలో ఓ బృహత్ కూర్మం వుందట. ఈ తాబేలు 5 అడుగుల పొడవు, రెండున్నర అడుగుల ఎత్తు, 400 పౌనుల బరువూ వున్నదట. రోజుకు సుమారు 4 మైళ్ళు వ్యాహ్యాళికి వెళ్తూ వుందట.ఇది బహుశా డార్విన్ ఊహలోని గాలపెగోస్ అయ్యుండచ్చునేమో!

## చైనాలో కుటుంబ నియంత్రణ పథకం!

చైనా దేశంలో యీ సంవత్సరాంతపు లెక్కలలో 100 కోట్ల జనాభా తేలారట. 2050వ సంవత్సరం నాటికి వీరు అభివృద్ధియై 145 కోట్లుగా మారే వుత్సాహం వారిలో కనుపిస్తోందని చైనా భయపడుతోందట. అక్కడ కుటుంబ నియంత్రణ ఓ చక్కని పథకం మీద నడుస్తోందట. ఒకే ఒక బిడ్డను కన్న దంపతుల ఆ బిడ్డకు 14 సంవత్సరాలు వచ్చే వరకూ ఆ బిడ్డ తండ్రి జీతంలో పది శాతం ఎలవెన్సుగా ఆ తండ్రికి యిస్తారట. అంతే గాక ఆ పిల్లాడు స్కూలులో కాలేజిలో, వుద్యోగాలలో, చివరికి రేషనులో కూడా ఆ కుటుంబానికి ప్రత్యేక సదుపాయాలు ప్రభుత్వ మిస్తుందట. ఆ బిడ్డ ఆడపిల్లయితే మరింత శాతం సదుపాయాలు యిస్తుందట. ఆ దంపతులు రెండో బిడ్డను కన్నారు కనుక, మొదటి బిడ్డ కిచ్చిన జీతపు 10 శాతం ఎలవెన్సుతో సహా అన్ని సదుపాయాలూ పోతాయట. ఇహ మూడో సంతానం బయట పడిందీ అంటే ఆదాయం మీద 10 శాతం పన్నుగా వసూలు చేస్తారట. మన దేశంలో 1984 లో వున్న 74 కోట్ల జనాభా 2050 నాటికి 151 కోట్లుగా మారుతుందని ఆ లెక్క తేసిన వారే అంటున్నారు కదా- వ్వై ఆవర్ ఇండియా యీజ్ నాట్.....

## చెత్త కుండీలో పసిపిల్ల!

చికాగో నగరంలో వో బోల్డు అంతస్థుల భవనంలో 14వ అంతస్థులో ఆటలాడుకుంటున్న 3 ఏళ్ళ పసిపిల్ల క్విడ్ స్టోన్ కాలుజారి, ఆ భవనం మీంచి క్రిందపడిపోయిందట. పిల్ల నాడించే ఆయా ఓ కునుకుతీసి లేచాక పిల్ల కనుపించక పోయేసరికి ఆ పిల్ల తల్లిదండ్రులకు ఫిర్యాదు చేసిందట. వారు ఆ భవనమంతా గాలించి, పోలీసు రిపోర్టు కూడా యిచ్చి ఫలితం లేక బావురుమన్నారట. ఆ మర్నాడు చెత్తను తీసుకుపోయే లారీ ఆ భవనం వెనకున్న చెత్త కుండీ వద్దకు వెళితే అందులో యీ పసిపిల్ల ముక్కుతూ, మూలుగుతూ వున్నదట. ఈ విషయం వాళ్ళు ఆ భవనంలో వారికి చెప్పేసరికి, ఆ పిల్ల తల్లిదండ్రులు పరుగున వచ్చి తమ పిల్లను తీసుకుని తృప్తిగా మరోసారి బావురుమన్నారట. అంత ఎత్తు నుంచి చెత్త కుండీలో పడి, వో రాత్రంతా ఆహారం లేకుండా అలానే అందులోనే వున్న ఆ పిల్ల ఆయుర్దాయం ఎంత గట్టిదోనని ఆ భవంతి ఆశ్చర్యపోయిందట–వుయ్ టూ!! □









**ఎల్. ఆర్. – విశాఖపట్నం**

నాకు 2 సంవత్సరాల క్రితం కుడి వైపు హెర్నియా ఆపరేషన్ జరిగినది. యిప్పుడు నాకు యిద్దరు మగ సంతానం. వేసక్టమీ చేయించుకోవాలని అనుకుంటున్నాను. ముందు జరిగిన హెర్నియా ఆపరేషన్ వలన వేసక్టమీ చేయించుకుంటే ఏమైనా ప్రమాదమా?

● ముందు జరిగిన హెర్నియా ఆపరేషన్‌కీ ఇప్పుడు చేయించుకోబోయే వేసక్టమీ ఆపరేషన్‌కీ సంబంధంలేదు. ఏ ప్రమాదమూ లేదు. ధైర్యంగా చేయించుకోండి.

**బి. యస్. – సికిందరాబాదు**

మా అక్కయ్య కూతురికి 13 నెలలు నిండినవి. అయినను యింకా పళ్ళు రాలేదు. కారణమేమిటి?

● కొందరికి ఇలా ఆలస్యం అవటం సహజం. దీనివల్ల ఆదుర్దా అనవసరం. మీకు అనుమానంగా ఉంటే చిన్నపిల్లల వైద్య స్పెషలిస్టుకి చూపించి క్రెటినిజం ఉందేమో చూసి చెప్పమనండి.

**బి. వి. ఆర్. – కాకినాడ**

వరిబీజము వున్నవారు రతిలో పాల్గొనవచ్చునా? పాల్గొంటే వారికి ప్రమాదమా?

● నిస్సందేహంగా పాల్గొనవచ్చును. పాల్గొన్న ఇరువురికీ ఏ ప్రమాదమూ లేదు.

**సి. ఆర్. ఆర్. – కడప**

నాకు పై వరుసలో 16 పళ్ళు వున్నాయి. కానీ క్రింద వరుసలో 14 మాత్రమే వున్నాయి. చివరి దవడ పళ్ళు 2 రాలేదు. నాకు తెలివి తక్కువని, లోకజ్ఞానం తక్కువని అనుకుంటున్నాను.

● లోకజ్ఞానం దంతాల మీద ఆధారపడి ఉంటే ఇంకే సమస్యా లేదు కదా! అప్పుడు అందరూ దంతాలు ఊడకుండా చూసుకోవచ్చును.

దంత వైద్యునికి చూపించి ఆ దంతాలు రాకుండా కండ అడ్డంగా ఉందేమో చూసి దానిని తొలగించమనండి.

**యం. – చీరాల.**

★ రుమాటిజం, సిఫిలిస్ రెండూ ఒకటేనా? రుమాటిజం ఎందువలన వస్తుంది? సిఫిలిస్ ప్రథమ దశ రాకుండానే నర్వ్‌సిఫిలిస్ వచ్చే అవకాశం వుందా? వీటిలో ఏది ఎక్కువ ప్రమాదకారి? వీటిని గుర్తించటం ఎలా?

● రుమాటిజానికీ, సిఫిలిస్‌కీ ఏ సంబంధమూ లేదు. నాకు వచ్చే ఉత్తరాలలో చాలామంది పొరపాటుగా 'రుమాటిజం' అని రాయటానికి, బదులుగా 'రూమాన్‌టిజం' అని 'రొమాంటిజమ్' అనీ వ్రాస్తూ ఉంటారు. రొమాన్‌టిజం (రొమాన్స్) అంటే ప్రేమ వల్ల కలిగే రోగం కాబట్టి మీరు ఈ సంబంధం అంట కట్టి ఉండవచ్చును.

ప్రథమదశ లేకుండా నర్వ్ సిఫిలిస్ రావటం గ్రుడ్డు లేకుండా పిల్ల పుట్టినట్లే. రోగ లక్షణాలను వైద్యుల చేత గుర్తింప చేయడం చాలా అవసరం. మీకు మీరే తీర్మానించకూడదు.

**యస్. పి. సి. – నల్లగండ్ల.**

★ నా కుమార్తెకు 14 సంవత్సరములు. సంవత్సరం క్రితం మోకాళ్ళు, మోచేతులయందు కీళ్ల నొప్పులు వచ్చి నడవటానికి కష్టంగా వుండేది. ఇంగ్లీషు, ఆయుర్వేద, నాటు మందులు వాడాము. చివరికి సంవత్సరం తర్వాత నొప్పులు తగ్గినవి. కానీ గుండె దడ వచ్చి భయము, ఆకలి మందగించటం జరిగినది. డాక్టర్లు గుండె కవాట ద్వారం కుంచించుకొని పోయిందన్నారు.

● మీ అమ్మాయికి బహుశ ఇదివరకు రుమాటిక్ ఫీవర్ వచ్చి ఉంటుంది. ఆ రోగాన్ని సరిగా నయం చెయ్యకపోతే గుండె బలహీనం అయి, అందులోని కవాటాలు పాడయిపోయే ప్రమాదం ఉంటుంది.

మీరు నిపుణులైన కార్డియాలజిస్టుల సలహా ప్రకారం మందులు వాడటమో లేక వారి సలహా ప్రకారం శస్త్రచికిత్స చేయించటమో మంచిది.

**బి. యస్. – నరసన్నపేట.**

★ రెండు నెలల క్రిందట నాకు అపెండిసైటిస్ ఆపరేషను జరిగినది. అపుడు లింఫ్‌నోడ్ బయాప్సీ జరిపితే టి. బి. అబ్‌డొమిన్ అని తెలినది. మందులు వాడుచున్నాను. నేను తరచు 'పైపరజైన్ సిట్రేట్' నులి పురుగులు పోవుటకు వాడేవాడిని. దీనికి అదే కారణమా? నులి పురుగులు పూర్తిగా నివారింపబడు మార్గము కూడా తెలుపండి?

● నులి పురుగులు పోవటానికి వాడే మందులకి కడుపులోని భాగాలలో క్షయ రోగం రావటానికి సంబంధంలేదు.

వ్యక్తిగత పరిశుభ్రత, శాస్త్రీయంగా కట్టబడిన మరుగుదొడ్లలో మలవిసర్జన, ఆ సమయంలో పాదరక్షలు ధరించటం, గోళ్ళు కత్తిరించుకోవటం, కటుంబంలోని వారందరూ ఒకేసారి మందులు వాడటం, మీరు వాడినే మందులతో బాటుగా తీసుకోవలసిన చర్యలు. 





**గమనిక**

డాక్టర్ సలహాలు, ప్రశ్నావళి శీర్షికలకి ప్రశ్నలు పంపేవారు ఆ శీర్షిక పేర, ఆంధ్రసచిత్ర-వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి. రాసిన వారి పేరు, పూర్తి చిరునామా ఇవ్వడం ఎంతైనా అవసరం అని గమనించగోరుతున్నాము. సం.

# అల్లుడు కాదు... మొగుడు

— సుధ...












# హైదరాబాదు నోట్‌బుక్

## ప్రభుదత్త బ్రహ్మచారి

తెల్లటి మూరెడు గడ్డంతో, మిలమిల మెరిసే కన్నులతో, మారేళ్ళు నిండినా ఖంగు మనే కంఠంతో ఎదుటివాని మనస్సును ఒప్పించే వాదపటిమతో, భాగవత ప్రచారమే ప్రధాన ధ్యేయమైన జీవితంతో దేశమంతా నిర్విరామంగా పర్యటిస్తున్న శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి అలనాటి అగస్త్య మహర్షిని తలపిస్తారు. లల్లూలాల్ శతాబ్దం క్రింద భాగవత కథను ప్రేమసాగర్ అనే పేరుతో వచనంలో రచించాడు. కాని, అది వ్రజభాషా గంధిగా వున్నందువ, దేశమంతా పఠించి తరించాలనే దృష్టితో శ్రీ బ్రహ్మచారి భాగవతాన్ని 118 ఖండాలుగా ఖడీబోలీలో అనువదించారు వందకు పైగా భాగవత సప్తాహాలు జరిపారు. గోవధ నిషేధాన్ని కోరుతూ 80 రోజులపాటు నిరాహారదీక్ష జరిపారు. రాజకీయ వాదులకు జ్ఞాపకముంటుంది.



శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

మొదట లోక్‌సభ ఎన్నికలలో అలాహాబాద్ నియోజకవర్గం నుంచి భారత ప్రధాని పండితజవహర్‌లాల్ నెహ్రూపై పోటీచేసి ఓడిపోయారు. ప్రస్తుతం ఆయన ఢిల్లీలో కొండమీదఉన్న తమ ఆశ్రమంలో దాదాపు 200 అడుగుల హనుమంతుని విగ్రహం స్థాపించే కార్యక్రమంలో నిమగ్నులయి వున్నారు. దీనికి అఖండమైన నల్లరాయిని కర్నాటక దేశంలో సంపాదించారు. విగ్రహ నిర్మాణానికి దాదాపు 20 లక్షలు వ్యయమవుతుందట. ఇక దానిని ఢిల్లీకి తరలించటానికి కొన్ని లక్షలవుతుంది. భారత రాజధాని ఢిల్లీలో భారతీయ సంస్కృతిని తెలిపే గొప్ప చిహ్నమేమీ లేదే అని డాక్టర్ రఘువీర, నాతో తరచూ విచారం ప్రకటించేవారు ఆయన కుమారుడు డాక్టర్ లోకేశ చంద్ర తరచు ఈ విషయాన్ని గురించి వ్యాసాలు వ్రాశారు. ఈ విగ్రహ స్థాపనతో డాక్టర్ రఘువీర కోరిక నెరవేరి ఆయన ఆత్మకు శాంతికలుగుతుంది. శ్రీ బ్రహ్మచారి హనుమద్విగ్రహ ప్రతిష్ఠాపన యజ్ఞం కోసం దేశమంతా పర్యటించి దేశ ప్రజల సహాయసహకారాలు అభ్యర్థిస్తున్నారు. ఆయన ఫిబ్రవరి 20న హైదరాబాదు వచ్చి, రెండు మూడు రోజులపాటు వివిధ సంస్థలలో ప్రసంగించారు. 22 వతేదీ సాయంకాలం శంకర మఠంలో జరిగిన సమావేశంలో భారతీయ సంస్కృతికి పురాణాలు ఎలాంటి పునాదులో వివరించారు. మన పురాణాలు విజ్ఞాన సర్వస్వాలని, వేద విజ్ఞానాన్నంతా అందరికీ అందిస్తున్న మిత్రసమ్మిత రచనలని ఆయన అన్నారు. ఢిల్లీలోని లక్ష్మీనారాయణ మందిరం ఆధునిక యాత్రాస్థలమయింది. శ్రీ బ్రహ్మచారి మహరాజ్ ప్రతిష్ఠించబోయే హనుమద్విగ్రహం, అంబరాన్ని చుంబిస్తూ ఆగంతుకులకు స్వాగతం చెప్పనున్న హనుమద్విగ్రహం స్వదేశీయులకే గాక, విదేశీయులకూ యాత్రాస్థలం కాగలదనడంతో సందేహం లేదు.

## ఇక్‌బాల్ కవితా ప్రశంస :

కవుల జీవితం కావ్యంగా వుండాలి. ఇక్‌బాల్ కవి జీవితం అలాటిది—అని హరియాణా గవర్నర్ శ్రీ ఎస్. ఎం. హెచ్ బర్నే 'వర్తమాన భారతానికి ఇక్‌బాల్ సందేశానుసరణం' అనే విషయమై ప్రసంగిస్తూ అన్నారు. ఇక్బాల్ కవిత భావావేశ భరితం, ప్రేరకం, కుసుమపేశలం, ఆత్మసంకల్పం, ఆత్మగౌరవం, స్వావలంభనం, ఆత్మ విశ్వాసం పొంగులూరుతున్నట్టిది. ఈ గుణాలు నేడు అవసరం అని శ్రీ బర్నే అన్నారు. నూతన భావాలనుంచి నూతన ప్రపంచం వుదయిస్తుంది. ఇక్‌బాల్ కవిత క్రియాత్మక, ఖుద్ కోకర్ బులంద్ అనే కవితా ఖండికలో "నీవుకాంతిని సృష్టించావు నేనుదీపాన్ని కనిపెట్టాను" అని భగవంతునికన్నా మానవుని గొప్పతనం నిరూపించాడని శ్రీ బర్నే అన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జరిగిన ఈ వుత్సవం ప్రారంభంలో వైస్ చాన్సలర్ శ్రీ సైయద్ హాషిం అలీ స్వాగతం చెప్పారు. శ్రీ బర్నే గవర్నర్‌గా నియమితుడైన తొలి ఐ.ఎ.ఎస్. అధికారి అని శ్రీ హాషింఅలీ అన్నారు. ఒరిస్సా మాజీ గవర్నర్ శ్రీ అక్బర్ అలీఖాన్ అధ్యక్షత వహించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం డైరెక్టర్ డాక్టర్ నవనీతరావు ధన్యవాదాలు చెప్పారు. ఇక్కడ ఇక్బాల్ గురించి ఒక్కమాట చెప్పాలి. ఆయన రచించిన 'సారేజహాసేఅచ్ఛాహిందోస్తా హమారా' గీతాన్ని తెగ ప్రచారం చేస్తున్నది ప్రభుత్వం. ఈ గీతాన్ని ఆయన పాకిస్తాన్‌ను సమర్థించకముందు, ముస్లింల కోసం రచించారు.

ఐ! ఆబోరోద్ గంగా
వహదినహైయాద్•తురుఖ్‌కో
ఉతరాతేరే నారే
వహ కారవాఁ హమారా

ఒడ్లనుఒరుసుకొని పారే ఓగంగా, నీతీరంలో మా బిడారు విడిసిన దినం జ్ఞాపకం వుందా? అని ప్రశ్నిస్తారు. ఆటుతర్వాతఆయనపాకిస్తాన్‌ను సమర్థించి దానికి ఆ పేరు పెట్టడంలో పాత్రవహించిన ప్రముఖులలో ఒకరయ్యారు. పాకిస్తాన్ రాకపోతే, హిందూస్తాన్ వారికి పుట్టుగతులుండవని తిట్టిపోశాడు. ఆయన పాకిస్తాన్ అనే పేరులోని అక్షర ప్రాధాన్యాన్ని వివరిస్తూ, జాతిద్వయ సిద్ధాంతాన్ని సమర్థిస్తూ చేసిన ప్రసంగాలు నేను విన్నాను. ఆయన గొప్పకవి. సూఫీవేదాంతి. ఆయన గొప్పతనంలో ఎంతమాత్రమూ సందేహం లేదు. కాని, ఆయన భారత విభజన కారకులలో ఒకరు. భారత నాయకుల ప్రత్యర్థి కనుక ఆయన రచనలు మనకు ఉపాదేయాలు కావు. వీరాధివీరుడు వినాయక దామోదర సావర్కర్ గొప్పదేశ భక్తుడు, దేశభక్తి ప్రేరకాలయిన రచనలు ఎన్నో చేశారు. వాటిని ప్రభుత్వం ప్రోత్సహిస్తుందా? లేదు. ఆయన తర్వాత హిందూ మహాసభ వాడయ్యాడు గనుక. అలాగే కాంగ్రెస్ ప్రముఖులుగా వుండి తర్వాత కమ్యూనిస్టులు సోషలిస్టులుగా మారిన శ్రీ సుందరయ్య మున్నగువారి సూక్తులను ప్రభుత్వం ప్రచారం చేస్తున్నదా? అలాటివారి రచనలు శత్రువర్గంవి కావడం. శ్రీ జిన్నాతో చేతులు కలిపి, జాతిద్వయ సిద్ధాంతాన్ని బలపరిచి దేశం ముక్కలు కావడానికి కృషి చేసిన ఇక్బాల్ రచనలను ప్రచారం చేయడం ఏమి న్యాయం? ఈ విషయములో కొంచెం ఆలోచన అవసరమని నా మనవి. ఎవరి ఉదాత్తకవిత కవిత అయినా, మనకు ఆదరణీయమే. కాని ఏవో నోట్లు వస్తాయిగదా అని ఒక దేశవిభజన కారుడు ఎప్పుడో వ్రాసిన వాటిని ప్రచారం చేయడం భావ్యం కాదు. కొంత కాలానికి సారే జహాసే గీతమే జాతీయగీతంగా స్థిరపడే ప్రమాదం వుంది.

## ఉపశ్రుతి :

ఏంసార్, మీ కవితకు నిరుడు అవార్డు వచ్చినట్టు దూరదర్శన్‌లో విన్నానే మాకు చెప్పనేలేదే? అని నిష్ఠూరం మోపాడు నా అభిమాని శ్రీ కల్లూరి భాస్కరం నేనెప్పుడూ తెలుగు కవిత చెప్పలేదే! అన్నాను. దూరదర్శన్ పుణ్యాన చాలామందికి చాలా కొత్త హోదాలు వస్తున్నాయి. స్వీకరించండి—అన్నాడు పక్కన ఉన్న ఒక పెద్ద మనిషి.

— తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S Radhakrishna,
Phones P B X 61247, 61248 & 75667

గ్లాక్సో కానుక

తక్షణ శక్తిదాయక అద్వితీయ పానీయం
జిల్లనిపించే నారింజ రుచి గలది



విటమిన్-సి తో
పరిపుష్టమైనది.

ఎక్కువ ధరైన
పంచదార
కలపనవసరం
లేదు

గ్లూకోజ్ చేరిన కొత్త గ్లూకోన్-సి. మీ బిడ్డను ఉరుకుల పరుగుల ఉత్సాహంతో నింపి ఉంచే, అనుకూలమైన సత్వర శక్తిదాయక ఆహారం.

ఇది, పిల్లలలో పళ్లు, ఎముకలు, శరీర ధాతువుల పెంపుదలకు అత్యవసరమైన విటమిన్ సితో పరిపుష్టమైనది.

ఒక గ్లాసు చల్లని ఐస్ వాటర్‌లో నాలుగు టీ స్పూన్ల గ్లూకోన్-సి కరిగించి, జిల్లనిపించే నారింజ రుచిగల ఉల్లాస పానీయాన్ని తయారుచేయండి, రోజుకు రెండుసార్లు మీ బిడ్డకివ్వండి.

GLUCON-C

The unique, refreshing instant energy drink with a tangy orange taste.

Ingredients:

ARTIFICIALLY COLOURED AND ARTIFICIALLY FLAVOURED

Glaxo



గ్లూకోన్-సి

GLL-1174 R

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA
5-11, April, '85